# ఓ మహిళా! ముందుకుసాగిపో



మల్లాది సుబ్బమ్మ

## రచయిత ప్రచురణలు

| | |
|---|---|
| మనం దేనికి బానిసలం? | వ్యాస సంకలనం |
| తల్లే పిల్లను చంపితే! | వ్యాస సంపుటి |
| వెలిగిన జ్యోతి | నవల |
| విముక్తి ఉద్యమాలు : మహనీయులు | వ్యాస సంకలనం |
| ఆధునిక స్త్రీ | వ్యాస సంపుటి |
| ఓ మహిళా! ముందుకు సాగిపో | వ్యాసావళి |
| మారుతున్న సమాజం : మహిళలు | వ్యాస మంజరి |

## అచ్చులో

చీకటి వెలుగు — నవల

( విశ్వ రచనలో ధారావాహికంగా ప్రచురితము )

## రాబోవు రచనలు

ఇస్లాం : స్త్రీలు
క్రైస్తవం : స్త్రీలు
వివాహవ్యవస్థ
మాతృత్వానికి మరోముడి (కథల సంపుటి)
స్త్రీలు : లైంగిక సమస్యలు

# ఓ మహిళా! 

# ముందుకు సాగిపో

మల్లాది సుబ్బమ్మ

ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహిదీ పట్నం,
హైదరాబాద్-500 028

ప్రజాస్వామ్య ప్రచురణలు నెం. **15**

# ఓ మహిళా! ముందుకు సాగిపో

రచన: మల్లా సుబ్బమ్మ



ప్రథమ ముద్రణ 1982

ప్రతులు— 2000



పబ్లిషర్సు:-

ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్.
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ
మెహిదీపట్నం, హైదరాబాద్-500 028

సోల్ డిస్ట్రిబ్యూటర్స్:

**వికాసం**
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ
మెహిదీపట్నం, హైదరాబాద్-500 028
ఫోన్ నెం. 31423

వెల రు. 7-00

ముద్రణ
**లిబర్టి ప్రింటర్స్**
చీరాల - 523 155

# స్వ వి ష య ం

"ప్రజాస్వామ్య ప్రచురణలు" ఒక వినూత్న ప్రయత్నం. ఇతర సంస్థలతో రూపసామ్యం వున్న ఆదర్శాలలో, లక్ష్యసాధనా విధానాలలో, కార్యాచరణ రీతులలో భిన్నమైనది.

వ్యక్తి జీవితంలో, సమాజ జీవితంలో అన్ని రంగాలలో ప్రజాస్వామ్యం వెల్లివిరిసి మూడు పూవులు, ఆరు కాయలుగా వర్ధిల్లాలని ఈ సంస్థ అభిమతం, ఆశయం కూడాను.

ఇలాంటి ప్రయత్నాలు పూర్వం జరిగినవి. ప్రస్తుతం జరుగుతున్నవి. కాని, వానికీ - ఈ ప్రయత్నానికీ తారతమ్య మున్నది. ఉదాత్తమయిన ఆశయాలతో, ఉత్తేజంపొందిన మేధావుల సమిష్టి సహకార కృషి ఫలితంగా ఈ సంస్థ ఉద్భవించింది.

విశ్వ జనీనతే దీని విశిష్టత. మొత్తం మానవ ప్రపంచ సంస్కృతీ సాహిత్యాలు దీని వారసత్వం. ముఖ్యంగా భారతదేశ సంస్కృతిలో ఇంతవరకు మరుగున పడిన మాణిక్యాలు—చార్వాక, కపిల, కణాదుల మతాలు, సిద్ధాంతాలు దీని సొమ్ము. తెలుగుదేశమే కాదు. తెలుగు భాష విస్తరించిన ప్రాంతమంతా దీని కార్యక్షేత్రము.

ప్రపంచంలో విప్లవాలు ఎక్కడ వచ్చినా, ఏ కాలమందు జరిగినా, అవన్నీ దీనికి అధ్యయన యోగ్యాలే. ఇంగ్లండులో 1689 లో బ్రిటిషు రాచరికానికి పరిమితులు, హద్దులు విధించిన విప్లవం: అమెరికాలో 1776 లో ప్రాతినిధ్యాధికారమున్నవారే పన్నులు విధించగల హక్కుదారులనే 'ప్రజాస్వామ్య' సూత్రాన్ని ఎలుగెత్తి చాటిన విప్లవం: 1789 లో స్వేచ్ఛ, సమానత్వము, సౌభ్రాతృత్వము ఆదర్శాలుగా విజయవంతమయిన ఫ్రెంచి విప్లవం; 1917 లో 'భూమి, తిండి, శాంతి' నినాదాలతో కార్మికవర్గం, మధ్యతరగతి రష్యాలో సాధించిన విప్లవం: 1947 లో భారతదేశం పొందిన స్వాతంత్ర్యం; 1949 లో కర్షకబలంతో చైనాలో జరిగిన విప్లవం మొదలయిన చారిత్రాత్మక సంఘటనలను లోతుగా, సునిశితంగా, సమ్యక్‌దృష్టితో పరిశీలించి తదనుగుణమైన ప్రచురణలు చేయాలని ఈ సంస్థ ఆదర్శం.

సామాజిక పరివర్తనకూ, భావగమనానికీ అవినాభావ సంబంధమున్నదనే విషయం జగద్విదితం. అయితే భావాలు ప్రాతిభాసికాలేనా

లేక మానవ మస్తిష్కములో ఉదయించిన తరుణం నుంచీ ప్రత్యేక గమన సూత్రాలతో స్వతంత్ర లక్షణాలు కలిగి పెంపొందుచున్నవా? రెండవ స్వరూపం అవశ్య పరిగ్రహణయోగ్యం. ఈ సూత్రాన్ని విశ్వవిఖ్యాత విప్లవవాది, మేధావి అయిన యమ్. యన్. రాయ్ 1946లో ప్రవచించాడు. ఈ భావన యీ సంస్థకు జీవగర్ర.

వ్యక్తివాదం, హేతువాదం, మానవవాదం ఈ సంస్థను శాసించే త్రికము (త్రిగుణాలు). మానవులంతా ఒకటే; మానవ సమాజానికి మూలం మానవుడే; మానవుని అభ్యున్నతియే మానవ సమాజ అభ్యుదయానికి, శ్రేయస్సుకు కొలమానం లేక వరుమానం; ప్రకృతి నియమబద్ధమైనది కనుక ప్రకృతినుంచే ఉద్భవించిన మానవుడుకూడా వస్తుతః నియమబద్ధుడు. అంటే హేతువాది. కనుక అతడు నీతివంతుడుగా మనగలడని ప్రకటించిన రాడికల్ హ్యూమనిజం యొక్క తాత్విక సిద్ధాంతం ఈ సంస్థకు వెలుగు బాటగా అడుగడుగునా ప్రభావితం చేస్తుంది.

మానవవాదం యీనాటిది కాదు. మానవజాతి సహజంగా మనుగడ సాగించినప్పటినుంచీ యీ తాత్విక చింతన జరుగుతూనే వచ్చినది. కాని ఆధునిక యుగంలో మానవ విజ్ఞానం ఎంతో అభివృద్ధి చెందటంతో ప్రస్తుతం నూతన భాష్యాలతో, వినూత్న విషయ పరిజ్ఞానంతో ఆ పాత కాలపు మానవవాదాన్ని పరిశీలించి, సవరించి, పునరుద్ధరించవలసిన అవసరమేర్పడినది. అకృషి ఫలితమే యమ్.యన్.రాయ్ నవ్యమానవవాదం

స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణ మానవ మనుగడ ప్రేరకాలని పేర్కొనటం ఈ నవ్యమానవవాద విశిష్టత. (1) అంతరాత్మ ప్రేరిత నీతి లేక దైవ నిర్దేశిత నీతి: (2) ప్రయోజనాత్మక నీతి; అనే రెంటికీ ప్రత్యామ్నాయంగా హేతుబద్ధమయిన నీతిని చాటిచెప్పినది. రాజకీయరంగంలో పార్టీ రహిత ప్రజాస్వామ్యాన్ని ప్రతిపాదించినది. ఆర్థిక రంగంలో సహకార సంబంధమయిన ప్రణాళికా రచనలను రూపొందించినది. సాంస్కృతిక రంగంలో భావ స్వతంత్ర ప్రతిపత్తిని గుర్తించినది. సాంఘికంగా కుల, మత, వర్గ, లింగ, ప్రాంతీయ, భాష, జాతి, దేశ విభేదాలను నిరసించినది; విశ్వజనీయ సంస్కృతికి విలువ నిచ్చినది. ఏకత్వంలో భిన్నత్వాన్ని, భిన్నత్వంలో ఏకత్వాన్ని చూడగల్గినది. అంధ విశ్వాసాలకు గొడ్డలిపెట్టు. ప్రబోధ కార్యక్రమాలను బలపరుస్తుంది. అందులో ఒక భాగమే ఈ సంస్థ ప్రచురణ యత్నం.

ఈ ప్రకృతికి అతీతమయిన మరే యితర శక్తి లేదని తెలుసుకొనటం న మనుగడకు, భవిష్యత్తుకు తానే బాధ్యుడనని గుర్తెరగటం, తన క్షేమా కీ, అభ్యున్నతికీ, తోటి మానవుల శ్రేయస్సుకూ వైరుధ్యంలేదనే విష యాన్ని గ్రహించి సమాజ స్థితిగతులను మెరుగు పరచటానికి ఉద్యుక్తుడు వడం ఉత్తమ మానవలక్షణం.

ఈ మానవవాద లక్ష్యాలనే 1952 లో నెలకొల్పబడిన అంతర్జాతీయ హ్యూమనిస్టు నైతిక సంఘం మరోరూపంలో ప్రకటించినది. భారత రాడికల్ హ్యూమనిస్టు సంఘాన్ని ఆ ప్రపంచ సంస్థ గుర్తించి పూర్తి భ్యత్వాన్నిచ్చినది. ఆ అంతర్జాతీయ సంఘం ఐదు ఖండాలలోని అనేక శాలలో అనుబంధ సంస్థలు కలిగి అసమానమైన కృషి సాగిస్తున్నది.

ప్రస్తుతం ప్రపంచ మానావాళి సాంస్కృతికంగా విషమస్థితిలో చిక్కు ని యున్నది. ఒకవైపు మత ప్రాబల్యాలు, మరోవైపు ఫాసిజం, మ్యూనిజంలాంటి నియంతృత్వ విధానాలు చలామణి అవుతూ ప్రజల సంక్షేమం కొరకు ప్రజల ఆశయాలను నెరవేర్చకపోగా హీనస్థితికి దిగజార్చు మన్నవి. దీని ఫలితంగా తృతీయ మార్గాన్వేషణ ప్రారంభ మయినది. విజ్ఞానం పెరుగుదల, మానవ మేధస్సు-సృజనాశక్తి అభివృద్ధి చెందడంతో నూతన తాత్విక చింతనలకు ప్రాతిపదిక ఏర్పడినది.

దీనినే నైతిక హ్యూమనిజం అని పిలవటం కూడా కద్దు. ఇది ప్రజా స్వామ్య సూత్రానికి కట్టుబడి వున్నది. ప్రతివ్యక్తి సాధ్యమైనంతగా వికాసం పొందటానికి హక్కు కలిగి యున్నాడు. కేవలం ప్రభుత్వ పరిధిలోనేగాక జీవిత సంబంధాలన్నింటిలోనూ ఈ ప్రజాస్వామ్య సూత్రం వర్తిస్తుంది. విజ్ఞానాన్ని మానవ వినాశనానికి కాక క్షేమానికి, శ్రేయస్సుకు, నిర్మాణ యుతంగా వినియోగించటం ఈ సిద్ధాంతపు ఆదర్శ ముఖ్య లక్షణాలలో ఒకటి. విజ్ఞానము లక్ష్యాలను నిర్దేశించదు. మానవ శ్రేయస్సును సాధించటానికి అనువైన మార్గాలను సూచిస్తుంది.

హ్యూమనిజం నైతిక దృక్పథం కలది. మానవుని హుందాతనాన్ని, సాధ్య మైనంతలో ప్రతివ్యక్తి ఇతోధికంగా ఇతరుల హక్కులకు భంగం కలుగని రీతిగా స్వయంగా వికాసాన్ని పొందగల హక్కును గుర్తిస్తుంది. సామర్థ్యం, క్రమశిక్షణ పేరుతో మానవ జీవితాన్ని యాంత్రికం చేసే వ్యవస్థను వ్యతిరేకిస్తుంది. యాంత్రీకరణ మానవ విలువలను నస్ఫూర్మ చేస్తుంది. కనుక, తాత్కాలిక లక్ష్యాలను సాధించే ప్రయత్నంలో సమగ్ర

నియంతృత్వ సిద్ధాంతాలు అమలుపరచ జూచే సమగ్ర యాంత్రీకరణను త్రోసి రాజంటుంది. సమాజం యెడ బాధ్యతతో సమ్మిళితమైన వ్యక్తి స్వేచ్ఛను లక్ష్యంగా స్వీకరిస్తుంది. భౌతిక అవసరాలను తీర్చటం, భౌతిక పరిస్థితులను మెరుగుపరచటం అనే పేరుతో పైన పేర్కొనబడిన వ్యక్తి స్వేచ్ఛను త్యజించ నిచ్చగించదు. మానసిక స్వేచ్ఛ, మౌలిక చింతన లేనప్పుడు అభ్యుదయం అసాధ్యం.

పిడివాదాన్ని, పిడివాదపు సిద్ధాంతాన్ని త్రోసిరాజని హ్యూమనిజం స్వేచ్ఛను ప్రబోధిస్తుంది. నైతిక విలువలను, సృజనాశక్తులతో సమ్మిళితమైన జీవిత విధానాన్ని, వ్యక్తి వికాసాన్ని లక్ష్యంగా అంగీకరిస్తుంది. మారుచున్న సమాజానికి అనుగుణంగా అభ్యుదయ పథంలో అనుసరించ దగిన మౌలిక జీవిత సూత్రం ఇది.

విజ్ఞానాన్ని .ప్రపంచ శాంతి కొరకు వినియోగించ గలిగితే ప్రస్తుత విషమ స్థితినుంచి మానవాళి విముక్తి చెందగలదు. భయవిముక్తుడైన మానవునిపరిపూర్ణ వికాసానికి పరిమితులుండకూడదు. ఈ తాత్విక ఆలోచనా రీతిని మానవ ప్రపంచం ప్రస్తుతం ఎదుర్కొనే సవాలుకు సరియైన జవాబుగా భావించవచ్చును.

ఇలాంటి తాత్విక ధోరణి స్వేచ్ఛా భావుకతను పోషిస్తుంది. కనుక అన్ని సామాజిక రంగాలలోను వినూత్నమయిన రీతిలో స్వేచ్ఛను పెంపొందించి అభ్యుదయ మార్గాన అడుగులు వేయించగల నూతన భావాన్వేషణయే 'ప్రజాస్వామ్య ప్రచురణల సంస్థ' ధ్యేయం.

అట్టి భావాలను ప్రజాబాహుళ్యానికి ఎరుకపరచటం ఈసంస్థ ప్రథమ కర్తవ్యంగా భావిస్తుంది. ఇది సాహసమే కావచ్చు. ప్రమాదభరితం కూడా కావచ్చును. కాని లక్ష్యసాధన కొరకు చేసే ఇట్టి కృషిని విస్మరించ జాలము. ఈ ప్రయత్నానికి, వ్యాపారానికి స్వేచ్ఛాపిపాసకల వ్యక్తులందరి సానుభూతి సహకారాలను అర్థిస్తున్నాము.

సభ్యులు : శ్రీ ఎం. వి. రామమూర్తి
శ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తి
శ్రీ గుంటుపల్లి గోపాలరావు
శ్రీమతి మల్లాది సుబ్బమ్మ
శ్రీ గురిజాల సీతారామయ్య
శ్రీ కొల్లా సుబ్బారావు

ఎం. వి. రామమూర్తి
అధ్యక్షుడు
బోర్డు ఆఫ్ డైరెక్టర్స్

# పరిచయం

మాతృస్వామ్య వ్యవస్థ అనేది ఒకానొక సామాజిక దశలో వుండేదని చరిత్రకారులు తేల్చిన దాన్నిబట్టి నిజమేనేమోనని మనం అనుకొంటున్నాం తప్ప, ఏ కాలంలోనైనా - ఏ దేశంలోనైనా, రాజ్యంలో నైనా - ఏ జాతిలోనైనా, మతంలోనైనా, కులంలోనైనా, వర్గంలో నైనా - ఏ సామాజిక దశలోనైనా పురుషుడితో సమాన ప్రాశస్త్యం, సమానహోదా స్త్రీ సాధించినట్లుకానీ, అనుభవించినట్లు కానీ రికార్డయిన చరిత్రలో సాక్ష్యం కన్పించదు. స్త్రీలకు సమానావకాశాలు యివ్వబడినట్లు చెప్పబడుతున్న ఈ నాటి ప్రజాస్వామిక, సోషలిస్టు రాజ్యాల్లోకూడా ఇన్ని దశాబ్దాల తర్వాత కూడా స్త్రీ పురుషులమధ్య సమానస్థాయి సాధించబడలేదు. ఇదొక విచిత్రమయిన వాస్తవం. ప్రతి సమాజంలోనూ ఎక్కడో ఒక జంటలో తప్ప, అన్నింటా స్త్రీ కంటె పురుషుడు మిన్నగా వుండడం సామాన్య లక్షణమైంది. ఇది అనాదిగా వస్తున్న నైతిక జాడ్యావశేషం.

ఇలా వుండడానికి స్వాభావిక కారణాలేమయినప్పటికీ, వ్యక్తులుగా పురుషులెలాంటి స్వతంత్ర ప్రతిపత్తికలవారో - స్త్రీలూ అలాంటి స్వతంత్ర ప్రతిపత్తి కలవారే. ప్రతిభా వ్యుత్పత్తుల్లో ఒక పురుషుడికీ - మరో పురుషుడికీ ఎలాంటి తారతమ్యముంటుందో, అలాంటిదే ఒక స్త్రీకీ - మరో స్త్రీకీ, ఒక పురుషుడికీ - మరో స్త్రీకీ మధ్య వుండడం సహజం, అంత మాత్రాన వ్యక్తుల ప్రజ్ఞాపాటవాలు కొలమానంగా మానవ హోదాను కుంచించడం - పెంచడం నైతికంగా సమర్థనీయంకాదు. మానవ హుందాతనానికి ఆడ-మగ విచక్షణ లేదు.

స్త్రీ విలువను కుంచించడానికి ఫాసిజం ప్రయత్నించింది. జీవ, జన్యు, మనో విజ్ఞాన శాస్త్రాలు ఆధారంగా స్త్రీని పురుషుడికి ఎదమపైపుగా చూపడానికి కొందరింకా ప్రయత్నిస్తూనే వున్నారు. ఇతర కారణాలు చూపి మతస్థులుకూడా లోగా అపనే చేశారు. ఈనాడా పనికి మనం పూనుకొంటున్నామంటే, మనం మత సమాజ పరిధుల్లో వున్నామనే అర్థం.

ఏ శాస్త్రాలు ఏమి నిర్ధారించినా, సమతావాదం న్యాయ సమ్మతమనుకొన్నప్పుడు శారీరక - వైజ్ఞానిక పాటవంలో వ్యక్తుల మధ్యవున్న తేడాలు వారి మానవతను తారతమ్య భావంతో చూడడానికి తావీయరాదు.

ఆడ-మగ తేడాతో నిమిత్తంలేకుండా స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, న్యాయం అనేవి మనుషులందరికీ 'సమానంగా' కావాలనే మానవస్వామ్యం ఈనాటి మనిషి ఆదర్శం. కాని, పురుషుడికే స్వామ్యంతేని వ్యవస్థలో మనమున్నాం. దంపతుల జంటల్లో సమత మృగ్యమయిన పురుషాధిక్య సమాజంలో మనమున్నాం. స్త్రీని పురుషుడి సొత్తుగా భావించే మానసిక దశను మనమింకా అధిగమించలేదు. ఇలాంటి స్థితిలో ఆడమనిషీ మనిషేనని అందరికీ వినపడేట్టు తొలిసారిగా బరితెగించి కేకపెట్టిన తెలుగువాడు చలం. ఒక్కడుగా స్త్రీ స్వాతంత్ర్య సమస్యమీద అవిరళ రచనల ద్వారా వసాడు దశాబ్దాలపాటు ఒకే కోణంనుంచి చలం సాగించిన భావోద్యమం ప్రజల్లో యెంతో భావోత్తేజాన్ని కలిగించింది. ఆ గౌరవం తనకు తానై ఆయన తెచ్చుకొన్నదేకాని, మనమిచ్చేది కాదు.

ఈనాడు ప్రధానంగా స్త్రీ సమస్యల్ని బహుభిన్న కోణాలనుంచి చిత్రిస్తున్న రచయిత్రి మల్లాది సుబ్బమ్మ. కొద్దికాలం క్రితమే రచనా రంగంలో దిగినప్పటికీ, స్త్రీల సమస్యల మీద ఇప్పటికే ఆమె వందకుపైగా వ్యాసాలు రాశారు. శాస్త్రీయ హేతువాద మానవవాద భావాలతో మెరుగులు దిద్దుకోవడం వల్ల ప్రతి సమస్య పట్లనూ ఆమె దృక్పథంలో ప్రత్యేకత, స్పష్టత కన్పిస్తుంది. కార్యరంగంలో ఆమెకున్న అనుభవం వల్ల ఇందలి వ్యాసాల్లో పరిశీలనా దృష్టితోపాటు పరిష్కార మార్గాలుకూడా కన్పడతై; వస్తువైవిధ్యం, విషయ సంపన్నత వున్న సుబ్బమ్మగారి వ్యాస సంకలనాల్లో ఇది నాల్గవది. ఐదో సంకలనం దీని జంటగా వస్తున్నది. స్త్రీ సమస్యలన్నీ మానవ సమస్యలే అయినా, సుబ్బమ్మగారి కలం నుంచి ఇవి ప్రత్యక్ష మయిందాకా స్త్రీల పరంగా ఇన్ని సమస్యలున్న వని గుర్తించడం కష్టం. ఈ వ్యాసాల వాలకం చూస్తే, స్త్రీ సమస్యల మీదనే సుబ్బమ్మగారొక ఎన్‌సైక్లోపెడియా రాయగలరా! అనిపిస్తుంది. పదునుగల ఆమె కలం ఇలానే నిర్భీతితో, ఇలానే వేగంగా ఇంలా ఇంకా పరుగెత్తి గలదని ఆశిద్దాం.

కవిరాజాశ్రమం<br>
నాగండ్ల

రావిపూడి వెంకటాద్రి<br>
చీరాల, 13 మే 1982

# ఎందుకిలా వ్రాశాను ?

మనస్సులో పుట్టేది ఆవేదన. మండే గుండెల్లోంచి వచ్చేది బాధ. తగిన విద్యలేక, విలువల ఊసే తెలియక సంఘ దురాచారాలకు, మూఢ నమ్మకాలకు, అవిద్య అజ్ఞానాలకు గురియై, చైతన్య రహితులై పురుష సమాజపు ఇనుప సంకెళ్ళలో బంధింపబడి, క్రూర సమాజపు కోరల్లోపడి నలిగి అణగారి పోతున్న స్త్రీల దుస్థితి చూచి వగచి, స్పందించి, ఆవేదన చెందగా వాటినెలా పరిష్కరించాలనే దుర్భర ఆరాటమే నన్నీ వ్యాసాల రచనకు పురికొల్పింది.

జరుగుతున్న అన్యాయాన్ని చూచి రచయిత ద్రవిస్తాడు. అంటే అతనిలో స్పందనకల్గి ఆ కుళ్ళును, ఆ దోపిడిని ప్రజల హృదయాలకు హత్తేటట్లు చెప్తాడు వ్యాసకర్త. సమాజంలో సగభాగమైన ఒక వర్గానికి (50% స్త్రీలకు) జరుగుతున్న అన్యాయాన్నీ, అవకతవకల్నీ, అసమాన త్వాన్నీ ఎత్తి చూపాల్సిన బాధ్యత మనందరికీ వుంది. ఆ వర్గ ప్రయోజ నాన్ని రక్షించి, వారి సంక్షేమాన్ని కాంక్షిస్తూ వ్రాసే రచనే స్త్రీ జాతికి నిజమైన సందేశం. తద్వారా ఆ వర్గ ప్రజలు మేల్కొంటే అదే ఆ రచనకు మూల్యం; ఆ రచయితకు పారితోషికం. నిద్రాణమైన ఆ స్త్రీ జాతి కళ్ళు తెరిస్తే ఎన్ని అవాంతరాలొచ్చినా ఝుడియదు; మరెన్ని అవరోధాలు కలిగినా క్రుంగిపోదు. ఆనాడు కష్టాలను, నష్టాలను, ఘాతుకాలను ఎదిరించి ప్రాణాలను సైతం ఎదురొడ్డి పోరాడుతుంది. అలా జరిగిన నాడే ఆ రచనకు సార్థకత వుంటుంది; ఆ రచయితకు తృప్తి కలుగుతుంది. ప్రగతి నిరోధ కమైన సనాతన భావాలు, వివరణలు కాక—విషయంలో నూతనత్వం, ప్రత్యేకతా వుండాలనేదే రచయిత ధ్యేయం కావాలి.

మనచుట్టూవున్న అజ్ఞానాన్నీ, ఆవరించుకున్న చీకటినీ చూచి నిరాశ, నిస్పృహ చెందేకన్నా ఎంత చిన్న జ్యోతినైనా వెలిగించ గలిగితే ఆ ఆశాజ్యోతే స్త్రీ జాతిలో నివురుకప్పివున్న వ్యక్తిత్వాన్ని ప్రజ్వలింప జేస్తుంది. ఆలోచనా శక్తిని కలిగిస్తుంది. తోటి మహిళల్లో జాగృతి, కనువిప్పు కలిగించ గలిగితే జీవితం చరితార్థం అయినట్లే. ఆ నాడే

నా రక్తాశ్రువులు పన్నీరుగా మారి దుర్గంధ భూయిష్టమైన స్త్రీ జీవితాన్ని పరిమళింప జేస్తుంది. విలువ లన్నిటిలోకి మానవ విలువలు ఉన్నతోన్నత మైనవి. కనుక స్త్రీ కూడా పురుషునితో సమాన ప్రతిపత్తి, మేధస్సుకల వ్యక్తిగా చూడబడగలగాలి. అంటే స్త్రీ ప్రగతిలోనే పురుషాభ్యుదయం, అపైన సామాజిక ప్రగతి తథ్యం అనేదే నా ధ్యేయం

సాహిత్య ప్రక్రియలలో పాఠకుల్ని ఆకర్షించేవి నవల, కవిత్వం, కథ, నాటకాలే అయినా వ్యాసాలలో కూడా స్పష్టమైన భావం, ప్రబోధం లేక పోలేదు. వాస్తవికమైన ఇతివృత్తం, సంఘటనలు, కొంత ఊహ కలిపి రంగరించి, నగిషీచెక్కి నవలారూపంలో రాస్తారు. ఉద్యమాల ద్వారా, ఉపన్యాసాల ద్వారా ప్రబోధించే సంఘ సంస్కరణలను, మూఢాచారాలను, స్త్రీ సమస్యలను వ్యాసాల రూపంలో వ్రాయటం ప్రత్యేకత అనక తప్పదు. సామాజిక మార్పు, ప్రగతి వాంఛనీయమయినప్పుడు ప్రగతినిరోధకమైన పాత భావాల స్థానంలో ఆధునికతను నిర్మిస్తాం. అప్పుడు భావ విప్లవంతో పాటు సాహిత్య విప్లవంకూడా అవసర మవుతుంది. ఆ భావం కథగా చెప్పవచ్చు. నవలగా వ్రాయవచ్చు. వ్యాస రూపంలో పరిచురించవచ్చు. రూపమేదయినా భావం మాత్రం స్పష్టంగా, నిర్మొహమాటంగా ఆర్తితో, ఆవేదనతో, ఆసక్తితో చెప్పటం జరుగుతుంది. అలాంటి రచయిత యొక్క భావంలో మాత్రం రాజీ వుండదు. ఆ భావ పరంపరలే ఈ వ్యాస సంకలనానికి జీవ గఱ్ఱలు.

ఆర్థిక సాంఘిక రాజకీయ సాంస్కృతిక రంగాలలో స్త్రీ జీవిత కష్ట గాథ లెన్నోవున్నాయి. అందులో వ్యక్తిత్వం, విద్య, ఉద్యోగం, వివాహం, దాంపత్యం లాంటివి ముఖ్యాంశాలు. వీటి పుట్టుక ఉనికి, వాటి పరిణామాలు, బహురూపాల్లో అవి స్త్రీ జాతిపై ఎలా స్వైర విహారం చేస్తున్నై, వాటినెలాపరిష్కరించాలి, లాంటివి ఈ సంకలనంలో వివరించడం జరిగింది. అనేక సమయాల్లో అనేక పత్రికలకు వ్రాసిన వ్యాసాలివి. అందువల్లే ఆభావాలు పునశ్చరణ కావచ్చు; చర్విత చర్వణమన్నా తప్పు లేదు. ఈ లోపం వ్యాస సంకలనానికుండే లక్షణమే అని మనవి చేస్తున్నాను. ఈ దొసగులను చదువరులు సహించగలరని నమ్ముతున్నాను. కాకపోతే భాషలో, శిల్పంలో లోపాలు, పొరపాట్లు దొర్లవచ్చు. వాటిని పాఠకులు మన్నించి అసలైన భావాల్ని పరిగ్రహించ గలరని ఆశిస్తున్నాను.

—పల్లాది సుబ్బమ్మ

# ముందు మాట

శ్రీమతి సుబ్బమ్మ ప్రముఖ రాడికల్ హ్యూమనిస్టు. త్రికరణ శుద్ధికల హేతువాది. చక్కని వక్త. గ్రంధ రచయిత. భారతదేశంలోని మహిళోద్యమానికి ఆమె అంకితమయింది. భారత స్త్రీలకు సంబంధించిన అనేక విషయాలపై ఈ గ్రంథంలో ఆమె వ్యాసాలు రాశింది. స్త్రీల సమస్యల యెడ సానుభూతితో కూడిన సునిశిత అవగాహన ఆమెకున్నది. ఆ సమస్యల పరిష్కార మార్గాలకై ఆమె అహరహం పరితపిస్తోందని నేను ఘట్టిగా చెప్పగలను. నిజాయితీగల స్త్రీల నాయకత్వంలో స్త్రీ విమోచ నోద్యమాలు పురోగమించ గలవు.

స్త్రీలను అత్యున్నత స్థానాలలో ఉంచి వారిని గౌరవ ప్రదంగా చూడడం భారతీయ సంప్రదాయమని మనకు చెప్తారు. వారు గృహ లక్ష్ములట! ఏమయినా వాస్తవ పరిస్థితి మాత్రం వేరుగా వుంది. వారిని పురుషులతో సమాన హోదాగల మానవ మాత్రులుగా చూడకుండా ఉపయోగకరమైన వస్తువులలాగా చూస్తూ వారిని ఆజన్మాంతం పురుష రక్షణలో వుంచుతున్నారు.

భారతదేశ స్త్రీలు రెండు రకాల ఇబ్బందులకు గురి అవుతున్నారు. పురుషులకన్నా హెచ్చుగా అజ్ఞానంలోనూ, అంధవిశ్వాసంలోనూ కొట్టు మిట్టాడు తున్నారు. దేశంలో అక్షరాస్యత నూటికి ముప్పై వంతులుకాగా స్త్రీలలో అక్షరాస్యత నూటికి పదునెనిమిది మాత్రమే. స్త్రీలు అర్థ భూస్వామ్య-పురుషాధిక్య సమాజంలో ఇప్పటికీ జీవిస్తున్నందు వల్ల వారు రెండవ రకపు ఇబ్బందికి గురిఅవుతున్నారు. ఇది స్త్రీ వ్యక్తి వికాసానికి, సామాజిక ప్రగతికి గొడ్డలిపెట్టు. ఇలాంటి పరిస్థితిలో వారి ప్రతిభ, శక్తి యుక్తుల వికాసానికి అవకాశం ఇంచుమించుగా లేదని చెప్పవచ్చు. అనేక కుటుంబాలలో తమకన్నా పెద్దవారైన పురుషులకు స్త్రీలు ఇష్ట పూర్వకంగా సేవకులుగా సంచరిస్తున్నారు.

వ్యక్తి యొక్క హుందాను గుర్తించటం ప్రజాస్వామ్య ప్రాతిపదిక సూత్రం. ఈ సూత్ర ప్రకారం సామాజిక, రాజకీయ, ఆర్థిక విషయా లన్నింటిలో స్త్రీలు పురుషులతో సమానమైన హక్కులను కలిగి వుండాలి.

అలా స్త్రీ విమోచన ఉద్యమం ప్రజాస్వామ్య ఉద్యమంలో సమున్నతమైన భాగం. కనుక మానవ వాదంలో స్త్రీ విమోచన ఉద్యమానికి గొప్పవిలువ, అండదండలు వుంటాయి.

తల్లి ఒడిలోనే, చిన్న వయుస్సులలోనే మానవుని సాంస్కృతాభివృద్ధి మొదలవుతుంది. సాంస్కృతికంగా వికాసం పొందని స్త్రీలు పెంచిన పిల్లలు సాంస్కృకాభివృద్ధి లేనివారు అవుతారు. విజ్ఞాన వంతమయిన సమాజం కావాలంటే స్త్రీలను విజ్ఞాన వంతులను చెయ్యడం వల్లనే అది త్వరితంగా సాధ్యమవుతుంది. స్త్రీ విమోచన స్త్రీలకు మాత్రమేకాక యావత్తు సమాజానికి అత్యవసరం. అలాంటి మహోత్తమమయిన ఉద్యమాన్ని నిర్మించే వారిలో శ్రీమతి సుబ్బమ్మ ఒకరు. స్త్రీల హక్కుల కోసం ఆమె సాగించే మహత్తర పోరాటం వివేచనా శీలురైన ప్రజల మద్దత్తును పొందగలదని విశ్వసిస్తున్నా. స్త్రీలంతా సంఘటితమై సంఘాలను నిర్మించుకొని ఆ పోరాటంలో సాయపడగలరని అశిద్దాం.

9-6-82

న్యూఢిల్లీ

వి. ఎం. తార్కుండే

# ఒక్క క్షణం ఆలోచిస్తే

స్త్రీ విమోచనోద్యమాన్ని ప్రధానంగా రెండు కోణాలనుండి చూడవచ్చు. సమాజంలోని ఇతర శక్తుల, సమస్యల ప్రసక్తిలేకుండా కేవలం పురుషాధిక్యతను నిరసించే దృక్పథం ఒకటి. ఇలాంటి భావాలున్న స్త్రీలు మగవాణ్ణి "పురుష దురహంకార సూకరం" అని అభివర్ణిస్తున్నారు. మగవాని నీడ తమపై సోకరాదని, పురుష సాంగత్యం ఏమాత్రం పనికి రాదని వారి భావం. స్త్రీలు తమలో తాము వివాహమాడుకొని దాంపత్య జీవితాన్ని గడపాలని, అది వీలు కాకపోతే ఒంటరి జీవితం గడపాలని వారి ఆశయం. తమ జీవితాలలో, తమ సన్నిహితుల కాపురాలలో సంభవించిన భయంకర సంఘటనలవల్ల వారు పైచెప్పిన దృక్పథాన్ని స్వయంగా వరించారు. ఇతరుల దృష్టిలో ఇది లోప భూయిష్టం కావచ్చు. అసమగ్ర జీవితం కావచ్చు. కానీ వారు తదితరుల అభిప్రాయాలను ఖాతరు చేయ తల్చుకోలేదు. వారి మార్గం ఎన్ని కష్ట నిష్ఠురాలకు లోనుచేసినా, వారు దానినే అనుసరించ నిశ్చయించు కున్నారు. ఈ వైఖరి కోపతాపాలవల్ల పుట్టింది. వివేచన, వివేకం, సక్రమమైన అవగాహన, సమ్యక్‌దృక్పథం ఇవన్నీ లోపించాయి. కనుక అలాంటివారి జీవితాలు అసమగ్రంగాను, అసంపూర్ణంగాను, అసంతృప్తికరంగాను ఉండిపోక తప్పదు.

ఇక రెండవ దృక్పథాన్ని పరిశీలిస్తే ఒక విషయం స్పష్టమవుతుంది. ఆర్థిక ప్రజాస్వామ్యం కోసం జరిగే పోరాటం మొత్తం సామాజిక విముక్తి కొరకు జరిగే పోరాటంలో ఎలా అంతర్భాగమో, అలాగే స్త్రీ విమోచ నోద్యమం సామాజిక విముక్తి ఉద్యమంలో ముఖ్యభాగం. ఈసూత్రాన్ని అంగీకరించినవారు మరల మూడు రకాలుగా వున్నారు. సమాజంలో మానవునికి ఆర్థిక విముక్తి లభిస్తే - అంటే సమాజం యావత్తూ ఆర్థిక పరంగా మారితే స్త్రీ విమోచన దానంతట అదే వస్తుందని కొందరి ఆలోచన. దీనిని మొదటిరకంగా ఎంచవచ్చు. ఇది యాంత్రికమైన ఆలోచన. 1949లో చైనాలో విప్లవం వచ్చినా, 1959లో కమ్యూన్ పద్ధతి ప్రవేశ పెట్టబడినా 1966లో సాంస్కృతిక విప్లవం అవసరమని ఆనాటి చైనా అధినేత మావో పేర్కొన్నాడు. యాంత్రిక పద్ధతిని అనుసరించే భౌతిక వాదులను మార్క్స

కూడా విమర్శించాడని మనం విస్మరించరాదు. పునాదిరైన ఆర్థికతకు ప్రాధాన్యత ఇచ్చినా, ఉపరితలానికి స్వతంత్ర ప్రతిపత్తిని మార్క్స్ ఇచ్చాడని మనం మరిచి పోరాదు.

ఆర్థికత పునాదిని అంగీకరిస్తూనే ఉపరితలంపై పోరాటం సాగించాలని చెప్పిన మావో పద్ధతి రెండవరకం. ఆర్థికత ప్రాముఖ్యాన్ని వారు కాదనరు; పైగా దానిని ప్రధానాంశంగానే పరిగణిస్తారు. అయితే ఉపరితలంలో - అంటే రాజకీయ, సామాజిక, నైతిక, తాత్విక రంగాలలో జరగవలసిన పోరాట ఆవశ్యకతను వారు గుర్తిస్తారు. ఇది మార్క్సిస్టు-లెనినిస్టులుగా చలామణి అవుతున్న వారి వైఖరి: మావో ఆలోచనా విధానానికి జేజేలు పలికే వారి దృక్పథం.

మూడవది రాడికల్ హ్యూమనిస్టుల ఆలోచనా పద్ధతి. స్త్రీ విమోచనోద్యమం సామాజిక విముక్తి వుద్యమంలో నిస్సందేహంగా భాగమే. మానవునికి సర్వతోముఖంగా-అంటే రాజకీయ, ఆర్థిక, సామాజిక, మానసిక శక్తులదాడినుండి స్వేచ్ఛకావాలని మానవవాదం(హ్యూమనిజం)చెపుతుంది. సామాజికాభివృద్ధికి కొలమానం వ్యక్తిగత అభ్యుదయ మేనని నొక్కివక్కాణించినందువల్ల, సమాజానికి ప్రాతిపదిక అయిన వ్యక్తి సంక్షేమంపై నొక్కు పెట్టినందువల్ల దీనిని సమూల మానవ వాదం (రాడికల్ హ్యూమనిజం) అని పిలవడం జరిగింది. ఈ తాత్విక ధోరణిలో మనం ఒక ముఖ్యాంశాన్ని విధిగా గమనించాలి. ఆర్థికత యొక్క ప్రాముఖ్యాన్ని మానవవాదం త్రోసి రాజనదు. అంటే దానిని ముఖ్యాంశంగానే గుర్తిస్తుందని మనం తెలుసుకోవాలి. కాగా రాజకీయ, సామాజిక, తాత్విక, నైతిక, సాంస్కృతిక విషయాలు కూడా సమానంగా ముఖ్యాంశాలని హెచ్చరిస్తుంది. అంతేకాదు; ఆర్థికత తతిమ్మా వాటిమీద ప్రభావం చూపుతుందనీ, అలాగే రాజకీయ, సామాజిక, తాత్విక, నైతిక రంగాలు ఆర్థిక రంగాన్ని ప్రభావితం చేస్తాయనీ ప్రకటిస్తుంది - కాగా ఆర్థికతకు మౌలికాంశంగా పట్టంకట్టి, తతిమ్మావాటిని స్వతంత్రప్రతిపత్తిగల సామంత రాజులుగా చిత్రించదు. అందువల్ల రాజకీయ, ఆర్థిక, సామాజిక, తాత్విక, నైతిక స్వేచ్ఛ కోసం ఏకకాలంలో, ఒకే సమయంలో పోరాటంసాగించాలని మానవ వాదం ప్రబోధిస్తుంది. సామాజిక విముక్తికోసం జరిగే పోరాటంలో

స్త్రీ విమోచన ముఖ్య భాగం కనుక మహిళోద్యమానికి మహత్తర స్థానాన్ని ఇస్తున్నది. పురుషాధిపత్యానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంగానూ, మొత్తం సమాజంయొక్క విముక్తికోసం జరిగే వుద్యమంగానూ అది రెండు స్వభావాలు కలిగి వుంటుంది. కనుకనే వివేకవంతులై, అభ్యుదయ గాములైన పురుషుల అండదండలు అలాంటి వుద్యమానికి ఉంటాయి. కనుక ఆ వుద్యమంలో పాల్గొనేవారు పురుషులందర్నీ మూకుమ్మడిగా ద్వేషించలేరు; ద్వేషించరు కూడాను. అనేకమంది పురుషులు స్త్రీ జనోద్ధరణకు కంకణం కట్టుకొని పోరాడారని చరిత్ర చెప్తున్నది. అందువల్ల హ్యూమనిస్టులు నడిపే మహిళోద్యమం పురుష ద్వేషాన్ని పెంచదు. కాకపోతే స్పష్టంగా పురుషాధిక్యాన్ని నిరసిస్తుంది; పురుష దురహంకారానికి వ్యతిరేకంగా పోరాడుతుంది. మహిళోద్యమాన్ని వ్యతిరేకించే పురుషులలో హెచ్చుమంది పాతకాలపు సామాజిక, తాత్విక, నైతిక భావాలకు దాసులని గుర్తిస్తుంది. అంతేకాక వారుకూడా సమాజంలో నిర్భాగ్యులుగా, పీడితులుగా ఉంటున్నారనే అంశాన్ని లెక్కలోకి తీసుకుంటుంది. అట్టి వారిని చూచి జాలిపడుతుంది. వారికి కూడా విముక్తి రావాలని ఆరాట పడుతుంది - ఇలా విస్పష్టమైన భావాలతో స్త్రీ విమోచనోద్యమం నవ్య మానవవాద ఫక్కీలో సాగిపోతుంది.

ఈ నాడు మహిళోద్యమం సంస్థారూపంగా ముక్కచెక్కలయివుంది. ప్రతి రాజకీయ పార్టీకి అనుబంధంగా విద్యార్థి, యువజన, కార్మిక సంఘాలు వున్నట్లే మహిళా సంఘాలు కూడా ఏర్పడ్డాయి. రాజకీయ పార్టీల చెప్పుచేతలలో ఇవి మెలుగుతున్నాయి. వీటికి కనీసం స్వతంత్ర ప్రతిపత్తి (Autonomy) లేదు. ఈ స్థితి శోచనీయం. ఒక రకంగా ఆలోచిస్తే పునాది; వుపరితలాల సిద్ధాంతానికి ఇది పూర్తిగా వ్యతిరేకం - ఆర్థికత అనే పునాది విడనాడి రాజకీయమనే వుపరి తలానికి ప్రాధాన్యత మివ్వటంతప్ప ఇది మరేమీ కాదు.

తాత్వికంగా ఆలోచిస్తే, గతితర్కాన్ని చాలావరకూ కాదన్న మావో అనుయాయులకు, నవ్యమానవ వాదులకు మాత్రమే భావ సంఘర్షణ నిలుస్తుంది. మార్క్సిజాన్ని చాలా వరకు త్రోసిరాజన్న మావోను మార్క్సిస్టుగా చిత్రించటం వల్ల మావో అనుయాయులు గందరగోళంలో

పడిపోతున్నాడు. అటు మావో, ఇటు నవ్యమానవవాద వుద్యమ మూల పురుషుడు ఎం. ఎన్. రాయ్ ఇద్దరూ భావాలకు ప్రాధాన్యత ఇస్తున్నారు. కాకపోతే మావో వాదులు మార్క్సిస్టు సంప్రదాయం నుండి విడివడలేక ఇరుకునపడి పోతున్నారు. రాడికల్ హ్యూమనిస్టులకు ఆ బాధ లేదు. "తుపాకీ గొట్టం ద్వారా రాజకీయాధికారం" వస్తుందని ప్రకటించిన మావో రాజకీయాలకు అధిక ప్రాధాన్యత ఇచ్చాడని గుర్తించాలి. 'వుపరితలం' లో భాగమైన రాజకీయాలకు మౌలికమైన ప్రాధాన్యత ఇచ్చిన మావో ఇలా మార్క్స్ సిద్ధాంతాన్ని కాదన్నాడు. కాని, మార్క్సిస్టుననే చెప్పుకోవాల్సి వచ్చింది ఇతర కారణాలవల్ల.

మార్క్సిస్టు-లెనినిస్టులూ, రాడికల్ హ్యూమనిస్టులూ—ఇద్దరూ భావ విప్లవం కావాలని ఘోషిస్తున్నారు. కాని వారి మార్గాల తీరుతెన్నులు వేరు వేరు. ఒకరు సాయుధ పోరాటానికి ప్రాముఖ్యతనిస్తే, మరొకరు ప్రజా ప్రబోధానికీ, ప్రజా సంఘటనకూ ప్రాధాన్యత నిస్తున్నారు. ఇవి మౌలిక విబేధాలు.

శ్రీమతి సుబ్బమ్మ నవ్యమానవవాద పంథాలో పయనిస్తోంది. అది ఆమె విశిష్టత; ఆమె ప్రత్యేకత. ఈ వ్యాస సంకలనంలో నవ్యమానవవాద విశ్లేషణ, సమన్వయ పద్ధతులలో స్త్రీ విమోచనోద్యమంలోని పెక్కు అంశాలను పరిశీలించడం ముదావహం.

హైదరాబాదు

ఎం. వి. రామమూర్తి

# ఈ గ్రంథంలో


కృతజ్ఞత v
స్వవిషయం vii
పరిచయం xi
ఎందుకు వ్రాశాను ? 1
ముందుమాట 3
ఒక్కక్షణం ఆలోచిస్తే 5
వేదాలనుండి మనువువరకు : స్త్రీలస్థితి 9
సమస్యలు : పరిష్కారాలు 20
మహిళా సంఘాలు 26
సంఘసేవకురాలి సమస్యలు 31
స్త్రీవిద్య వ్యాప్తిపై పునఃపరిశీలన జరగాలి 37
మూఢాచారాల ముసుగులో మన స్త్రీలు 42
స్త్రీకి రక్షణలేని సమాజం 46
పాశ్చాత్య ప్రపంచం - నాస్తికత్వం 50
స్త్రీలపై అత్యాచారాలు 53
వివాహవయః పరిమితి 57
స్త్రీలు : మతపరమైన శాసనాలు 62
ఆడది : అందాల బొమ్మ 70
సెక్సు - అపోహలు 74
ఏది అసభ్యత ? ఏది అశ్లీలం ? 78
పెరుగుతున్న ధరలు, కరుగుతున్న బ్రతుకులు 85
ఇది నా సమస్య 91
పిల్లల్లో వైజ్ఞానిక దృక్పథం 99
నిర్బంధ కుటుంబనియంత్రణ అవసరమా ? 103
నారీ సంస్కృతి 108
స్త్రీలలో హేతువాద దృక్పథం 111
సాహిత్యము : సామాజిక స్పృహ 120
నా యూరపు యాత్ర 128
గాంధీయిజం - హ్యూమనిజం 134
నేటి సినిమాల్లో స్త్రీ పాత్ర 137
నవ్యమానవ వాదం : నేటి ఆవశ్యకత 142

9

# ేదాలనుండి మనువు వరకు : స్త్రీల స్థితి.

వేదకాలం (2500 — 1500 బి.సి) లో స్త్రీల స్థితి మహోదాత్తంగా
డేదనీ, ఆర్య సంస్కృతి మహోన్నతమనీ, దానిని పునరుద్ధరించాలనీ
వాదన ప్రబలంగా వుంది. హిందూ సమాజంలో స్త్రీకి సమున్నతస్థానం
దనీ, హిందూ సంస్కృతి స్వయం సంపూర్ణమనీ, భారత ప్రజలు
తర జాతులనుండి తెలిసికోవలసింది, అనుసరించ వలసింది ఏమీలేదనీ
వల ఉధృతంగా నినాదాలు వినపడుతున్నాయి. జాత్యహంకారాన్ని
చే జాతీయత పేరుతో కార్యక్రమాలు మన జాతీయ జీవనంలో చోటు
ం కుంటున్నాయి. ఈ ధోరణి ప్రమాదకరంగా పరిణమించవచ్చు. కాన
ప్రాచీన కాలపు పరిస్థితి తరువాతి దశలను సరిగా అవగాహన
ంకుని అంచనా కట్టటం అత్యవసరం.

రుగ్వేద కాలంలో స్త్రీ పురుషులలో పెద్ద తేడాలు లేవని ఆల్ టేకర్,
ిడియా, ఇంద్ర లాంటి పరిశోధకులు వెలిబుచ్చారు. ఆడపిల్ల పుడితే
ఛనట్లు లేదుకాని, బాలుని కొరకు దేవతల్ని ప్రార్థించినట్లున్నది. వారికి
ానంగా విద్య వుండేదట. కన్యగా వున్నప్పుడే గృహస్థ జీవితంలో
పూర్ణత్వం పొందగల విద్యను నేర్పించే వారని వుంది. స్త్రీలు ఉపాధ్యాయ
త్తిని చేసినట్లు ఆధారాలున్నాయి. వారు ప్రజా జీవితంలో పాల్గొనే
ను. వ్యవసాయంలో, బట్టలు తయారీలో, యుద్ధ పరికరాల తయారీలో
లా నిపుణత చూపేవారట. పుత్రికకు (అన్నదమ్ములు లేని) తండ్రికి
నం పెట్టేహక్కు, దినవారాలు, దహంచేసే హక్కులువున్నాయి. బహుశా
ందువల్లనేనేమో అలాంటి పిల్లను పెండ్లి చేసుకోవద్దన్నారు. వయసొచ్చిన
ను 'శమన' అనే పండుగలో పురుషులతో మాట్లాడనిచ్చేవారు. కాని
ర్యులు భారతదేశం వచ్చాక ఈ పండుగ జరిగినా స్త్రీలను పాల్గొననీయ
ట. వ్యక్తిత్వం వచ్చిన స్త్రీ పురుషుల కలయికే వివాహం. వైవాహిక
ితం తప్పనిసరి కాదు. వివాహ వయస్సు నిర్దేశంలేదు. జీవిత భాగస్వామి
న్నికలో స్త్రీకి చొరవ వుండేది. మతదృష్టిలో స్త్రీ పురుషులు సమానులే.
త క్రతువుల్లో, యజ్ఞయాగాదుల్లో స్త్రీకి ముఖ్య పాత్ర వుండేది.

ఏక పత్నీత్వం, ఏక భర్తృత్వం వుంది. వివాహం ఆడపిల్ల ఇంట్లోనే జరగాలి అనే నియమం లేదు. కాని వధువుకిచ్చిన బహుమతులు భర్త ఇంటికే చేరాలి. ఆమె సంరక్షకుడుగా వాటిని అతడు అనుభవిస్తాడు. నీవు భర్తకు విధేయురాలవై వుండి, నౌకర్లమీద మాత్రం పెత్తనం చేయ వచ్చు. మగపిల్లల్ని కనవలసిందని ఉద్బోధ వుంది. రాజులు కాక సామాన్యులుకూడా బహు భార్యాత్వాన్ని కలిగి వుండవచ్చు. కాని అరుదుగా వుండేవి. విధవ స్థితి శోచనీయంగా వుండేదిగాదు పునర్వివాహాలు సామాన్యంగా జరిగేవి. కాని, గతించిన భర్త యొక్క అన్నదమ్ములతోనే జరిగేవి. భర్తతోపాటు విధవలను తగలేసేవారు కాదు; లేక పూడ్చి పెట్టేవాళ్ళు కాదు. చచ్చినవాళ్ళను మొదట్లో పూడ్చి పెట్టేవాళ్ళు. మహిళా రుషులు మంత్రాలు వ్రాశారు. నాట్యం వృత్తిగాగల స్త్రీలు వుండేవారు. అవినీతిగా ప్రవర్తించిన స్త్రీలను పురుషులతో సమానంగా చూచేవారు. ఆనాటి స్త్రీల స్థితిని చిత్రించే మంత్రాలు ఆర్యులు భారతదేశానికి రాక పూర్వానివేనని మనం గ్రహించాలి. సామవేదంలో ఆడపిల్ల కేవలం భర్త క్షేమం కోసమే బ్రతకాలనే భావం ప్రబలింది - కాని అత్తమామలు, మరుదులుకన్నా వున్నత స్థానం భార్యకు వుంది. ఆడపిల్లను రాతిమీద నుంచోబెట్టి శత్రువుల నోడించటానికి, స్థిరత్వానికి, విశ్వాసానికి చిహ్నంగా అసమారోహణ చేసేవారు. సప్తపదిలో విష్ణువు నిన్ను నడిపించుగాక అంటూ ఆహారం, బలం, వ్రతాలు, సఖ్యత, పశువృద్ధి, సంపద అభివృద్ధి కోరుతూ ఏడుగురు గురువుల రక్షణ కావాలని ప్రార్థిస్తూ ఏడు అడుగులు వేయించాలి. భర్తకు చావు తేవద్దు; దురదృష్టాన్ని తేవద్దు: పశువులకు అదృష్టాన్ని తెమ్మని ప్రార్థనలు చేయించేవారు.

అథర్వ వేదంలో ఆడపిల్ల పుట్టరాదనే భావం బాగా ప్రబలింది. ఆడపిల్ల జన్మించరాదని ప్రార్థనలు, వ్రతాలు వెలిసినై. కన్యల స్థితి ఘోర రూపం దాల్చింది. వివాహం అభిలషణీయమే కాదు, విధికూడా అయింది. స్త్రీలు పాపులుగాను, నిస్సహాయులుగాను చూడబడేవారు. ఆమె విలువ ఆమె తెచ్చే కట్నం మీద ఆధారపడి వుండేది. కట్నం ఆచారరూప మయింది. బ్రహ్మ, గాంధర్వ వివాహాలు చలామణిలో వుండేవి. స్త్రీ భర్త ఇంటికే వెళ్ళాలి. యజ్ఞయాగాదుల్లో పాల్గొనేది. భార్యా భర్తల మధ్య

పఖ్యతకోసం ప్రార్థించేది. బహు భార్యాత్వం పెరిగింది. మంత్ర తంత్రాల చేత భర్తలను లోబరచు కోవాలనే ప్రయత్నం వుండేది. శవం ప్రక్కన భార్యను పడుకోబెట్టి తగల బెట్టేవారు. ఆత్మ అనే భావం పుట్టింది. కనుకనే ఆ లోకంలో భర్తకు ఆమెతోడు వుండాలని, బ్రతికివున్నా ఈ లోకంలో అమె జీవచ్ఛవమేనని అలా జరిపేవారు. పున్నామ నరక విముక్తికోసం పుత్రుడు కావాలన్నారు. అందువల్ల దృక్పథాలు మారిసై. రుగ్వేదంలో మతంలోనూ, సాంస్కృతిక రంగం లోనూ భాగస్వామియైనస్త్రీ పిల్లల తల్లిగా మిగిలిపోయింది. అధర్వణవేదం చివర - బ్రాహ్మణాలకు ముందు 'నియోగ' పద్ధతిలో పిల్లవాణ్ణి కనడమే స్త్రీకి జీవిత ధ్యేయమయింది. ఆడ పుట్టుక దురదృష్ట మయింది. విధవా వివాహం నిషేధ మయింది.

## బ్రాహ్మణాలు - (600 బి.సి)

మతం సామాజిక జీవితంతో పెనవేసుకొనిపోయింది. మగబిడ్డ కోసం పితృదేవతల్ని పూజించేవారు. ఆడ పుట్టుక నీచం, లేక దుఃఖ కారణమై పుట్టకుండా క్రతువులు చేశారు. మగబిడ్డ స్వర్గంలో జ్యోతి అన్నారు. కన్యకు అగౌరవం పెరిగింది. వివాహిత అయిన స్త్రీ భర్తతో క్రతువులలో పాల్గొనాలి. స్త్రీలు సభలకెళ్ళరాదు. గర్భిణీ స్త్రీలను అపవిత్రంగా చూచేవారు. ముట్టు, అంటూవుండేవి. మైత్రాయిణీ సంహిత ప్రకారం స్త్రీ జూదం, త్రాగుడుతో సమానం. సమాజంలో స్త్రీ పెద్ద చెడుతో సమానం. తైత్తరీయ సంహిత, శతపథ బ్రాహ్మణం ప్రకారం దుష్ట పురుషుని కన్నా స్త్రీ హీన. యజ్ఞ యాగాదుల్లో ఆమె మంత్రాలుచదువవచ్చు. బొడ్డు క్రింద ఆమె శరీర భాగ మంతా అపవిత్ర మనే మంత్రాలు చదివేవారు. భర్తను ఎదురించని స్త్రీని, ముందుగా భోంచెయ్యని స్త్రీని గౌరవించేవారు. కన్యల్ని అమ్మడం, దానం చెయ్యడం జరిగేది. ఉంపుడు గత్తెలుండేవారు.

## సంధి యుగంలో (ఉపనిషత్తుల కాలం నాటికి పూర్వం)

కేవలం భర్త సుఖంకోసమే జీవించాల్సిన దుస్థితి కొచ్చింది. వంట, పిల్లల పెంపకం, భర్త సేవలకే పరిమిత మయింది. కాని యజ్ఞయాగాదుల్లో సహచారిగా వుండేది.

## ఛాందోగ్యోపనిషత్తులో

బాల్య వివాహాలున్నట్లు ఆధారాలున్నాయి. బ్రాహ్మణులు శూద్రి కన్యల్ని వివాహ మాడవచ్చు. కాని బ్రాహ్మణ స్త్రీలతో శూద్రుని వివాహం నిషిద్ధం.

## బృహదారణ్యకోపనిషత్తులో

భర్త ఆజ్ఞ దాటిన స్త్రీని తిట్టి, బలవంతగానైనా ఆజ్ఞా పాలనం చేయించవచ్చు. కాని బ్రహ్మ విద్య స్త్రీలకు చెప్పవచ్చని గార్గి, యాజ్ఞ వల్క్యుల సంభాషణల వల్ల గ్రహించవచ్చు.

## బౌద్ధం (500–బి.సి) నాటికి

స్త్రీలు బ్రహ్మ వాదినులవలె మతంలోని శాశ్వత సత్యాలను, వేదాంతాన్ని అర్థం చేసుకోటానికి బ్రహ్మ చర్యాన్ని స్వీకరించి బౌద్ధ ఆరామాలకు చేరారు. వారు రాణి వాసాలనుండి, వ్యభిచారులనుండి అస్పృశ్యులనుండి వచ్చి బిక్షిణులుగా బౌద్ధ మతంలో చేరేవారు. వారిని 'తేరి' అంటే జ్ఞానవృద్ధులు అనేవారు. స్త్రీలలో విద్య, మేధస్సు వున్నట్లు, స్త్రీ పునర్వివాహం అమల్లో వున్నట్లు ఆధారాలున్నాయి.

## మంత్రి బ్రాహ్మణం

ఇందులో ఎక్కువగా పెండ్లి మంత్రాలు వున్నాయి. నా భర్తకు చావుతేవద్దు; దురదృష్టాన్ని తేవద్దు; అంటూ లాజహోమం చేయించేవారు. పెండ్లి నాలుగవ రోజున ధృవ నక్షత్రం దర్శనం ముఖ్యం. అగ్నిని, వాయువును, ఆమె పవిత్రురాలు కావాలని, పిల్లల్ని కనే సౌభాగ్యత పొందాలని, ముఖ్యంగా కొడుకునే కనాలని ప్రార్థించేవారు.

## పురాణకాలం లేక సూత్రాలయుగం (500 బి.సి-500 ఎ.డి)

ఈ కాలంలో స్త్రీ స్థితి పూర్తిగా క్షీణించిందనవచ్చు. 200 బి.సి వరకు కొంత హోదా అయినా వుండేదల్లా వివాహవయస్సు తగ్గించబడింది.

స్త్రీ విద్య నిషేధించారు. స్త్రీ పునర్వివాహంకూడా వ్యతిరేకించారు. 'సతి' పవిత్ర ఆదర్శానికి మూల మయింది. పర్దాలోకి నెట్ట బడ్డది. పునర్వివాహం రద్దయింది. పూర్తిగా భర్త ఆజ్ఞకు లోబడాల్సి వచ్చింది. ఆర్యులు స్థానిక జాతుల వారితో పోరాడ వలసి వచ్చింది. ఈ పోరాటాలకు మగపిల్లలే అవసరమనే భావం కలిగింది. మతపరమైన వైదిక యజ్ఞయాగాదులు చాలా క్లిష్టమయినాయి. క్రతువులను, బలులను, పూజా విధులను చాలా ముఖ్యమైనవిగా భావించారు. వేదవిద్య ప్రచారం అతి ముఖ్యమయింది. వేదాలను వల్లిస్తూ, తిరుగుతూ ప్రచారం చెయ్యాల్సి వచ్చింది. అలా వల్లించటానికి 23, 24 యేళ్ల వరకు వేదవిద్య అభ్యసించాల్సిన అవసరం వచ్చింది. అప్పుడే స్త్రీలను వేద విద్యకు అనర్హులని శాసించారు. స్థానిక స్త్రీలకు (ద్రావిడులు) హిందూ (ఆర్య) మత సంప్రదాయం, సంస్కృత భాష తెలియని కారణాన వారిని అజ్ఞానులుగా భావించి మతపరమైన విధానాలకు అనర్హులని నిర్దేశించారు. క్రమంగా వేదవిద్యకు, మతపరమైన హక్కులకు స్త్రీలందరూ తగరని నిర్దేశించారు. ఎప్పుడైతే మతపర హక్కులు, విద్యా హక్కులు స్త్రీలు కోల్పోయారో సాంఘికంగా, కుటుంబ పరిధిలో కూడా అణగ తొక్కబడ్డారు. అలా మనుస్మృతి - (500 ఎ. డి) నాటికి ఆమె మహా పతివ్రతగా - అంటే భర్తయే పరమ దైవంగా, అతడే దేవుడుగా భావించాలనేది రూఢి అయింది.

ఆర్యులు ఈ దేశానికి రాక పూర్వం మాతృస్వామ్య వ్యవస్థ వుందనే దానికి చాలా ఆధారాలున్నాయి. గ్రామ దేవతలు మాతృ స్వామ్యంలోనే అవతరించారనడానికి చాలా నిదర్శనాలు వున్నాయి. ఈనాటికీ గ్రామాల్లో అంకమ్మ, పోలేరమ్మ, మహంకాళిలాంటి గ్రామ దేవతల్ని ఆరాధిస్తున్నారు. ఆర్య సంస్కృతికి పూర్వంవున్న స్త్రీ ఆరాధన అంతరించి క్రమంగా వరుణుడు, ఇంద్రుడు, అగ్నిలాంటి పురుష దేవతల పూజలు ప్రబలినయి.

500 క్రీ.శ నుండి 1800 వరకు అనేక మంది రుషులు మను, యాజ్ఞవల్క్య, విష్ణు, పరాశర, గౌతమ, శంఖలిఖిత, హారీత, ఆపస్తంబ వ్యాస వంటి రుషులంతా సూత్రాలు, ధర్మ శాస్త్రాలు వ్రాసి వానిలో స్త్రీని పుట్టు బానిసగా చేసి ఆస్తిలో, అధికారంలో, పురుషాధిపత్యానికే

పట్టం కట్టారు. స్త్రీలకు అనేకానేక విధి నిషేధాలు నిర్ణయించారు. అల
పితృస్వామ్య వ్యవస్థా పూరితమైన ఆర్య సంస్కృతే నేటి హిందూ స్త్రీ
మన్నన లందుకుంటోంది. అందులో ముఖ్యమైనది మను ధర్మశాస్త్రం.

స్మృతి కర్తలలో మనువు ముఖ్యుడు. స్త్రీలకు కఠినమైన ఆంక్షలు
విధులు, పురుషులకు ఉపకరించే మార్గ దర్శక సూత్రాలు నిర్వచించాడు
ప్రతి సామాజిక రుగ్మతకు మనువు దగ్గర మందు వుందని బ్రాహ్మణులు
పతివ్రతలు ఆయన్ను ఆరాధిస్తారు. మగడెంత నీచుడైనా, దుర్మార్గుడైనా
వ్యభిచారియైనా స్త్రీ భర్తను భగవంతుని వలె ఆరాధించాలి అని ని
శించాడు ఆమెను వ్యక్తిత్వంలేని ఆటబొమ్మగా చిత్రించాడు
ఆజన్మాంతం ఏదో ఒక మగదిక్కు రక్షణలో బ్రతకాలని శాసించాడు. త
కుటుంబంలో కూడా ఆమెకు స్వేచ్ఛలేదు. సహధర్మ చారిణిగా, వంశాన్ని
పెంచే వ్యక్తిగా, భర్తకు భోగ్య వస్తువుగా జీవించాలని బ్రహ్మాండమై
'బ్రెయిన్‌వాష్' చేశాడు. మగణ్ణి స్వర్గానికి తీసుకెళ్ళే బాధ్యత ఆమెద
అంటే 'సతి'ని బలపరిచాడనేది నిజం. స్త్రీలు సోమరి పోతులని, తండ్రులన
సోదరులను కూడా చెడగొట్ట గలరనీ, ఏ మగాడైనా ఆమెకు ఇష్టమేనని
వస్త్రధారణ విషయంలో అపేక్ష కలవారనీ, వినయం లేనివారనీ అబద్ధీకుల
నిర్వచిస్తూ వారి దుష్ట స్వభావాన్ని గురించి శ్రుతులు (వేదాల్లో) కూడ
చెప్పాయని ప్రకటించాడు. పునర్వివాహాన్ని నిషేధించాడు. పుత్ర సంతాన
కొరకు 'నియోగం' పనికి వస్తుందన్నాడు - అదైనా భర్త సోదరునిత
ఎన్నో పరిమితులను సూచించాడు. ఆమాటకొస్తే భర్తకు కూడా సుఖాని
ప్రసాదించే వస్తువుకాదు. కేవలం పిల్లల్ని కనే యంత్రమన్నాడు స్త్రీ
భార్యాభర్త కలిసి భుజించ రాదన్నాడు. స్త్రీని నగ్నంగా, అర్ధ నగ్నం
చూడరాదన్నాడు. వివాహం కాగానే భర్త స్వామి అని, అతని సే
ద్వారానే ఆమె స్వర్గానికి చేరుకోవాలని ఉద్బోధించాడు. వ్యభిచారి
కుక్కలచేత కరిపించమనీ, కణతో కొట్టవచ్చని భయపెట్టాడు.
'శూద్రునితో సమతుల్య' మని, ఆడపిల్ల పుట్టుకవల్ల తల్లీ, పిల్లా నిరాదర
పాలయ్యే దైన్య స్థితి తెచ్చాడు. అలా క్రీ.శ. 1800 నాటికి స్త్రీ బానిసత్వ
లోనికి జారిపోయింది. అతని ప్రభావం వల్ల ఎంతసేపూ గార్గి, మైత్రేయ
పేర్లుచెప్పి వేదకాల సంస్కృతి గొప్పగా ప్రచారం చేయటం సమాజాని

బుద్ధి పూర్వకంగా వెనక్కు మళ్ళించాలనే ప్రయత్నానికి చిహ్నం. నిజానికి వేదకాలం అనేది చాలా వందల సంవత్సరాలు సాగింది. ఋగ్వేదం కాలంలో స్త్రీల పరిస్థితి కొంత మెరుగుగా వున్నమాట వాస్తవమే. పుత్రికా, పుత్రులకు తేడాలు లేవు అనే దానికి ఆధారాలు వున్నాయి. కాని ఋగ్వేదపు చివరి దశలో ఆమె పతనం ప్రారంభమై, యజుర్వేదంలో ఇంకా దిగజారి పోయి, సామవేదం నాటికి పరాకాష్టకు చేరి, అథర్వణ వేదం నాటికి పూర్తి అయింది. బ్రాహ్మణాల కాలం నాటికి ఆమె దురవస్థకు గట్టి పునాది పడ్డది. ఇక పురాణాల కాలం నాటికి స్త్రీని బానిసత్వంలో కట్టి పడవేయడం జరిగింది. మనువు స్త్రీని పూర్తిగా ఇల్లనే ఇనుప పంజరంలో, పాతివ్రత్యమనే సంకెళ్ళతో పర్మనెంటుగా కట్టి పడేశాడు.

# మనువు బిగించిన మలిన శృంఖలాల నుండి మహిళకు విముక్తి

మనది మనువు పుట్టిన దేశమే తల్లీ ! మన సంస్కృతి విశిష్టమైనదే చెల్లీ అంటూ మనుస్మృతి మహా పవిత్రమైనదిగా, చాలా ఉత్కృష్ట మైనదిగా భావిస్తూ ఆసూత్రాలమీద ఈనాటికీ యెనలేని గౌరవం చూపు తోంది మన నారీలోకం. రెండువేల ఏళ్ళనాడు మనువు స్త్రీకి కల్పించిన యావజ్జీవ పరాధీనత ఈ నాటికి ఆదర్శప్రాయం గానేవుంది. ఆలోచిస్తే మనువు గారిది ద్వంద్వనీతిగా పరిగణించవచ్చు. ఒక చోట స్త్రీ గృహలక్ష్మి; ఆమెను గౌరవించని చోట దేవతలుండ రంటాడు; తల్లి స్థానం గొప్పది; తల్లి ఋణం తీరేదికాదు; ఆమెను నిందించినవాడు స్వర్గానికి పోడు అంటాడు. మరొక చోట స్త్రీలను కనిపెట్టి వుండాలి; వాళ్ళకు స్వేచ్ఛ ఇస్తే వ్యభిచరించగలరనీ, వాళ్ళను బలవంతంగా అదుపులో వుంచటం కష్టసాధ్య మనీ, అందువల్ల వారికి బాధ కలుగని రీతిలో కంట్రోలు చెయ్యాలనీ ఆదేశించాడు. భర్త దేవతలకంటే గొప్పవాడనీ, అతని సేవకోసమే స్త్రీ పుటిందనీ, అతని కామవాంఛ తీర్చే భోగ్యవస్తువనీ, భర్త ఆజ్ఞను తిరస్క రించిన స్త్రీ నిందారురాలనీ నిర్దేశించాడు. జన్మ జన్మాలకూ ఈ భర్తే

కావాలని కోరుకుంటూ చేసే వ్రతాలను ఏర్పరచాడు. అది చాలక స్త్రీ బలహీనతకు మారుపేరు, అసూయకు ప్రతిబింబం అని ప్రకటించాడు. స్త్రీని పూజారిణిగా గుర్తించకపోగా మత విధులను విధిగా పాటించాలని స్పష్టీకరించాడు.

మనువుకు పూర్వమే స్త్రీ పతనానికి బీజాలు నాట బడ్డాయి. ఒక యుగానికి పూర్వం పురుషులు ఆహారంకోసం వేటాడేవాళ్ళు స్త్రీలు. పిల్లల్ని చూస్తూ ఇంటివద్దనే వుండేవారు అప్పుడు మొదలయిన పురుషాధికారం పరిశ్రమల అభివృద్ధివల్ల ఆర్థికాధిపత్యానికి కూడా మార్గ మేర్పడింది. ఈ పరిస్థితి ప్రపంచ మంతటా వచ్చిందని ఆర్థిక శాస్త్రజ్ఞులు విశ్లేషించారు. వివరించి చెప్పాలంటే అధికారం చలాయించే పరిపాలకులు, లేక పురుషులు అయినా వారి అధీనంలోవున్న ఉద్యోగులకు ఒక పద్ధతి (న్యాయచట్టం) ప్రకారం నడుచుకోవాలని నిర్దేశిస్తారు. తర్వాత ఈ 'కోడ్' మంచి విలువైనదిగా, బహు సంఖ్యాకులు దాన్ని ఆమోదించాలనే విధంగా అదే తుది నిర్ణయంగా నిలుస్తుంది. ఉ॥ ఒక ఉద్యోగి తన ఉద్యోగ విధుల కంటే తన శక్తినీ, కాలాన్నీ హెచ్చుగా వినియోగిస్తే అతన్ని మంచి ఉద్యోగి అంటారు. అతనికి పైహోదా, ఇంక్రిమెంటు ఇవ్వబడుతుంది. తోటి ఉద్యోగులంతా తామూ అలాగే చేసి మంచి పేరు, గౌరవం పొందాలని భావిస్తారు. అలాగే ఆర్థికంగా అధికారులైన పురుషులు కూడా స్త్రీల కొరకు అలాంటి కోడ్‌ను తయారు చేశారు. ఏ స్త్రీ తనస్వంతాన్ని గురించి ఆలోచించదో, భర్త కొరకే శక్తినంతా వినియోగిస్తుందో, కుటుంబం పిల్లల కొరకు త్యాగం చేస్తుందో, వారి ఆజ్ఞలను శిరసావహిస్తుందో ఆమెను పతివ్రతగా గౌరవిస్తారు. ఆ ఆదర్శాలనే ఇతర స్త్రీలు ఆచరించాలని చెప్తారు. ఆ సిద్ధాంతాలనే ఆధునిక ప్రచార సాధనాల (సినిమాలు, సాహిత్యం) ద్వారా ప్రచారం చేస్తారు. వాటినే ఇతర స్త్రీలంతా ఆచరించాలని చెప్పిస్తారు. అలాంటి స్త్రీని సమాజం గౌరవిస్తుంది; సమ్మతిస్తుంది. ఆమెకు ఆర్థికాధికారంగల భర్త రక్షణ లభిస్తుంది. దీనినే (Convenient Social Viitue) అవసరాల కోసం, సౌకర్యాల కోసం, అధికారం గల వాళ్ళకు అనుగుణంగా మెలగడమే అనవచ్చు, అలా కాక ఏక్షణంలో ఆమె తన దారిన మారుస్తుందో, సొంత అభిరుచులతో ప్రవర్తిస్తుందో ఆమె తన రక్షణ

కోల్పోతుంది. ఇతర స్త్రీ పురుషుల వల్ల సాంఘిక బహిష్కారానికి లోన వుతుంది. ఇలా స్త్రీని హీనాతి హీనంగా చిత్రించిన మనుస్మృతిని స్త్రీ జనో ద్ధారకుడు అంబేద్కర్ తగుల బెట్టాడు. కాని తమను 'శూద్రులతో' స మా న ం గా మనువు పరిగణించినా స్త్రీలు మాత్రం ఆ పని చేయలేని దౌర్భాగ్య స్థితిలో వున్నారు. కారణం సాంఘిక కట్టు బాట్లు, సంప్రదాయ భావాలను జీర్ణించుకోబట్టే తరతరాల బానిస భావాలను స్త్రీలు విస్మరించ లేకున్నారు.

కాలం మారింది. పరిస్థితులు మారినాయి. సామాజిక ప్రగతిలో అనేక మార్పులు వచ్చినాయి. ఆర్థిక పరిస్థితులు వక్రీకరించినై. శాస్త్ర జ్ఞానం విశ్వవీధుల్లో విహరిస్తోంది. అయినా స్త్రీల పరిస్థితిలో చెప్పుకో తగ్గ మార్పు రాలేదు. వారిలో భావ విప్లవం కలగలేదు. మానసిక దాస్య విముక్తికై ఆ రా ట ం స్త్రీలలో అంతగా లేదు. వ్యక్తిత్వ వికాసం పెంపు కోరని రీతిలో, పురుషుల ఆధి పత్యంలో, వారి నీడలో జీవితాన్ని గడుపు కోవాలనే సనాతన సంప్రదాయంనుండి విముక్తి కోరని స్త్రీలు 99% వున్నారు. ఈనాడు మహిళలకు చట్టాలలో సమానత్వంవుంది. ఆస్తి హక్కులో కొంత వరకు వచ్చింది. విద్యా, ఉద్యోగావకాశాలు కొంత మెరుగయినాయి. రాజకీయంగా పాల్గొనే అవకాశాలు పెరిగినై. కాని స్త్రీలు మాత్రం ఉన్న ఏ హక్కులనూ వాడుకోరు; లేని వాటికై పోరాడరు. ఉ॥ స్త్రీల స్థాయిలో మార్పులు తెచ్చేందుకు ఈ శతాబ్దంలో ఇంతవరకూ పెద్ద ఉద్యమం పుట్టలేదనేది నగ్న సత్యం. కనుక స్త్రీ వి మో చ న కై స్త్రీలే చొరవ తీసుకోవాలి.

స్త్రీ విముక్తి అన్నా, స్త్రీ ఉద్యమం అన్నా పురుష ద్వేషంగాదు. పురుష నశింపు అంతకన్నా కాదు. పురుషులకున్న హక్కులకంటే హెచ్చు కాదు. సమానంగా మాత్రమేనని గ్రహించాలి. స్త్రీలకు పూర్తి విముక్తి వెంటనే అసాధ్యం కావచ్చు కాని దుస్సాధ్యం మాత్రం కాదు.

మానవుడు భూమిమీద పుట్టిన నాటినుండి స్త్రీకి ఏర్పడ బంధాల నుండి ఆమెకు విముక్తి అనేది మొదటి కోర్కె. స్త్రీలు ఆర్థికంగా ఆధార పడేస్థితి నుండి వెలికి రావటానికి మార్గాన్వేషణ చాల ముఖ్యమైనది.

పురుషులు ఆ అధికారాన్ని వొదులుకోటానికి ఇష్టపడరు. "అసలు మేమెందుకు ఒదులు కోవాలండీ ! స్త్రీలకు అంత తాహతేవుంటే వాళ్ళను సమానత్వం సంపాదించు కోమనండి." అని సవాల్ చేస్తున్నారు.

నిజానికి సాంఘిక, ఆర్థిక, రాజకీయ, నైతిక విషయాలలో సమానత్వానికి పోరాడగల ఆసక్తి వుంటే, అందరం కలిసి బలాన్ని కూడగట్టుకుంటే అప్పుడు ఒక పథకం ప్రకారం పోరాడవచ్చు. దానికి జాతీయ స్థాయిలో ఆర్మీ ఆఫ్ ఉమెన్‌ను ముందుగా సృష్టించు కోవాలి. ఆ సంఘంలో స్త్రీలంతా చేరాలి. దాన్ని బలపర్చాలి. సమాజానికి స్త్రీ విముక్తి అవసరమని అనిపించేలా చెయ్యాలి. స్త్రీ స్వేచ్ఛా పోరాటాన్ని పటిష్టమైన. పద్ధతిలో నడపగల్గాలి. అవసరమొస్తే తిరుగుబాటుకు వెనకాడ రాదు. స్త్రీ జాతి నశింపుకైనా సిద్ధపడతారు పురుషులు. కాని అంత తేలిగ్గా స్త్రీలకు స్వేచ్ఛా సమానత్వా లిస్తారనుకోవటం భ్రమ. కనుక ఇది దీర్ఘ కాలిక పోరాటం కావచ్చు. అవసరమైతే ప్రత్యక్ష చర్య అంటే ధరణ, సత్యాగ్రహాల ద్వారానైనా సాధించాలి. స్త్రీ ఉద్యమం అంటే స్త్రీ అహంకారానికి చిహ్నం కాదని గ్రహించాలి.

అసలు ప్రజాస్వామికం స్థిరపడాలంటే 50% ప్రజల్ని అజ్ఞానంలో. దాస్యంలోవుంచటం సాంఘిక ద్రోహం కాదా! స్త్రీ విముక్తి అంటే పురుషులకూ విముక్తేనని పురుషులు గ్రహించాలి. ముందుగా స్త్రీ పురుషుల వైఖరి మారాలి. ఇద్దరూ కలిసి స్త్రీ హోదాలో మార్పుకోరాలి. అందుకు స్త్రీలే చొరవ తీసుకోవాలి. విజ్ఞానం మేధస్సుకల స్త్రీలు స్త్రీ విమోచనోద్యమానికి సారధ్యం వహించాలి. ఆనాడే స్త్రీ జాతికి విముక్తి కలుగు తుందని ఆశిద్దాం.

ప్రొఫెసర్ ఎ. బి. షా స్మారకోపన్యాసం సంగ్రహ పాఠం, 16-1-82

# సమస్యలు : పరిష్కారాలు

ప్ర : మహిళలపై అత్యాచారాలు, మానభంగాలు, ఏరోగ లక్షణాలు ? దానికి మీరు సూచించే విరుగుడేమిటి ?

జ. లైంగిక వాంఛ తీర్చుకోటానికి మాత్రమే ఉద్దేశింపబడిన వస్తువుగా స్త్రీని పరిగణించే మానసిక జాడ్యం. స్త్రీ యొక్క ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా స్త్రీని తన కామతృప్తికి వాడుకోచ్చుననే పురుష దురహంకార మనోరుగ్మత, అవతల వ్యక్తి బాధతో గిల గిల గింజు కుంటుంటే చూచి ఆనందించే 'సాడిస్టు' మనోప్రవృత్తి, అత్యాచారాలకు దారితీసే మనోరోగాలు. స్త్రీ పురుషులు సమానులు అనే భావం బాల బాలికలకు ఉగ్గుపాలతో రంగరించి పోసినపుడు, సామాజిక విద్యద్వారా ఆ భావం ప్రభోదిత మైనప్పుడూ, తన తోటి వాడి సుఖసంతోషాలే తనకు సంతోష కారణాలని మానవుడు గ్రహించ గల్గినప్పుడు, తమ స్వప్రయోజనాల కోసం కుహనా విలువలను వ్యాపారస్థులు వ్యాప్తి చేయడం మానుకున్నప్పుడు స్త్రీలలో నిర్భయత్వం ఆత్మ విశ్వాసం నెల కొనినప్పుడు, దోషిని సమాజమే కాక అతని కుటుంబీకులు కూడా బహిష్కరించ గలిగినప్పుడు, అత్యాచారానికి బలియైన యువతులు కరాటేలాంటి విద్యల నభ్యసించినప్పుడు స్త్రీని తోటి స్త్రీలు చిన్నచూపు చూడడం మానుకున్నప్పుడు ఈ అత్యాచారాలు సమసి పోగలవు. అలాంటి పరిస్థితులను కల్పించుటయే ప్రజల విద్యుక్త ధర్మం.

ప్ర. స్త్రీకి కుటుంబ వ్యవస్థలోగల స్థానాన్ని మీ రేవిధంగా పరిగణిస్తున్నారు ? ఇంతకంటే మెరుగైన స్థానం ఆమెకు లభించటానికి రావలసిన సామాజిక మార్పులు ఏమిటి ?

జ. దరహంమీద చూస్తే ప్రస్తుత కుటుంబ వ్యవస్థలో స్త్రీ జీత బత్తెములు లేని వంటమనిషి, పనికత్తె, పిల్లలను కని వంశోద్ధారకులను ప్రసాందించే సాధనం. ఆమెకు పతివ్రతాత్యం నిర్దేశింపబడినది. ఆమె స్థాయి ద్వితీయ శ్రేణికి చెందినది. ఆమె భార్య; ఆమెను భరించు

వాడు భర్త. అతడు యజమాని–ఆమె బానిస. ఆమె వ్యక్తిత్వానికి గుర్తింపు లేదు. ఇదీ స్త్రీల పరిస్థితి. స్త్రీకి విద్య, ఉద్యోగావకాశాలు ఆమె జన్మ హక్కనీ, ఆమె వ్యక్తిత్వ వికాసానికి అనువైన సామాజిక వ్యవస్థ కావాలని ప్రకటించి వాటికై కృషి చేయడం అవసరం. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు, న్యూనతాభావనా నిర్మూలనకు, సమానత్వ సూత్ర ప్రతిపాదనకు అనువైన సమాజం కావాలి. స్త్రీని గౌరవించ తగిన వ్యక్తిగా పరిగణించే సమాజం అవసరం. ఇందు కవసరమైన భావ విప్లవం, తదనుగుణమైన సామాజిక పరిణామం ఆవశ్యకాలు. ఈ ప్రయత్నంలో అభ్యుదయ భావాలుగల పురుషుల సహాయ సహకారాలు కూడా వాంఛనీయం. స్త్రీలు సైతం తమ మానసిక దాస్య విముక్తికై ఆరాట పడాలి.

ప్ర. మహిళకు ఆస్తి హక్కులో సమాన భాగం ఇవ్వడంవల్ల ఆమె హోదా మెరుగు పడుతుందని భావిస్తున్నారా ?

జ. కొంత మెరుగు పడుతుందనడంలో సందేహం లేదు. కట్నం ఇచ్చి మగనిని కొనుక్కొని అతనికి బానిస అయ్యే దుస్థితి నుండి స్త్రీ తప్పించుకొనవచ్చును. దుష్టుడైన భర్తను త్యజించటానికి తగిన ధైర్యం స్త్రీ పొందగలదు. కానీ ఈ ఒక్క మార్పే ఆమె పరిస్థితిని సంతృప్తికరంగా మార్చలేదు. రాజకీయ, ఆర్థిక, సామాజిక, మానసిక రంగాలన్నింటిలో ఏక కాలంలో మార్పు రావాలి. ఆర్థిక ప్రతిపత్తి కలిగి కూడా స్వేచ్ఛను అనుభవించలేని స్త్రీలు పెక్కుమంది కలరనేది నగ్నసత్యం. తన సంపాదన అంతా భర్త దోసిట్లో పోసి అతడిచ్చే ముష్టి అలవెన్సుతో జీవయాత్ర సాగించే వుద్యోగినులు కోకొల్లలు. ఆర్థికంగా మార్పువస్తే తతిమ్మా మార్పులు వాటంతటవే వస్తాయ్యనే యాంత్రిక ధృక్పథం పాక్షిక దృష్టికి దోహదం చేస్తుంది. ఈ విషయాన్ని గుర్తించి స్త్రీలకు సమాన వారసత్వ హక్కు జరుగుతుంది.

ప్ర. మహిళలకు ఇప్పటి ప్రభుత్వ వ్యవస్థలో, పాలనలో ప్రాతినిధ్యం పెంచడంవల్ల మహిళల సమస్యలు తీరుతాయని భావిస్తున్నారా ?

జ. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పేముందు మహిళల సమస్య లేమిటో తెల్సుకోవాలి. కష్టపడినా తిండికి చాలీచాలని సంపాదన, పురుషుల కన్నా తక్కువ వేతనాలు, ఆరోగ్య, విద్య, వైద్య సౌకర్యాల కొరత, శలవలులేని పని భారం, విశ్రాంతీ, విరామమెరుగని గొడ్డు చాకిరీ, భర్తల చెప్పుచేతల్లో మెలిగే బ్రతుకులూ, పిల్లల్ని పుష్టిగా పెంచుకోలేని దౌర్భాగ్య స్థితీ, చివరకు భర్త తనని వస్తువుగా చూచే స్థితీ, ఓటును కూడా బహిరంగంగా తన ఇష్టప్రకారం వాడుకోలేని స్థితి ఇలా ఎన్నో మరెన్నో సమస్యలు వారిని పీడిస్తున్నై. ఇవన్నీ పరిష్కారం కావాలంటే వ్యక్తిని మరో వ్యక్తి దోచుకోడానికి వీలు లేని సమసమాజస్థాపన జరగాలి. ప్రజాస్వామ్యం రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాలలో వెల్లివిరియాలి. స్వేచ్ఛ, సమానత్వం సౌభ్రాతృత్వం లాంటి మానవ విలువలు జీవితాలలో మిళితం కావాలి ప్రభుత్వంలో, పాలక వర్గంలో స్త్రీలకు ప్రాతినిధ్యం పెరిగితే పరిస్థి కొంతగా కొంతయినా మారుతుంది. కానీ సమస్యలన్నీ పరిష్కా మవుతాయని భావించటం పొరపాటు. శ్రీమతి ఇందిరాగాంధీ ప్రధా మంత్రి అయినంత మాత్రాన స్త్రీల పరిస్థితిలో మౌలికంగా మారు రాలేదు. అట్లే అజ్ఞానాంధ కారాలలో కొట్టు మిట్టాతున్న స్త్రీ జాతి హెచ్చుగా ప్రాతినిధ్యం కల్పించి నందువల్ల వ్యవస్థలో మౌలి మైన మార్పురాదు. కాగా స్త్రీలలో ఆత్మ విశ్వాసం పెరగడాని సామాజిక చైతన్యం పెంపొందటానికి, తమ పరిస్థితిని మెరు పర్చుకోవాలనే తహతహ వృద్ధి కావటానికి ఇది వుపకరిస్తుంది. కన స్త్రీల ప్రాతినిధ్యం ప్రభుత్వంలో, పాలక వర్గంలో పెరగ ఆత్యవసరం.

ప్ర. ఇప్పుడున్న చట్టాలు, నియమాలు స్వల్పంగా సర్దుబాటుచేసి అమ పర్చడం ద్వారా మహిళలకు సంపూర్ణ స్వేచ్ఛ కలిగించి, పురుష పత్యాన్ని తుదముట్టించ వచ్చంటారా? లేక ఈ వ్యవస్థను సమ లంగా నాశనం చేయవలసిన అగత్యం ఉందని భావిస్తున్నారా ఒక వేళ ఆ అగత్యం ఉందంటే మీ రాశించే మరో వ్యవస్థ ఎట్టిది

జ. మీ ప్రశ్నలోనే జవాబు వుందండీ! ఈ నాడున్న చట్టాలు నియమాలు కొన్ని సందర్భాలలో తప్ప చాలా భాగం లోపభూయిష్టాలు. వాటిని స్వల్పంగా సర్దుబాటు చేస్తే సంపూర్ణ స్వేచ్ఛ ఎలా వస్తుంది ? ఆమాట కొస్తే సంపూర్ణ స్వేచ్ఛ అనేది ఏ వ్యక్తికీ వుండదు. కాగా స్త్రీ పురుషుల మధ్య సంపూర్ణ సమానత్వం సాధించ బడవచ్చు. ఏదైనా వ్యవస్థ సమూలంగా మారాలి. ఇది విప్లవాత్మక భావన. చట్టాలు, నియమాలు మారాలనేది సంస్కరణ. సంస్కరణ తీవ్రత హెచ్చయితే అది విప్లవానికి దోహదం చేస్తుంది. కనుక విప్లవ దృష్టితో అంటే సమూలమైన మార్పును వాంఛిస్తూనే చిన్న తరహా మార్పుల కోసం ప్రయత్నించటం కూడా అవసర మౌతుంది. ఇకపోతే నేను వూహించే సమాజం సహకార సూత్రంపై ఆధార పడుతుంది. స్త్రీ పురుష అసమానత్వం ఆ సమాజంలో వుండదు. తిండి-గుడ్డా, ఇల్లు - వాకిలీ, విద్యా - వైద్యం లాంటి ప్రాథమిక అవసరాలకోసం మానవుడు నానాయాతన పడే అవసరం వుండదు ఒకని శ్రమశక్తిని మరొకడు దోచుకోవడానికి, ఒకని వ్యక్తిత్వ వికాసానికి మరొకడు అడ్డువచ్చే పరిస్థితిలేని సమాజం అది.

ప్ర. వివాహానికి పూర్వం ప్రేమలోపడి మోసపోయే స్త్రీ ఆత్మహత్యకు పాల్పడుతోంది. మోసగించిన మగాడు మహారాజులా బ్రతుకుతున్నాడు. ఈ అసమ పర్యవసానాలకు పరిష్కారం ఏమిటి ?

జ. స్త్రీ ఆత్మహత్య చేసుకోవడం అవివేకం. కుమిలిపోయి జీవితం నిస్సారం చేసుకోవడం తెలివి తక్కువ. ఆత్మవిశ్వాసం - అలవర్చు కోవటం అవశ్య కర్తవ్యం. ప్రేమించటం వెఱ్ఱిపనికాదు; అది మానవ సహజం. ప్రేమవల్ల సన్నిహితత్వం ఏర్పడుతుంది. సెక్సుతో అది సుసంపన్న జీవితానుభవం. అలాంటి దానిని గురించి బాధ పడాల్సిన పనిలేదు. కాగా పురుషుని వాగ్దాన భంగము వలన, వియోగ ప్రాప్తి వలన బాధ కల్గవచ్చు. బాధను విడదీసి మర్చిపోవాలి. ఆనందాన్ని వేరుచేసి స్మరించుకోవాలి. 'శీలము' అంటే లైంగిక పరంగా మాత్రమే అర్థం చెప్పుకోవడం బుద్ధి పొరపాటు. పురుషుడి మోసానికి గురిఅయిన స్త్రీ శీలం పోగొట్టుకుందనే భావన తప్పు.

ప్ర. వివాహానికి పూర్వం తల్లి అయ్యే పరిస్థితి స్త్రీకి ఎంతవరకు సమంజసం? అట్టి వారికి మీరు చెప్పే పరిష్కారం?

జ. అవివాహిత మాతలు రెండు రకాలవారు. వివాహాన్ని ఇచ్ఛగించక మాతృత్వాన్ని వాంఛించి తల్లులయ్యే వారు ఒక తెగ. అలాకాక నమ్మిన ప్రేమని సాంగత్యం వలన తల్లులై తర్వాత పురుషుడి వంచనకు లోనైనవారు రెండవ తెగ. ఏదైనా వారి నడవడిని ఖండించే ప్రసక్తిలేదు. పై ప్రశ్నలో చెప్పిన సమాధానం ఇప్పుడుపకరిస్తుంది. కాగా శిశువుకు తల్లి దండ్రిలిద్దరి ప్రేమావుంటే మరీ మంచిది కనుక వివాహ వ్యవస్థలో సంతాన ప్రాప్తి పొందుట ఉచిత మని భావిస్తున్నా. అంటే అవివివాహిత మాతృత్వాన్ని ప్రోత్సహించను. దానిని నేరంగా పరిగణించి ఆ తల్లిని నిందించం. శిశువు సంక్షేమాన్ని గుర్తించి ఆమెకు సమాజం రక్షణ, ఆదరణల్లను ఇవ్వాలని కోరుతున్నాం.

ప్ర. స్త్రీ నేను తక్కువ అనే భావం ఎందుకున్నదీ ? దాన్ని మీరు ఎలా మార్పు చెయ్యగలరు ?

జ. పురుషాధిక్యతగల సమాజంలో స్త్రీ యొక్క శ్రమకు విలువ కట్టని వ్యవస్థలో స్త్రీని రెండవ తరగతి వ్యక్తిగా మాత్రమే గుర్తిస్తున్నప్పుడు, వారసత్వం, సంరక్షకత్వ వివాహది శాసనాలలో పురుషునిదే పై చేయిఅయినప్పుడు స్త్రీలో న్యూనతాభావం వుండడంలో. ఆశ్చర్యం లేదు. పురుషునిలోని ఆధిక్యతా భావన స్త్రీలోని న్యూనతా భావన రెండూ తప్పే. సమ్యక్ దృక్పథం కలిగి సమతుల్య దృష్టి ఏర్పడితే తప్ప ఈ అల్పత్యభావన పోదు. ఏక కాలంలో భావవిప్లవం, సామాజిక విప్లవం సంభవించి నప్పుడే ఈ పరిస్థితి మారుతుంది. వాటికోసం మనం కృషి చెయ్యాలి.

ప్ర. తెలుగు దేశంలో మహిళా ఉద్యమాలపట్ల అంచనా ?

జ. మహిళోద్యమం లేనిదే మహిళా సంఘాలు ఏర్పడవు. ఉద్యమం వ్యవస్థీకృతమై సంఘంగా పరిణ మిస్తుంది. ఆఫీసర్ల భార్యలచేత

ప్రారంభింపబడి పోషింపబడేది. "ఇండియన్ ఉమెన్స్ అసోసి యేషన్" జాతీయ నాయకులచేత బలపర్చబడి పోషింప బడుతున్నది. "ఆలిండియా ఉమెన్స్ కాన్ఫరెన్స్" స్త్రీలకు సంబధించిన శాసనాలలో మార్పు కోరడం, ఉద్యోగ స్త్రీలకు వసతి కల్పించడం, ఆరోగ్య కేంద్రాలు నడపడం మొదలైన కార్యక్రమాల ద్వారా కృషి చేస్తున్నది. కాగా ఈ సంస్థ మధ్య తరగతి ప్రజానీకాన్ని మాత్రమే సమీకరించ గల్గుతోంది. ఇకపోతే అఖిల భారత కమ్యూనిస్టు పార్టీకి అనుబంధంగా మహిళా సమాఖ్య, అఖిల భారత మార్క్సిస్టు పార్టీకి అనుబంధంగా మహిళా సంఘం పనిచేస్తున్నై. ఇవి శ్రామికవర్గ స్త్రీల డిమాండ్లను కోరుతున్నా, పాక్షిక దృక్పథంగల రాజకీయాలకు కట్టుబడి వుండడంవల్ల ఆయా పార్టీల సానుభూతి పరులను తప్ప తతిమ్మావారిని ఆకర్షించలేకపోతున్నై. ఇలా పైనచెప్పినఆలిండియా వుమెన్స్ కాన్ఫరెన్స్ మహిళా సమాఖ్య, మహిళా సంఘములకు ఆంధ్రప్రదేశ్‌లో శాఖలున్నై. ప్రభుత్వంవారిచే నియమింపబడిన ముఖ్య సేవికలు 20 వేల గ్రామాల్లో మహిళా సంఘాలను నెలకొల్పు తున్నారు. అవి ఎక్కువగా భజనలు, కుట్టు కేంద్రాలు, బాల్వాడీలు మొ॥ వాటిని నిర్వహిస్తున్నై. స్త్రీకి సమాజంలో వుండాల్సిన స్థానాన్ని గురించిన అవగాహన వాటికి లేదని చెప్పొచ్చు.

దేశాభివృద్ధి కార్యక్రమంలో భాగంగానే అవి పనిచేస్తున్నై. ఇటు వంటి సంఘాలను ఆంధ్రప్రదేశ్ మొత్తం మీద ఒక ఫెడరేషన్‌గా రూపొందించే ప్రయత్నం ఇటీవల ప్రభుత్వం చేసింది. కాని, సంఘాలున్నా, మహిళోద్యమ స్వరూప స్వభావాలను ఇవి ఆకళింపు చేసుకోలేదనేది నిజం. రాష్ట్రంలో చైతన్య వంతమైన మహిళా సంఘాలు చెదురు మదురుగా వున్నై. కాని వాటికి రాష్ట్రస్థాయి నిర్మాణం లేదు. కనుక మహిళా సంఘాలున్నై కానీ, జాగృతమై స్త్రీ జాతి మొత్తాన్ని చైతన్య వంతంచేసి నిర్దుష్ట లక్ష్యాలపైపు నడిపించగల మహిళోద్యమం ఆంధ్రప్రదేశ్‌లో ఇంకా ఏర్పడకపోవటం శోచనీయం.

('ఆంధ్రప్రభ' దిన పత్రిక ప్రతినిధితో భేటీ, మే '81)

# మహిళా సంఘాలు

మహిళా సమాజాలు ఎందుకు స్థాపిస్తున్నాం? అవి ఏంచేస్తున్నై? ఏంచెయ్యాలి! సమర్థవంతంగా ఎందుకు పని చెయ్యటంలా? వాటికి పూర్వ చరిత్ర వుందా? సమాజంలో ఈ సంఘాలకు విలువ, గౌరవం ఏపరిధిలోవున్నై? కార్యకర్తల బాధ్యత లేమిటి? కాలక్షేపానికీ, కార్యక్రమాలకీనా మహిళా సంఘాలు నిర్మించడం? ఈ సంఘాలవల్ల స్త్రీల పరిస్థితి ఎంతగా మారింది? సంఘాలద్వారా సాధించటానికి స్త్రీలకు సమస్యల లోపమా? స్త్రీలలో ఐక్యత లోపమా? లేక వంటలు, కుట్లు, భజనలు, బాల్వాడీలకే మహిళా సంఘాలు పరిమితమా? వీటి పుట్టుక, పరిణామం, పూర్వాపరాలు పరిశీలించుట ఈనాడు చాలా అవసరం.

ఒంటరిగా చెయ్యలేనిపని పది మందిమి కలసి సాధించగలమనే వుద్దేశ్యంతో సంఘాన్ని స్థాపిస్తాం. మన హక్కులు, కోర్కెకోసం సంఘాలద్వారా పోరాడటం సుకరమని భావిస్తాం. కార్మిక, కర్షక, యువజన, విద్యార్థి సంఘాలు తమ కోర్కెల సాధనకై సంఘాలుగా ఏర్పడి ఐక్యతతో పోరాడుతున్నై. సమిష్టి సత్యాగ్రహాల ద్వారా, నిరాహార దీక్షలద్వారానే కొన్ని హక్కులు, లాభాలు సాధించగల్గుతున్నై. మరి స్త్రీల సమాజాలు ఇతర సంఘాలలాగా మిషనరీ జీల్‌తో ఎందుకు పోరాడవు? నాటినుండి నేటి వరకు ఈ సంఘాలు ఏమి సాధించినై? మరి సగభాగమైన మహిళలు తాముగా తమ సమస్యల నెందుకు సాధించుకోవడంలేదో! పూర్వాపరాలు విచారిద్దాం.

ఉద్యోగాల నిమిత్తం భారతీయులు అఖిల భారత కాంగ్రెసును స్థాపించినట్లే "ఇండియన్ వుమెన్ అసోసియేషన్"ను ఇంగ్లీషు విద్య నేర్చిన కొద్దిమంది స్త్రీలు నెలకొల్పారు. అదే అఖిల భారత మహిళా సంఘం. మొదట్లో ఆఫీసర్ల భార్యలు, రాజకీయ నాయకుల భార్యలే ఆ సంఘంలో ఉన్నత స్థానాల్లో వుండేవారు. అప్పట్లో వారు సతీసహగమనం, బాల్యవివాహం, స్త్రీకి ఆస్తి హక్కు, అంటరానితనం, విధవా వివాహం – సమానత్వం ఈ విషయాలపై కొంత ప్రచారం చేశారు. కాని నాటికి నేటికి అవి అపరిష్కృతంగానే, మిగిలి పోయినై. తర్వాత గాంధీజీ

్యాగ్రహపు పిలుపుతో స్త్రీలను ఉత్తేజ పరిచాడు. తద్వారా కమలా దేవి
ోపాధ్యాయ, హంసమెహతా, విజయలక్ష్మీ పండిట్, మణిబెన్‌కారా,
సుబ్బమ్మ, దుర్గాబాయ్ ఆనాడు జాతీయోద్యమంలో పనిచేశారు.
ి పూనికతో అఖిల భారత మహిళా సభ ఉద్భవించింది. తర్వాత
ణాఅసాఫలీ, హజారాబేగం. రేణుచక్రవర్తి, భారతీదేవిరంగా,
మాంబ, వల్లభనేని సీతామహలక్ష్మీ,అచ్చమాంబ ఆ సంస్థలోచేరి చాలా
చేశారు. ఇండియన్ నేషనల్ కాంగ్రెసునుండి ఇతర పార్టీలు విడి
యిన పిదప అఖిలభారత మహిళాసభ కాంగ్రెసు యువతుల సంస్థగా
లిపోయి, నేడది ఇందిరాగాంధీ, సుశీలానయ్యర్ మొ॥ కాంగ్రెసు
త్రుల నాయకత్వం క్రింద నడుస్తుంది. ఇప్పుడు ఆ సంఘం లో
త్యంతగ్గి కొద్దిమంది కార్యకర్తలతో స్థానిక కార్యకలాపాలు సాగిస్తోంది.
ాడు మహాసభలను నడిపే భారం సామాన్యులకు అందని ప్రమాని
ంది. రాణులు, మంత్రుల భార్యలు మాత్రమే ఆహ్వాన సంఘాధ్య
ుగా వుండి నడపాల్సిన స్థితిలో వుందా సంఘం. తర్వాత కమ్యూనిస్టు
ాళా సంఘాలను నెలకొల్పి అచ్చమాంబలాంటి వారి సారధ్యంలో
ు రైతు మహాసభలు, కుటుంబ నియంత్రణలపై, అధిక ధరలపై
సన లాంటివి విరివిగా ప్రచారం సాంగిచారు. మొత్తంమీద ఆనాడు
ేయ వాదులైన స్త్రీలే ఎక్కువగా కృషి చేశారనేది నిజం. ఇతర
ోద్యమాల వలెనే 1946 తర్వాత మహిళా సంఘాలపని కొంత కుంటు
దనేది నిజం.

ఆంధ్రప్రదేశ్ మొత్తం మీద షుమారు 50 వేల మహిళా సంఘాల
న జరిగిందనీ, అందులో 15 వేలదాకా రిజిష్టరైన మహిళా సంఘాలు
్నవనీ తెలిసింది. మహిళా సంఘాల స్థాపనలో ముఖ్యోద్దేశ మేదయినా
ంమొత్త మీద మన రాష్ట్రంలోనూ మహిళా సంఘాలు మిక్కుటంగానే
ి. కొన్ని మాత్రం ప్రభుత్వ సహాయంతో స్వంత భవనాలు కట్టించుకో
ైని మరి కొన్ని సంస్థలు ప్రభుత్వ గ్రాంట్లతో కుట్టు, హిందీ
ులు, సంగీత శిక్షణ, బాల్వాడీలు, గ్రంథాలయాలు నిర్వహిస్తున్నై.
్ఛగా భజనలు, వంటలు, పిండి వంటలకే పరిమితమైనవి మరికొన్ని
ి. కొన్ని సంఘాలు కండెన్సుడు కోర్సులు నడుపుతున్నై. మహిళా

నిషేధం, స్త్రీ పునర్వివాహం, ఓటు హక్కు, కొంత ఆస్థి హక్కు, ఉద్యోగార్హతలు. స్థానిక సంస్థలు, కళాశాలల్లో కొన్ని ప్రత్యేకస్థానాలులాంటి విషయాలలో స్త్రీలు కొంత ముందంజ వేశారు. కాని ఎప్పటి కప్పుడు క్రొత్త సమస్యలుత్పన్నమవుతూనే వుంటై. నేటి ముఖ్య సమస్యల్లో అధిక సంతానంవల్ల స్త్రీల ఈతిబాధలు, వరకట్న దురాచారంవల్ల కన్యల అగచాట్లు, కుల మతాల భేధాలవల్ల మానవ మనుగడకు అడ్డంకులు, మూఢాచారాల బలిమిచే వ్యక్తిత్వ పతనం, ముస్లింలలో ఘోషా, వారిలో బహు భార్యాత్వం లాంటి వింకా స్త్రీలను వేధిస్తూనేవున్నై. అన్నింటి కంటే మించింది స్త్రీకి వ్యక్తిత్వ వికాసలోపం, వ్యక్తి స్వేచ్ఛ లేమి; స్త్రీ-పురుష వ్యత్యాసం; స్త్రీ తాను తక్కువ అనే భావం వల్లే పురుష దురహంకారానికి తల ఒగ్గడానికి ముఖ్యమైన మూలకారణం. ఏదోఒక మగదిక్కు, రక్షణ కావాలి. 'స్త్రీ స్వాతంత్ర్యనమర్హతి' అనే స్థితి నుండి స్త్రీలు బైటపడటానికి వారికి వారి వ్యక్తి స్వేచ్ఛా సమానత్వాల గూర్చి ప్రబోధించటానికి మహిళా సంఘాల బాధ్యత ఎంతో వుంది. సభలు, సమావేశాలు, సెమినార్లు, చర్చావేదికలు పెట్టి స్త్రీలను రప్పించి వారికి ఓర్పుతో, నేర్పుతో స్త్రీ సమస్యలను అవగత మయ్యేలా ప్రబోధించాలి సంఘంద్వారా.

ఆనాటి స్త్రీ సమస్యలు వేరు - ఈనాటివి వేరు. సాంఘిక పరిస్థితుల్ని బట్టి అవి మారుతూ వుంటై. ఆనాడు సహగమన నివారణకు పోరాడాల్సి వచ్చింది. 2% స్త్రీ విద్య వుండేదప్పుడు. స్త్రీ వుద్యోగినులే లేరని చెప్పొచ్చు. కోర్టులకొచ్చి విడాకులు కోరే స్త్రీలు, ఆస్తి, భరణం లాంటి వాటికై పోరాడే స్త్రీలే లేరనొచ్చు. ఆనాటి స్త్రీల పోరాటాలు అత్యల్పం, పరిమితం. విద్య, వుద్యోగం, సహగమనం, ఓటులాంటి వాటికై పోరాటం సాగించి కొంతగా కొంత జయించారు. కాని ఈనాటి పరిస్థితులలో చాలా మార్పు వచ్చింది. ఈ యాంత్రిక యుగంలో నివశించే స్త్రీకి కొన్ని లాభాలతో పాటు కష్టాలూ ప్రాప్తించినై. సమిషి కుటుంబాలు సమసిపోయినై. ఆర్థిక బాధలు పెరిగినై. ధరలు ఆకాశాన్నంటుతున్నై. ఒక్క భర్త మాత్రమే సంపాదిస్తే కుటుంబాలు గడవని పరిస్థితులొచ్చినై. కనుక స్త్రీ విద్యనార్జించాలి; వుద్యోగంచేయాలి. ఇంట, బైట చాకిరీ చెయ్యాల్సిన పరిస్థితులొచ్చినై. దాని కొరకై ఒంటరి స్త్రీలకు వసతి గృహాలు కావాలి. వారి

దాడిచేసి సామాజిక చీడ పురుగుల్ని సమూలంగా నశింపు చెయ్యాలంటే స్త్రీలలో జాగృతి, వికాసం కావాలి. వారిలో ఐక్యత అన్నిటికన్నా ముఖ్యమైనది. ఆనాడే మహిళా సంఘాలు సర్వతోముఖమైన సామాజిక అశాంతిని నిర్మూలించి ముఖ్యంగా స్త్రీలలో నిద్రాణమైన శక్తుల్ని మేల్కొలపగలవు. స్త్రీ సమస్యలపై నొక్కి పెట్టి సేవచేసే మహిళా సంఘాలకు అద్వితీయమైన స్థానంవుంది.

(తుంగభద్ర మహిళా సంఘ సావనీరు ఫిబ్రవరి 81)

# సంఘ సేవకురాలి సమస్యలు

సామాజిక సేవ ఎందుకు చెయ్యాలి? ఎలా చెయ్యాలి? ఎవరి కొరకు చెయ్యాలి? అనే ప్రశ్నల్ని ప్రప్రథమంగా వేసుకొని వాటికి సమాధానాన్ని తనకు తానే తృప్తికరంగా చెప్పుకోవాల్సి వుంటుంది. సంఘ సేవిక సమాజం యెడ సద్భావంతోవుండి ఎవరికి సేవచెయ్యాలనే విషయం ఆమె నిర్ణయించుకోవాలి. తర్వాత సేవ చెయ్యాటానికి తనకున్న అర్హతను, శక్తి సామర్థ్యాలను ఆమె అంచనా వేసుకోవాలి. ఇలాంటి ప్రశ్న లన్నింటికి మంచి జవాబులను ఆమె పొందగలిగినా; అడ్డంకులను, ఆటంకాలను అధిగమించి కార్యనిర్వహణ చేయగల పట్టుదల, ధైర్యం తన కున్నవా ? లేవా అనే ప్రశ్నను మాత్రం ఆమె వేసుకోక తప్పదు.

సంఘ సేవిక ఎదుర్కొనే సమస్యలు అనేకం. పైగా వైవిధ్యంతో కూడినవి. అవి చిన్నచిన్న అడ్డంకుల నుండి బ్రహ్మాండమైన అవరోధాల వరకు రూపకల్పన చేసుకొని వుండవచ్చు. ఈ అడ్డంకులు, ఇబ్బందులు ఏ మూలనుండి వస్తయ్యో అని పరిశీలిస్తే అవి వివిధ రంగాలనుండి, భిన్న పరిస్థితులనుండి రావచ్చు.

సమాజసేవ చేద్దామనే కృత నిశ్చయంతో ఆమె ఇల్లు బయలు దేర తలచగానే ఆమెకు ఇంట్లోనే ఎన్నో చిక్కులు వస్తయ్. అత్తగారి విషయం అలా వుంచుదాం; భర్త, పిల్లలూ ఆమెను అదో రకంగా చూస్తారు. ఏ కొద్దిమంది సహృదయుల విషయంలోనో తప్ప తతిమ్మా వారి

విషయంలో భర్త యొక్క చిరాకు దిన దినాభివృద్ధి చెందుతూ వుంటుంది. మా అమ్మ మా ఇంటికి అతిధిలా వస్తుందని పిల్లలు ఆమెను పరోక్షంగా దెప్పి పొడుస్తారు. ఈ సూటి పోటీ మాటలను, ఈ వాఖ్యానాలను పట్టించు కోకుండా వుండాలంటే ఎతో గుండె నిర్భరం కావాలి ఆమెకు.

సంఘంలో అణగారిన పీడిత ప్రజానీకం నివశించే ప్రాంతానికి ఆమె పట్టుదలతో తరలి వెడుతుంది. వారు ఆమెపై చిరుకోపంతో దృష్టి సారిస్తారు. ఆమె వారితో స్నేహం చేసుకోవాలని తాపత్రయ పడుతుంది. ప్రతిస్పందన వుండదు. ఆమె చనువుగా మాట్లాడుతుంది. వారి విముఖత సడలి పోతుంది. ఆమె ప్రశ్నలకు వారి చిరునవ్వులే సమాధానాలవుతై. ఎంతో వుత్సాహంతో తిరిగి ఇటికొస్తుంది. మర్నాడు అదే ప్రాంతానికి మళ్ళా పోతుంది. ఈ సారి అచ్చటి పిల్లలు ఆమెనాహ్వానిస్తారు; యువతులు ఆమె చుట్టూ మూగుతారు. చివరికి పెద్దలు కూడా వస్తారు. వాళ్ళు ప్రశ్న పరంపరలు ప్రారంభిస్తారు. 'మాకు కడుపునిండా తిండి వుండే పరిస్థితి కల్పించగలవా ? మాకు వుద్యోగాలు సంపాదించి పెట్టగలవా ? మాకు ఇంతకన్నా శుభ్రమైన ఇళ్ళు ఇప్పించగలవా' ఇలా అనేక రకాలుగా వుంటై వారి ప్రశ్నలు. సమాధానాలు చెప్పటం ఇప్పుడు ఈమె వంతవుతుంది; తవుడు కుంటుంది. తత్తర పడుతుంది. ఆ ప్రజల ముఖాలపై దరహాసం చిందులాడుతుంది. అవమానంతో ఆమె కృంగిపోయి ఇంటికొస్తుంది. కాని ఆమెలో ఉత్సాహం మాత్రం చచ్చిపోలేదు. కృషి నిర్వహణను విడిచి పెట్టటానికామెకు మనస్కరించదు. విశ్రాంతిని ఆమె వాంఛించదు. మర్నాడు మళ్ళీ వెడుతుందక్కడికే. పాత స్నేహితుణ్ణి పలకరించే విధంగా పిల్లలూ, పెద్దలూ ఆమె నాదరిస్తారు. ఎగతాళి మటు మాయామవౌతుంది. ఆమె యెడ వారిలో గౌరవ భావం పొడసూపుతుంది. ఆమెను తమ మనిషిగా వారెంచు కుంటారు. అమె సహాయానికి, సానుభూతికి, మార్గ దర్శకత్వానికి వారు అఱ్ఱులుచాస్తారు. అప్పటికామెకు అర్థమవుతుంది తన పరిస్థితి. తను నిర్ణయించుకున్న పనికి అవసరమైన శక్తి సామర్థ్యాలు, నైపుణ్యం తనకు లేవని తెలిసొస్తుంది. అమె మనస్సులో వినయం చోటు చేసుకుంటుంది. సేవా కార్యక్రమం ప్రారంభించే ముందు తను ఇతోధి కంగా తెలుసుకోవాలని ఆమె గ్రహిస్తుంది. ఈ గుణపాఠాన్ని సమాజ సేవకులంతా జ్ఞప్తిలో వుంచుకోవాలి.

ప్రజల్ని ఎదుర్కొనే సమస్యల బృహత్తర పరిమాణాన్ని తెలుసుకున్నా తర్వాత తనొక్కతే వాటిని పరిష్కరించ లేననీ, తనలాంటి సంఘసేవకుల బృందం అవసరమనీ గ్రహిస్తుంది. ప్రజలయొక్క కష్టనిష్టూరాలను సానుభూతితో అర్థంచేసుకోగలగటమే కాక వారికి సహాయం చెయ్యాలనే సంకల్పం సంఘ సేవికలకుండాలి. బీదలలాగా కాస్తో కూస్తో బాధలకు లోనౌతారు గనుక, మధ్య తరగతిలో ఆర్థికరీత్యా క్రింది మెట్టులో వున్నవారిలో సంఘసేవికలు దొరకుతారు. వాళ్ళకు కొంతైనా చదువున్నది. కనుక సమస్యల అవగాహనా శక్తి, పరిష్కారాలను సూచించగల సత్తా వారికుంటై. అందువల్ల సంఘ సేవికల బృందంకోసం ఆమె మహిళా సంఘాన్ని స్థాపించటానికి ఉద్యుక్తురాలౌతుంది.

సంఘ నిర్మాణంలో ఒకరకంగా ఆలోచిస్తే ఆమెకు అనేక రకాల ఇబ్బందులు, చిక్కులు మొదలవుతై. సంఘంలో సభ్యుల్ని చేర్పించాలి గదా! తన చుట్టుపట్ల ప్రాంతంలో తన వర్గంవారి వద్దకు పోతుంది. అక్కడ ఆమె అనేక కష్టాలను ఎదుర్కొంటుంది. తన భర్తకు ఇలాంటి కార్యక్రమాల్లో పాల్గొనటం ఇష్టంలేదని చెపుతూనే ఒక మహిళ వీధి వాకిలి దభాల్న మూస్తుంది. తన పిల్లల బాగోగుల్ని పట్టించుకోకుండా సమాజ సేవ చెయ్యటానికి తనకు తీరిక లేదని మరొక స్త్రీ ఎత్తిపొడుస్తుంది. ఎలాంటి సేవా కార్యక్రమం చేపట్టాలో గంటల తరబడి వివరించి, సలహా చెప్పి, చివరకు పనిచెయ్యటానికి ప్రస్తుతం తనకు తీరికే లేదంటూ వకామె సభ్యురాలిగా చేరనంటుంది. మరొక ఆమె కొంచెం ఏహ్యభావంతో చూస్తూ, దానం ఇచ్చే పోజు పెట్టి, అయిదు రూపాయల నోటు గిరుక్కున విసిరి పారేస్తుంది. ఇంతమంది ఇన్నిరకాలుగా వున్నా, ఉత్సాహాన్ని ప్రదర్శించి మద్దతు చేస్తామని వాగ్దానం చేసేవారు లేక పోలేదు. వారి అండదండలకై అఱ్ఱులు చాస్తుందప్పుడు.

సంఘం ఏర్పడగానే దానిని ఎగతాళి చేస్తారు. దాని కార్యక్రమాలను గురించి తేలిగ్గా తీసేస్తారు. ధృతి కోల్పోకండా సంఘ సేవిక తన కృషిని కొనసాగిస్తుంది. అంతలో కొందరు సహాయ నిరాకరణ చేస్తారు. మహిళా సంఘపు పని జరిగి పోతూవుంటుంది. ప్రత్యర్థులు ద్వేషం పెంచుకుంటారు.

నిందలు వేసి సంఘాన్ని నామ రూపాలు లేకుండా చెయ్యాలని ప్రయత్నిస్తారు. అయినా సంఘ ప్రణాళికలు అమలు చేయబడతాయి. సంఘం స్థిరపడుతుంది; ప్రజారంజక కార్యక్రమాలు చేపట్ట బడతాయి. ప్రజలు సంఘాన్ని మెచ్చుకుంటారు. ఈ సమయంలో హఠాత్తుగా ఊహించని చోటు నుండి ఇబ్బందు లొస్తాయి. మహిళా సంఘ స్థాపకురాలికి విరివిగా ప్రచారం వస్తోందని, మిగతా వారికి రావటం లేదని తోటి కారకర్తలు అసూయ పడతారు. నిజానికి సంఘానికే ప్రచారం రావాలని ఆశించటం జరుగుతుంది. కాని సంఘం వెలుపల వున్నవారికి స్థాపకులే సంఘంగా కనపడతారు. అందువల్ల ఆమెకు ప్రతిష్ఠ లభిస్తుంది. ఇది కొంత మంది తోటి కార్యకర్తల కడుపు మంటకు కారణభూత మౌతుంది. అసూయ ఏహ్యభావానికి దారి తీస్తుంది; అపార్థాలకు, తగాదాలకు ఆస్కారం వస్తుంది. సంఘ కార్యక్రమం ఆగిపోతుంది; సంఘం బలహీన పడుతుంది. ఒక వర్గం సంఘంనుండి వెళ్ళిపోతుంది? సంఘంయొక్క శక్తి సామర్థ్యాలు కుంటు పడతై. సంఘం ఛిన్నా భిన్నమౌతుంది. అసమ్మతి వర్గం మరో సంఘస్థాపనకు నడుం కడుతుంది. దాంతో మళ్ళీ అదే కథ ప్రారంభ మౌతుంది. ఒక సంఘం చేస్తున్న కార్యక్రమాన్నే మరొ సంఘం చేపట్టటం, సంఘాలు కుక్కగొడుగుల్లా పుట్టటం వల్ల మహిళోద్యమం దెబ్బ తింటుంది.

సంఘ వనరులు తక్కువగా వున్నవని, గ్రహించి సేవిక ధనవంతుల సహాయాన్ని అర్థిస్తుంది; వారు సహాయం చేయకపోగా నిరాదరణకూడా చేస్తారు. మద్దతు ఇవ్వగల శక్తి బీదవారికి లేదు. మధ్య తరగతిలో రెండవ శ్రేణివారు విరాళా లిస్తారు. కాని వారివ్వగలిగింది చాలా స్వల్పం. అప్పుడు సంఘసేవికకొ ఒకే ఒక సవాలు ఎదురౌతుంది. "సంఘాన్ని ఎలా నిర్వహించాలి" అనేదే ఆ ప్రశ్న. ప్రభుత్వంవారి ప్రణాళికల్ని గురించి ఆమె పత్రికల్లో చదువుతుంది. గ్రాంటుకోసం అర్థిస్తుంది. స్వచ్ఛంద సంస్థలు తమ కాళ్ళమీద నిలబడాలని అడగా పెట్టని సలహాను ప్రభుత్వాధికార్లు సంఘసేవికకు అందిస్తారు. స్వచ్ఛంద సంస్థల కార్యక్రమాల విలువను తెలిసికోకుండా, భారీఎత్తున నెల జీతం పుచ్చుకుంటూ అంటీ ముట్టకుండా వున్న ప్రభుత్వధికారి పై ఖరిని గురించి ఆమె చింతిస్తుంది. తత్కాలానికి ఆమె నిరుత్సాహపడ్డా ఆమెలో పోరాట పటిమ చావదు.

సంఘసేవిక సరుకుల కల్తీ దారును, వస్తువులను దాచే వర్తకుని, బ్లాక్ మార్కెట్ చేసే వ్యాపారిని ఎదుర్కొని వారి దుశ్చర్యలను బైట పెడుతుంది; దాంతో వారు ఆమెను ద్వేషిస్తారు. ఆమె కుటుంబ నియంత్రణ ప్రచారం చేపడుతుంది; మతస్తులు ఆమెను నిరశిస్తారు. పురుష దురహంకారాన్ని, ఆధిపత్యాన్ని ఆమె దుయ్య బడుతుంది! పురుషులు ఆమెపై కక్ష సాధిస్తామని శాభ్దిచేస్తారు. స్త్రీ విముక్తి కావాలని ఆమె వాదిస్తుంది. ముసలమ్మలు ఆమెను నిందిస్తారు. తమ పార్టీలలో స్త్రీలకు బాధ్యతాయుత స్థానాలను ఇవ్వలేదని ఆమె రాజకీయ పార్టీలను విమర్శిస్తుంది. పురుష ద్వేషి అని, పచ్చి స్త్రీ పక్షపాతియని ఆమెను రాజకీయ పార్టీలవారు అభివర్ణిస్తారు. ఇలా స్వప్రయోజనాన్ని ఆశించే వారంతా ఆమెను వ్యతిరేకిస్తారు. క్రూరులైన భర్తలవల్ల బాధపడే స్త్రీలను వేరుగా కాపురముండమని ఆమె సలహా చెప్తుంది; తోటి స్త్రీలు ఆమె సలహాను తప్పు పడతారు. అన్ని మతాలలోని సంప్రదాయ వాదులు ఆమెను ఖండిస్తారు. "తిరుగుబాటును ఎన్ని గుండెలతో ప్రోత్సహిస్తావు? భర్తను వదలి వేయటం వ్యభిచారంతో సమానం" అని అరుస్తారు సంప్రదాయ వాదులు. అణిచివేతకు, దౌర్జన్యానికి బలైన స్త్రీకూడా సంఘసేవిక సలహాను తృణీకరిస్తుంది. ఎవరి సేవ చెయ్యాలని బయలు దేరిందో వారే తనని బలపర్చక పోవటంతో సంఘసేవకురాలు కృంగిపోతుంది. ఇకబరువు మోయలేనేమోనని ఆమెకు సందేహం కల్గుతుంది. ఏం చెయ్యాలి అనే ప్రశ్న ఆమె నెదుర్కొంటుంది. సంఘసేవ మానాలా? ఎన్నటికీ అలా జరగరాదు. తన పైఫల్యానికి కారణాల గురించి తనే ఆలోచించడం మొదలెడుతుంది, 'ఎవరిది పొరపాటు? తనదా? లేక సమాజానిదా?' ప్రశ్నకు సమాధానం లేదు. ఆమె అయోమయావస్థలో పడుతుంది.

ఎందుకు తనకు సమాజం మద్దత్తు ఇవ్వలేదు అని ఆమె తనని తాను ప్రశ్నించు కుంటుంది. ఒకసారి కన్ను తెరిచి తనచుట్టూ కలియచూస్తుంది. సీతాకోకచిలకలా వుండే సంఘ సేవిక ఒకామె ఆమెకు అక్కడ దర్శనమిస్తుంది. అక్కడేకాదు, ఆమె సర్వాంతర్యామి. ఆమె ప్రభుత్వ గ్రాంట్ల మీద బలపడుతూవుంటుంది. అధికారంలో వున్నవారిని ఆమె పొగుడుతుంది. ప్రచారమామె జన్మహక్కు. ప్రజల మెచ్చికోలు ఆమెకు విధిగా రావల్సిందే.

# స్త్రీవిద్య వ్యాప్తిపై పునః పరిశీలన జరగాలి

నా దేశానికి అర్ధరాత్రి స్వరాజ్య మొచ్చింది. ఇంకా తెల్లవారలేదు అన్నట్లుంది నేటి స్త్రీవిద్య. ఒక దేశ నాగరికత, సంస్కృతి గురించి చెప్పాలంటే అచ్చటి స్త్రీవిద్యాస్థాయి, ఆమెకున్న ప్రజా ప్రాతినిధ్యస్థానాలనుబట్టి నిర్ణయించగలం. స్త్రీ లెంత విద్యావంతులైతే అంత సుభిక్షంగా జాతి మనగల్గుతుంది. ముఖ్యంగా ప్రజాస్వామిక రాజ్యాంగ పరిపాలన స్త్రీ శక్తి సామర్థ్యాల వల్లనే ద్విగుణీకృతంగా వర్ధిల్లుతుంది. సగభాగమైనస్త్రీ అవిద్య, అజ్ఞాన అంధకారాలలో అల్లాడుతుంటే ఆ సమాజానికి, జాతికి ప్రగతి లేదు. వారిని చులకనగా చూడటం, వారి విద్వత్తును, నైపుణ్యతను త్రోసి రాజనటం అర్ధవిహీనం.

అసలు విద్య ఎందుకు? విజ్ఞానానికా, మనోవికాసానికా? లేక జీవనోపాధికా? అనే విషయంలో విజ్ఞానానికే ముఖ్య పాత్ర ఇవ్వాలి. మానవుడు ఆహార, నిద్రామైధునాలతో తృప్తి పొందడుకదా! వీటిని మించిందే విజ్ఞానం. విజ్ఞానానికి విద్య ముఖ్యం. అదిలేని వ్యక్తి పశువుతో సమానం అన్నారంకదా! మరి జీవితానికి ముఖ్య భాగమైన విద్యను ఎందుకిలా తిరస్కరిస్తున్నాం. అవకాశాలు లేకనా, ఆసక్తి లోపమా, వనరులు లభించకనా? ఆలోచిస్తే అన్ని లోపాలూవున్నై. అందువల్లే మనమింకా వెనుకబడిన దేశాల జీవితాల్లో వున్నా మనిపిస్తుంది. కాగా, బిడ్డల్ని, గృహాన్ని నిర్వహించేది, సమాజాన్ని తీర్చి దిద్దగలది స్త్రీ. తాను విద్యాధికురాలైతే తనవారిని ఉత్తమ జాతి పౌరులుగా తీర్చిదిద్దగలదు. అందువల్లే స్త్రీ విద్యకు ప్రథమస్థానం యివ్వక తప్పదు. రష్యాలో 98%, ఇంగ్లండులో 96%, జపాన్, అమెరికాలలో 100% విద్య వుండగా 33 సం॥ల స్వపరిపాలనలో కూడా స్త్రీ విద్య 20% మాత్రమే ఉందంటే మన దేశంగురించి ఏమి చెప్పాలి? కనుక, గతాన్ని చారిత్రక దృష్టితో పరిశీలిస్తేనే వర్తమానం నిలుస్తుంది. దానినుండే భవిష్యత్తును నిర్ధారించగలం. స్త్రీవిద్య గురించి ముందుగా కొంత చారిత్రక దృష్టితో పరిశీలిద్దాం.

క్రీ. పూ. 3 వేల సం॥ల పూర్వం స్త్రీ విద్య అంటే వేద విద్య అని భావించవచ్చు. నాడు స్త్రీకి పూజ లొనరించటానికి అర్హత కలదనే దానికి

నాడు స్త్రీ కవయిత్రులు బహు అరుదనవచ్చు. కారణం స్త్రీ విద్య అసలే లేదు. బాల్య వివాహాలు అధికం. పురుషులు సైతం వృత్తి విద్యకే సరిపడే విద్య నభ్యశించేవారు.

పాశ్చాత్య ప్రభావం మన మీద ప్రసరించింది. పాశ్చాత్య స్త్రీలకు ఉన్న అవకాశాలు భారత వనితలకు లేవని గ్రహించిన రామమోహన్ రాయ్ లాంటి మేధావులు స్త్రీ విద్యకై కృషిచేశారు. ముమ్మొందుగా మిషనరీలు అవిరళ కృషి చేశారు. ఫాదర్ హేమన్ ద్వారా 1841లో బాపట్ల తాటితోపులో బడి ప్రారంభమయింది కాని, పెద్ద కుటుంబాల వారెవరూ తమ మతం భ్రష్టవుతుందని, మతం అంటే క్రైస్తవ మతంలో చేరుస్తారనే భయంతో బడికి పంపేవారు కారు పిల్లల్ని.

తిరిగి 1855 లో ఉడ్స్ డిస్పాచ్‌లో స్త్రీ విద్యా వశ్యకతను ఉద్ఘాటించటం జరిగింది. కాని ప్రజాదరణ పొందలేదు. అందువలన సమాజానికి విరుద్ధంగా సాధించలేమని నాటి బ్రిటీష్ ప్రభుత్వం గ్రహించి స్త్రీ విద్యను నిర్లక్ష్యం చేసింది. పరోక్షంగా సాయపడగలనని మొదటి విద్యాధికారి ఆర్నాల్డు సూచించాడు. దయానంద సరస్వతి, రామమోహనరాయ్ స్త్రీ జాతి నుద్ధరించారు. సగం దేశంలో ఈశ్వర చంద్ర విద్యాసాగర్ కృషివల్ల బాలికా పాఠశాల లేర్పడ్డాయి.

ఆంధ్రలో కందుకూరి, చిలకమర్తి, వెంకటరత్నంనాయుడు వంటి మహనీయులు తోడ్పడ్డారు. వారు ముగ్గురూ అధ్యాపకులే కనుక ఇళ్ళలోనే హిందీ పరీక్షలు పోటీ పరీక్షలు, పెట్టి స్త్రీలలో జ్ఞానజ్యోతి వెలిగించారు. కాని స్త్రీలు ముందుకు రాలేదని చెప్పొచ్చు. ఇలాంటి వారిని వ్యతిరేకిస్తూ ముదితల్ నేర్వగరాని విద్య గలదే ముద్దార నేర్పించినన్ అని చిలకమర్తి వారు, స్త్రీలకి విద్య కూడదని మనువుని పేర్కొంటూ కొక్కొండ వెంకట రత్నం అపహాస్యం చేస్తూ దీర్ఘ వ్యాసాలు వ్రాసేవారు. దానికి సవాల్‌గా పురుషులకూ విద్య కూడదని వీరేశలింగంగారూ వ్రాసేవారు. అలా స్త్రీ విద్య ఒక సమస్యగా తయారయిందప్పుడు.

మద్రాసు, బొంబాయి, కలకత్తా, పంజాబ్‌లలో మిషనరీ స్కూళ్ళు స్థాపించారు. క్రమంగా ప్రజా దృష్టి మిషనరీల పాఠశాలలపైపు మళ్ళి 8 సం॥లోపు బాలికల్ని మాత్రం పంపేవారు. పండగైనా, ఇంట్లో పనిబడ్డా స్కూలు మాన్పించేవారు. సంపన్నులు ఈ పాఠశాలలకు పిల్లల్ని పంపడం నామర్దాగా భావించేవారు. మాంటేగు, ఛెమ్సుఫర్డు సంస్కరణ లతో స్త్రీ విద్యకు ప్రాముఖ్యత ఏర్పడింది. ప్రయిమరీ పాఠశాలలు పెరిగాయి. కాని 1928 నాటికి స్త్రీ విద్య 2. 8% మించలేదు.

స్త్రీ పురుష లేకమై స్వాతంత్ర్య పోరాటంలో పోరాడినప్పు డిద్దరూ సమాన హక్కుగల సాంఘిక జీవులేనన్న అభిప్రాయం కల్గింది. మద్రాసులో నిర్బంధ ప్రాథమిక విద్యా పథకం ఏర్పడినందున బాల బాలికల విద్య ముందుకు సాగింది. రానురాను సమాజంలో సంస్కర్తల ప్రభావంవల్ల స్త్రీ విద్య ప్రచారం అధికమైంది. ధనవంతులలో తమకు మంచి వరుడు కావాలంటే అమ్మాయికి అక్షరంముక్క తప్పనిసరైంది. కాని 1925 వరకు స్త్రీల దృష్టి టెక్నికల్ కోర్సులపైపు మళ్ళలేదని చెప్పొచ్చు. తర్వాత వైద్య విద్య నభ్యశించటానికి చొరవ చూపేవారు.

అప్పట్లో కొద్దిపాటి విద్యతోనే పత్రికలు, స్త్రీ విద్యాసదనాలు స్థాపించారు విద్వన్మణులు. బాలాంత్రపు శేషమ్మ 'హిందూ సుందరిని' వింజమూరి రత్నమ్మ 'అనసూయను' పులగుర్తి లక్ష్మీనరసమ్మ 'సావిత్రిని' కేసరిగారు 'గృహలక్ష్మి' మొదలగు పత్రికలు స్థాపించారు. 12 సం॥ల దుర్గాబాయమ్మ కాకినాడలో హిందీ పాఠశాల, బాపట్లలో చోరగుడి శాంతమ్మ, నెల్లూరులో పాకాల కనకమ్మ కస్తూర్బా స్కూల్ని పెట్టారు. రాజ మండ్రిలో పెద్దాడ కామేశ్వరీ శిశువిహార్, మవ్వూరి సుబ్బమ్మ సనాతన విద్యాలయం, ఏలూరులో కలగవ పిచ్చమ్మ అన్నపూర్ణ జాతీయ పాఠశాల పెట్టి నిర్వహించారు. తర్వాత విజయనగరం రాజా, చల్లపల్లి రాజా, పిఠాపురం రాజాలు కొంత శ్రద్ధ వహించి సాయంచేశారు. జూలూరి తులశమ్మ కవయిత్రులతో కవితా గోష్ఠి జరిపింది. విశాఖపట్నంలో ఎ. వి. నరసింహారావు భార్య బాలికల పాఠశాల, వివాహిత స్త్రీలకు ప్రత్యేక పాఠ శాల పెట్టారు. 1919 లో కవిరాజు త్రిపురనేని రామస్వామి అంగలూరులో స్త్రీ పాథమిక పాఠశాల స్థాపించారు.

సమాజంలో విద్యాధికులవల్ల స్త్రీ విద్య ప్రచారం పెరిగింది. బందరులో నోబుల్ కాలేజీ. విశాఖపట్నంలో ఎ. వి. ఎన్. కాలేజి రాజమండ్రిలో ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల స్థాపించారు. ఇందులో వితంతు స్త్రీలు ఎక్కువ చదివారు. క్రమ క్రమంగా స్త్రీలకు హైస్కూళ్ళు, కాలేజీలు వెలిశాయి. 1916 లో గణిత శాస్త్రజ్ఞుడైన డా॥ కార్వే శ్రమ ఫలితంగా పూనాలో మహిళా విశ్వవిద్యాలయం నెలకొల్ప బడింది. స్త్రీల విద్య గురించి కొన్ని కమిటీలు వేశారు. బి. సి. సేన్ కమిటీ చాలా ముఖ్యమైనది. ఇది 8 ఏళ్ల వయసు వరకు నిర్బంధ విద్యా ప్రణాళికను సూచించింది. అలాగే కొటారి కమీషన్, రాధాకృష్ణ కమీషన్ స్త్రీల విద్యపై ఉత్తమ సలహాలిచ్చాయి. ఇలా స్త్రీ విద్య చాలా కష్టాలను దాటి పురోగమించినా, దేశంలో స్త్రీల అక్షరాస్యత 20%. మన రాష్ట్రంలో 17% ఉంది. ప్రయిమరీ స్కూళ్ళలో 8. 40%, మిడిల్ స్కూళ్ళలో 3. 16%, సెకండరీ విద్య 9%, డిగ్రీలలో 1.% వున్నారు.

నేటి విద్యా విధానంలో మార్పు రావాలి. స్త్రీలలో వృత్తి విద్యల స్థాయి పెరగాలి. సామాజికావసరాలైన నీతి, ధీశక్తి, విచక్షణాజ్ఞానం, చొరవ, తెలివి తేటలతో పాటు విజ్ఞానం శాస్త్రీయ దృష్టి పెంపొందించాలి. 'విద్' అను ధాతువు నుండి విద్యయను పదమేర్పడింది. అంటే మానవాంతర్గత శక్తులను వెలికితీసి. సంస్కరించి మనిషిని మనిషిగా మార్చేదే విద్య. అదే విద్యయొక్క పరమాశయం.

మన దేశంలో 100 కి 80 మంది ప్రజానీకం గ్రామాలలో నివాసముంటున్నది. పట్టణాలలోవున్న సౌకర్యాలు పల్లె ప్రజలకు లేవు. స్త్రీ విద్యను ప్రోత్సహించే వాతావరణం అచ్చట లేదు. అలాంటి పరిస్థితులలో గ్రామీణ స్త్రీలలో విద్యాభివృద్ధి జరగాలని కోరడం పొరపాటు కాదుకదా ! దానికి అవసరమైన ప్రణాళికలను ప్రభుత్వం రూపొందించాలి. అందుకు అనువైన ప్రజాభిప్రాయాన్ని ప్రజా సంఘాలు కూడగట్టాలి,

వయోజన విద్య సందర్భంగాను, బాలికలకు విద్య విషయంగాను ఇటీవల కొంత కృషి జరిగిన మాట వాస్తవమే. కాని తగినంతగా లేదు. పాఠశాలలో చేరి చివరవరకు విద్య కొనసాగింపక మధ్యలో చదువు ఆపివేసే బాలికలు ఎందరో వున్నారు. వయోజన విద్యా ప్రణాళికలు గ్రామీణ

కోసం ఆ పిండాన్ని త్రుంచి పాప పంకిలంలో పడేసే సైచ్యానికి నేనాడి కట్టను" ఇక ఆమె ధోరణి వినలేక పొయ్యా. ఇలాంటి ఉదాహరణలు కోకొల్లలుగా వున్నై మన సమాజంలో. శాస్త్రజ్ఞానం కలిగి ఉన్నత విద్యా వంతులైన స్త్రీలు కూడా ఇలా మూఢాచారాలలో పడి గిలగిల్లాడుతుంటే ఇక అవిద్య-అజ్ఞానాలతో కొట్టు మిట్టాడుతున్న సామాన్యుల స్థితి వర్ణనాతీతంకదా.

భారత నారీ సంస్కృతి ఆవిర్భవించిన నాటినుండి భారత స్త్రీ మూఢాచారాలకీ, అంధ విశ్వాసాలకీ అంకితమై పోయిందనేది నగ్నసత్యం. ప్రతిస్వల్ప విషయానికీ వర్జ్యాలు, వారాలు చూడటం, పంచాంగం పఠించటం, శకునాలు పరికించడంలో స్త్రీలకు ప్రముఖ స్థానముంది.

ఈ మూఢాచారాల ఆచరణలో పురుషులకంటే స్త్రీల పాత్ర మిన్న. ఎంతగా అజ్ఞానం మనలో పెరుగుతుందనేదానికి తార్కాణం తిరుపతి కొండ ఆదాయమే. దానికి ఆదాయం రోజు రోజుకీ ఎంత హెచ్చుతుందో మనలో అంత మౌఢ్యం పెరుగు తోందన్నమాట. ఇలా ఒక్క మన రాష్ట్రంలోనే 17 వేల దేవాలయాలున్నై. సావిత్రి గౌరివ్రతం చేస్తే చనిపోయిన మగడు బ్రతికి వస్తాడనీ, వరలక్ష్మి పూజ చేస్తే ధనలక్ష్మి గలగల గజ్జలతో మనింటిలో తిరుగుతుందనీ, అశ్వద్ధ ప్రదక్షిణాలు చేస్తే, నాగ ప్రతిష్ట చేస్తే సంతాన ప్రాప్తి కలుగుతుందనీ, ఉదయాన్నే విధవను, గొడ్రాలును చూడరాదనీ తుమ్ము అపశకునమనీ, రకరకాల కులా చారాలు, మతాచారాలు ప్రాంతీయ సంప్రదాయాలు కోకొల్లలుగా వున్నై మన దేశంలో. అలాగే ప్రపంచ మంతా మత పిచ్చి విలయ తాండవం చేస్తోంది. వాడ వాడలా చర్చీలు, మసీదులు లెక్కకు మిక్కుటంగా వున్నై.

అనారోగ్యాల అన్నింటికీ అమ్మవారి ఆగ్రహమే కారణంగా నిర్ణయించడం, మడి ఆచారం పేరుతో మానవత్వాన్నే మంట గలపటంలో స్త్రీలు అద్వితీయులు. ఇది విద్యా విహీనులకే పరిమితం కాదు. విద్యాధికులలో కూడా సంప్రదాయ భావాలు, కులమతాభిమానాలు విలయ తాండవం చేస్తున్నై. ధనవంతుల పూజలు, వ్రతాలు, ముడుపులు హెచ్చుగా వుంటై. సామాన్యులయితే వారి వారి స్థాయిని బట్టి వుంటై. గర్భస్థ శిశువునుండి

ఎదుర్కొనే శక్తిని సంపాయించటమే మన జీవిత ధ్యేయం కాదు. కష్టాలను పారద్రోలే శాస్త్రీయ దృక్పథం యొక్క అవగాహన మనకీనాడు చాలా అవసరం. అసలీ బాధలకు కారణ మేమిటనే జిజ్ఞాస మనలో కలగాలి. తర్కించుకోవాలి, ఆలోచించాలి, అర్థం చేసుకోవాలి. అవగాహన కలగాలి, గుడ్డినమ్మకాలను కూకటి వేళ్ళతో కూలద్రోయాలంటే మనం హేతు వాదులం కాక తప్పదు. ఒక ఆచారాన్ని మనం అనుసరిస్తున్నపుడు స్త్రీల దృక్పథం కూడా మన దృష్టిలో ఉండాలి. అంతేకాని మా తాత ముత్తాతలు ఆచరించారని గానీ, ప్రవక్తలు ప్రబోధించారని గానీ, మనం ఆచరించటం అవివేకం. అరచేతిలో వైకుంఠం చూపించే మంత్రాలు, నామాలు. మహిమలు, అతీత శక్తులను శాస్త్రీయ దృక్పథంతో హేతువాదమనే ఇనుప గొడ్డళ్ళతో నరికి పారెయ్యాలి. మానవ స్వేచ్ఛకు, పురోగమనానికి అడ్డమైన భావ వాదానికి సమాధి కట్టాలి. తర్కానికీ, అనుభవానికీ నిలువని ఏ సిద్ధాంతాన్నీ నమ్మరాదు. ప్రతిదాన్నీ ప్రశ్నించు, ఆలోచించు, ఆచరించు అనే సూత్రానికే విలువ నివ్వాలి. మన వ్యక్తిత్వాన్ని మనమే తీర్చి దిద్దుకోవాలి. మనలను శాశించే శాసన కర్త లేదని తెలుసుకోవాలి. దానికి భావ విప్లవమే మార్గం. హేతువాదమే శరణ్యం.

స్త్రీ జనాభ్యుదయం లేని సమాజ ప్రగతి ఎండ మావుల వంటిది. సగ భాగమైన స్త్రీలు మూఢ విశ్వాసాల మురికి కూపాలలో మునిగి, వున్నారు. వారి మౌఢ్యం వల్ల వారేగాక, ప్రగతి కాముకులైన భర్తలను కూడా దిగజార్చే ప్రమాదముంది. బిడ్డల మస్తిష్కాలలో ఆస్తిక బీజాలు నాటే ఘోర ప్రమాదముంది. కనుక స్త్రీలు ముఖ్యంగా వివేక వంతులు కావాలి. కానిచో దేశాభ్యుదయం, కుటుంబ సంక్షేమం కుంటు పడతై. స్త్రీలు దురాచారాల, అర్థరహిత సంప్రదాయాల విషవలయం నుండి బయట పడ్డనాడు నిజమైన, స్వేచ్ఛకు బాటలు నిర్మించుకో గలుగుతాం. దానికై అందరం పాటు పడదాం.

('హేతువాదం' మాసపత్రిక మే 1981.)

దోసిట్లో పోసి లెక్కచెప్పాలి. బస్సు చార్జీలకు, చిల్లర ఖర్చులకు అతనే లెక్క ప్రకారం ఆమెకివ్వాలి. ఆఖర్చు దాటిపోయ్యే హక్కు ఆమెకు లేదు. అసలు బ్యాంకు అకౌంట్లువున్న స్త్రీలు అత్యల్పంగా వుంటారు. ఆమెపేర ఇల్లు వుండదు; ఇంట్లో భాగం వుండదు. తగాదావచ్చి విడిపడితే ఆమెకు దమ్మిడీవుండదు. 1949 నుండి చైనాలో **Marriage Act** ప్రకారం ఇద్దరూ సంపాదించిన ఆస్తి ఇద్దరికీ చెందాలనే తీర్పులున్నాయి. కనుక ఆస్తిలో, ఆదాయంలో పురుషునికే హక్కులన్నీ వున్నాయని నిరూపించటం అంత కష్టంకాదు.

ఇక స్త్రీ ఉనికి గురించి చెప్పాలంటే భర్తకు ఏనాడు కోపమొస్తే ఆనాడు పోవాలి. భర్త విడాకులు లేకుండా మరో స్త్రీని భార్య అని చెప్పు కోవచ్చు. భార్యవేరే పురుషునితో వుంటే 497వ సెక్షన్ ఇండియన్ పీనల్‌కోడ్ ప్రకారం అయిదు సంవత్సరాలు అతనికి శిక్ష. అంటే భార్య భర్త సొత్తు అన్నమాట. అది వేరొకరు దొంగిలించరాదు అనేది ఈ చట్టం యొక్క భావం. ఇంకా ఈ చట్టం అమల్లో వుండటం హాస్యాస్పదం అసమానత్వానికి నిదర్శనం.

స్త్రీ ఉద్యోగం చెయ్యాలంటే భర్త అనుమతితో అతను చెయ్యమంటేనే చెయ్యాలి, వొద్దంటే మానాలి, అనే విధంగా కోర్టు తీర్పులు కూడా వున్నాయి. తనకన్నా హోదా, ఆదాయం వున్నవారిని ఉద్యోగం మార్పి స్తారు భర్తలు. అది సుపీరియారిటీ కాంప్లెక్సుగా భర్త భావించి సహించ లేక తల్లడిల్లి పోతాడు. భార్యకు వేరే ఊళ్ళో ఉద్యోగమయితే మాన్పించిన కేసులెన్నో వున్నాయి కాని భర్త వుద్యోగం మాని ఆమె వున్న ఊళ్ళో అతను వున్న సందర్భాలు లేవనే చెప్పవచ్చు. కనుక స్త్రీ తన ఉద్యోగ స్థాయిని కూడా రక్షించుకోలేని స్థితిలోవుంది.

భార్య విడాకులు ఇవ్వకపోయినా మరో స్త్రీని భార్య అని చెప్తాడు భర్త. స్త్రీ అదేపని చేస్తే, సమాజం వేలెత్తి చూపుతుంది! అలాగే వ్యభిచారంజరిగినప్పుడు అది 'చెడింది' అని గర్హించిన సమాజం, వాడికేంలే మగాడు అంటూ ద్వంద్వ నీతిని ప్రకటిస్తుంది.

దాంపత్య జీవితంలో స్త్రీకి ఏ స్వేచ్ఛా లేదు. అతని కోర్కె ప్రకారమే పిల్లల్ని కనాలి. మగబిడ్డ పుట్టేదాకా కంటూనే వుండాలి. భర్త ఆజ్ఞలేనిదే 'బర్తుకంట్రోల్' ఆపరేషన్ చెయ్యరు; భార్యకు చేయించుకొనే ధైర్యం లేదు. అలాగే గర్భస్రావం కూడా జరగాలి. అంటే ఆమె శరీరంపై కూడా ఆమెకు హక్కు లేదన్న మాట. కనుక 'భార్య' అంటే భర్తకు భోగ్య వస్తువుగా చూడబడుతోందనే దానికి చాలా నిదర్శనాలున్నాయి.

తన సంతానంపై అధిపత్యం పురుషునిదే. పురుషుడే గార్డియన్. ఓటర్ల లిష్టులో తండ్రి పేరు వ్రాయాలి పురుషుడికి. భర్త పేరుండాలి భార్యకు.

ఇస్లాంలో భర్త లేకున్నా, భార్య తన బిడ్డకు గార్డియన్‌గా వుండ రాదు. తాతో మరొకరో వుండవచ్చు. ఇస్లాం మతంలో భార్య ఇష్టానికి వ్యతి రేకంగా మరొక స్త్రీని భార్యగా స్వీకరించి ఆమెకున్న స్థానాన్ని అతను మరొకరికి పంచిఇస్తే చట్ట ప్రకారంకూడా వ్యతిరేకించే అవకాశంలేదు. 'తలాల్' అని మూడుసార్లు అంటేచాలు. మూడు నెలల భరణం పారేసి భార్యకు విడాకులిచ్చి తన్ని తగలెయ్యవచ్చు. ఇంకా ఏకకాలంలో నలుగురు భార్యలను కలిగివుండే హక్కు పురుషునికి ఇస్లాం ప్రసాదించింది. ఇదంతా స్త్రీకి రక్షణలేని నిదర్శనమే కదా!

స్త్రీకి శారీరక రక్షణ లేదనేది నగ్నసత్యం. తన భార్యను కొట్టవచ్చు, తిట్టవచ్చు, మెడపట్టి గెంటవచ్చంటుంది సంప్రదాయం. పెండ్లిలోనే నీకు విధేయురాలనై వుంటానని వధువుచే ప్రమాణం చేయిస్తారు. తదాది ఎన్ని హింసలపాలైనా భరించటమే భారతనారీ పతివ్రతా లక్షణమని సూత్రీ కరించారు కదా! భర్త కొట్టాడు అని కోర్టు కెళ్ళినా ఆమెకు న్యాయం జరగదు. శాసనాలన్నీ పురుష నిర్మితాలేకదా! దుర్మార్గమైన ఘాత చేస్తే తప్ప, శాసనరీత్యా భర్తకు శిక్షలేదు. కోర్టు దృష్టిలో ఘాత అంటే చంపటమే. చంపినా రుజువు అసలే కాదు.

# పాశ్చాత్య ప్రపంచం - నాస్తికత్వం

పాశ్చాత్య ప్రపంచం పర్యటించి వచ్చిన వారిని మానవునిపై మత ప్రభావస్థాయి ఆ దేశాల్లో ఎలా వుందండీ? అని ప్రశ్నించినపుడు అనేక అంశాలపై విచారించి జవాబివ్వాల్సొస్తుంది. తూర్పు దేశాలు భావ వాదానికి స్థానాలైతే, పశ్చిమ దేశాలు భౌతిక వాదానికి జీవగర్జలనే భావం కలవారు కోకొల్లలు. కాని విదేశాల్లో సైతం ఆధ్యాత్మిక చింతన, మత ప్రభావం 99% పైగా వుందనేది నగ్నసత్యం.

లండన్‌లో జరిగిన ప్రపంచ హ్యూమనిస్టుల మహా సభలో మతం గురించి, మతస్తుల విషయం 2 సార్లు ప్రస్తావన కొచ్చింది. హేతువ్యతిరిక్త ధోరణలను గురించి మహాసభలో ఒక వర్గంవారు నాల్గు సమావేశాల్లో చర్చించారు. మత ప్రచారం. మూఢ విశ్వాసాలు, నూతన పూజా విధానాలు, జ్యోతిష్యం లాంటి అవాస్తవిక విషయాలపై నమ్మకాలు; హరేకృష్ణ వుద్యమం; బాబాల బండారాలు ఆ మహాసభలో చర్చనీయాంశాలు. మతస్తుల పైఖరిని నిరశించడం మహాసభ ఆమోదించిన రెండవ తీర్మానంలో ప్రస్ఫుటంగా కనపడుతుంది. మానవ శరీరానికి వెలుపల టెస్టుట్యూబులో పిండోత్పత్తి చేయించుట అవినీతికి మార్గమనే మతవాదుల వాదనను మహాసభ ఖండించి శాస్త్రీయ దృక్పథానికి బాటలు వేసింది. స్త్రీలకు పరిపూర్ణ స్వేచ్ఛ, సమానత్వాలు లేని దేశాలు ప్రగతి పథంలో మన జాలవని మానవ దృక్పథాన్ని వెల్లడించింది మరో తీర్మానంలో.

విదేశాల్లో చర్చికెళ్ళే వారి సంఖ్య 30% మాత్రమే. అంతకన్నా మన దేశంలో ప్రతిరోజు, పర్వదినాల్లో దేవాలయాలకెళ్ళే వారి సంఖ్య హెచ్చు. మనకున్నన్ని పూజలు, నోములు, వ్రతాలు, యజ్ఞాలు, జాతరలు మూఢా చారాలు వారిలో మృగ్యమన వచ్చు. అంతమాత్రాన ఆ దేశాల్లో నాస్తి కత్వం ప్రబల మనుకొనుట పొరపాటు. ప్రతి చిన్న గ్రామానికి రెండు (శివాలయం, విష్ణాలయం) దేవాలయాలు మనకున్నట్లే యూరప్‌లో వాడ వాడలా చర్చిలు గోచర మవుతై. కొన్ని చోట్ల నోట్ల వ్యయంతో, కన్నులు మిరుమిట్లు గొలిపే ఆకృతులతో సెంట్‌పీటర్, సెయింట్ నాటర్

డామ్ చర్చిలున్నై. అవి రాజ మహలులకన్నా అద్భుతంగా మిరిమిట్లు గొలుపుతూవున్నై. ఆర్థిక స్తోమతనుబట్టి చర్చిలుంటై. వారు మత ప్రచారానికి కోట్లలో ఖర్చు పెడతారు. చందాలు భారీఎత్తున ఇస్తారు. ఆదివారాల్లో చర్చిల్లో ఉచిత భోజనం ఇస్తారు. బైబిలు గ్రంథాలు హోటళ్ళలోసైతం పెడతారు. వారి మతానికి ముఖ్య ఘట్టాలు మూడు: బాప్టిజం, వివాహం, అంత్య క్రియలు. బాప్టిజంలో శుద్ధిస్నానం విధిగా జరగాలి. బిడ్డకు ఇది మొదట్లో జరగనిచో వివాహానికి ముందుగానైనా (హిందువులలో ఉపనయనం మాదిరి) జరిపిస్తారు. వారి వివాహ విధి తప్పని సరిగా మత గురువే చర్చిలో జరపాలి. చర్చిలో పూడ్చిపెట్టుట మత గురువు ఉపన్యాసం ద్వారానే అంత్యక్రియలు జరగాలి. లండన్‌లో హాస్పటల్‌లో చనిపోయిన వృద్ధులకు ప్రభుత్వ ఖర్చుతో లాంచనాలతో బారీఎత్తున అంత్యక్రియలు జరుగుతై. మతానికి నాంది ఈ మూడున్నూ. ఇవి వారు విధిగా పాటిస్తారు.

మత ప్రచారానికి ధనం బాగా పనిచేస్తుంది. మన దేవాలయాలకు ఆస్తులు, భూమి వున్నా వాటి ఆదాయం ఖర్చులకే పరిమితం. చర్చిల ఆస్తులను వారు పరిశ్రమల్లో పెట్టుబడిపెట్టి రాబడి పెంచుతారు. కంపెనీల్లో షేర్లు కొంటారు. ధనాన్ని రెట్టింపుచేసి ఈ సొమ్మును మతాభివృద్ధి ప్రచారానికి ఖర్చు చేస్తారు. మన అర్చకుల కన్నా వారి యాజకులకు, భిషప్పులకు జీతాలు హెచ్చు. వారు సర్వ సౌఖ్యాలతో జీవిస్తారు. కొన్ని దేశాల్లో ప్రభుత్వమే మతాన్ని పోషిస్తుంది. బ్రిటన్‌లో ప్రభుత్వంచే గుర్తించ బడిన యాంగ్లికన్ చర్చిలకు ప్రభుత్వపు గ్రాంట్లున్నై. చర్చిలు నడిపే స్కూళ్ళకు ప్రభుత్వం గ్రాంటున్న ఇస్తుంది. అమెరికాలో చర్చిలకు గ్రాంట్లు ఇవ్వక పోయినా మత సంఘాలు నడిపే వైద్యశాలలకు, విద్యాలయాలకు గ్రాంట్లు, ఉచిత భూవసతి ప్రభుత్వం ఇస్తుంది. దీనిని బట్టి ఆ దేశాల్లో చర్చి బలవత్తరమైన ఆర్థిక శక్తిగా తయారయింది.

పాశ్చాత్య దేశాలలో సైన్సు అభివృద్ధి చెందినంతగా సైన్‌టిఫిక్ దృక్పథం పెరగలేదనేది నగ్న సత్యం. చంద్రునిపై కాలూనినా, కృత్రిమ లేబరేటరీలో 'జాన్'ను సృష్టించినా, మరెన్నో రకాల క్రొత్త విషయాలు క్రొంగొత్త సిద్ధాంతాలు అమల్లో కొచ్చినా మత పిచ్చివారిలో పోలేదు.

# స్త్రీలపై అత్యాచారాలు

ఇది మహిళా దశాబ్దమా ? మూకుమ్మడి మానభంగాల సంవత్సరమా ? అనే ఆందోళనతో స్త్రీజాతి తల్లడిల్లి పోతోంది. ఈనాడు మానభంగాల సమస్య చాలా విషమస్థితి కొచ్చింది. దాదాపు రోజూ ఏ మూలో మూల ఏ స్త్రీనో చెరచటం సర్వసామాన్య మయింది. ఈ దుస్సంఘటన గురించి చెప్పుకోలేక, తలెత్తుకుని తిరగలేక, సమాజంలో గౌరవంగా బ్రతకలేక ఆత్మాహుతి పాలౌతున్నారనేక మంది అభాగినులు. ఈ దేశంలో సాలుకు 20 లక్షలు ఇలాంటి కేసులున్నాయని మేరీ స్టోప్స్ సంఘంవారి అంచనా. ఇక బైటికి రానివి, చెప్పుకోలేనివి కోకోల్లలు. ఎక్కడ అలజడి జరిగినా స్త్రీల మాన ప్రాణాలు బలికావటం మామూలయింది. ముఖ్యంగా బీద స్త్రీలు ఈ దౌష్ట్యాలకు గురి అవుతున్నారు. ఈ మూగ జీవాలు ఇలా దుష్టశక్తుల కామదాహానికి, క్రోధక్రౌర్యాలకు, పైశాచిక ప్రవృత్తికి ఆహుతి కావాల్సిందేనా ? ఇది నాగరిక ప్రపంచమేనా ? ఈ దారుణాలకు కారకులెవరు ? వ్యక్తులా, పోలీసులా ? ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరా ? అనేవే నేటి చర్చనియాంశాలు.

మానభంగాలు పూర్వంలేవా ? ఉన్నా ప్రజల దృష్టి కొచ్చేవికావా ? అంటే, ఈ నేరాలు నాడూ వున్నై. నేడింకా పెరుగుతున్నై. కాని, కుటుంబ గౌరవాని కని, వ్యక్తి పేరు ప్రతిష్టలకు మాయని మచ్చఅని పూర్వం దిగమింగే వారు. 10 నేరాలు జరిగితే ఒకటో రెండో బైటి కొచ్చేవి. ఈనాడు ప్రజల్లో చైతన్యం వచ్చింది కనుక అన్యాయం జరిగిందని బహిరంగంగా చెప్పుకుంటున్నారు. వార్తా పత్రికలు నిర్భయంగా ప్రచురిస్తున్నై. అందు వల్ల సంఖ్య పెరిగినట్లు అనిపిస్తోంది.

పురుషుణ్ణి ఉద్రేకపరిచే వస్త్రధారణ వల్లనే ఇవి జరుగుతున్నాయనే వాదన సరియైనది కాదు. స్త్రీ పురుషుడి ఆస్తి కనుక అతని స్త్రీలమీద-అంటే భార్య, చెల్లి, తల్లిపై అత్యాచారాలు చేసి శత్రువులు పగ తీర్చు కొంటారు. వారిని దుర్భాషలాడతారు. మానసిక జాడ్యం వల్ల పరాయి స్త్రీని చెరుస్తారు.

కల్గించి ఆమె స్టేటుమెంటు సరిగా నమోదు చేయించి, వైద్య పరీక్ష చేయించి, నేరం గురించి దర్యాప్తు సాగించి, కేసు పెడితే నేరం రుజువవుతుంది. డాక్టరు వెంటనే సర్టిఫికెట్ ఇస్తే అతడెవరి వత్తిడికి, ప్రలోభానికి లొంగిపోయ్యే అవకాశముండదు. ఈ విషయాల్లో శ్రద్ధవహించక శిక్షలు పెంచితే ప్రయోజనముంటుందా? పైగా ప్రజల ఫిర్యాదును విచారించి రక్షించాల్సిన పోలీసులు కొంతమంది కొన్ని పోలీసు స్టేషన్లలో ఇలాంటి దౌర్జన్యాలకు తలపడుతున్నారని వార్తలొస్తుంటే ప్రజలకు పోలీసులపై విశ్వాసం సడలిపోతుంది. ఈ పరిస్థితిని మెరుగు పర్చటానికి తగిన వాతావరణాన్ని సృష్టించటం ముమ్మందుగా జరగాల్సినపని. సరైన శిక్షణ పోలీసులకిస్తే అలాంటి పరిస్థితిని తేగలం. అసలు పోలీసు దళంలోకి చేర్చుకొనేటప్పుడే జాగ్రత్తగా పరిశీలించి మంచి వ్యక్తుల్ని ఎంపిక చెయ్యాలి. ప్రజలను గౌరవించే విధంగా పోలీసులకు సరియయిన శిక్షణ ఇవ్వాలి. నిందితుల కుటుంబ స్త్రీలను అవమానించే పద్ధతి పోవాలి.

దోషి పోలీసు బలగంలో వాడైనంత మాత్రాన పై అధికారులు అతన్ని ప్రత్యక్షంగాగాని, పరోక్షంగా గాని బలపర్చరాదు. ఇలాంటి కేసుల్లో ఫిర్యాదు రాగానే బీవా గొప్పా తేడా లేకుండా దరాప్తుకు పూనుకోవాలి. ఏ వర్గం వారు ఆ వర్గం వారిని సమర్థించుకోవటంలో తప్పులేదు. కాని ఐకమత్యం పేరుతో, పోలీసు వర్గ ప్రతిష్ట నిలబెట్టాలనే ఆదుర్దాతో పై అధికార్లు దోషులను రక్షించ బూనుకుంటే ప్రజలకు పోలీసులపై గౌరవంపోయి ద్వేషం కల్గవచ్చు. కనుక నేరాల దర్యాప్తులో, నిజాయితీతో నిష్పక్షపాతంగా పోలీసులు వ్యవహరిస్తే వారికి ప్రజా మద్దతు పూర్తిగా లభించుటే కాక అవినీతి, అక్రమం, దౌర్జన్యం నశిస్తయ్యి.

ఆడవాళ్ళపై అఘాయిత్యాల పరిష్కార మార్గాన్వేషణ చేద్దాం. దీనికి అనేక రంగాలలో అనేక ప్రయత్నాలు విధిగా జరగాలి. మహిళా సంఘాలలో జాగృతి, స్త్రీలలో ఆత్మ విశ్వాసం, ఆత్మరక్షణకు అనువైన ధైర్యం, స్థయిర్యం స్త్రీలకు కావాలి. కరాటే లాంటి విద్యలు యువతులు విధిగా నేర్చుకోవాలి. ఆమె పరిస్థితి నర్థంచేసుకొని సానుభూతితో మాట్లాడే కార్యకర్తలుంటేనే ఆమె ఆ 'షాక్' నుండి తెప్పరిల్లుతుంది. చెరచబడ్డ స్త్రీని పతితగా

శీలం పోగొట్టుకున్నట్లుగా స్త్రీ సమాజం చిన్న చూపు చూస్తోంది. తోటి స్త్రీ యెడల సానుభూతి చూపకపోగా గుసగుసలాడుట అవివేకం, అజ్ఞానం. ముఖ్యంగా స్త్రీలలో ఐక్యత లోపించుటొక దౌర్భాగ్యం. ఈ దుర్మార్గం వల్ల ఆమెకొచ్చిన మానసిక లైంగిక సమస్యలను పరిష్కరించటానికి ప్రత్యేక వైద్యాలయాలు నెలకొల్పాలి. ఆమె ఫిర్యాదును స్త్రీ పోలీసులే విచారించాలి. సర్వవేళలా వారిని ఆదుకోవటానికి, ఆదరించటానికి సంక్షేమ కార్యాలయాలుండాలి. అమెరికాలో ఇలాంటి వారికి సక్రమమైన వైద్య, న్యాయ సలహాలను అందివ్వటానికి సమాజాలేర్పడినై. వాటి నాదర్శంగా తీసుకొని లండన్‌లో ఇలాంటి కేంద్ర మొకటి 1976లో నెలకొల్పి 24 గంటలూ పని చేస్తున్నారు. అలాగే ఇండియాలో కూడా కేంద్రాలు నెలకొల్పబడాలి. స్త్రీలను పోలీసు స్టేషన్లలో ఉంచరాదు. వెంటనే జైలుకు తీసుకెళ్ళాలి. రాత్రులు స్త్రీలను అరెస్టు చేయుట తగ్గించాలి. బాధితులకు ఉచిత న్యాయ సహాయం అందివ్వాలి. బహిరంగంగా కోర్టులో ఈ కేసులు విచారణ చెయ్యరాదు. చెరచబడ్డ స్త్రీ పేరు పేపర్లలో లేకుండా సంఘటన వ్రాయాలి. స్త్రీ వస్తువనే భావం, ఆస్తి అనే భావం పోనంత కాలం ఇలాంటి అత్యాచారాలు వుంటూనే వుంటై. ఆమెను గౌరవించటం నేర్చుకోవాలి. ముఖ్యమైన విషయం ఏమంటే నేరస్థుణ్ణి సమాజం, చివరకు తన కుటుంబం కూడా వెలి వేస్తుందనే భయం అతనికి కల్గించాలి. ఒక స్త్రీపై అత్యాచారం జరిగితే ఆ ప్రాంతంలోని స్త్రీలంతా చైతన్యవంతులై ఆ నేరస్థుణ్ణి పట్టి బంధించి అతని చర్యను నిరసించి అవమానపరుస్తారనే భయంతో వుంచాలి. ఈ చైతన్యం స్త్రీలలో కల్గడానికి తమకు తామే పూనిక వహించాలి. అభ్యుదయాన్ని కాంక్షించే స్త్రీ పురుషులు, శాసనకర్తలు, సంఘ సేవకులు, మహిళా సంఘాలు, యువజన సంఘాలు వీరి సమిష్టి కృషి ద్వారానే ఈ అత్యాచారాన్ని అరికట్ట గలం. రౌడీలను, గూండాలను, దోషులను సాంఘిక బహిష్కరణ చెయ్యాలి. సోదర స్త్రీల శ్రేయస్సుకై మహిళాలోకం ఐక్య కంఠంతో ఈ విప్లవ సాధనలో భాగస్వామ్యం వహించాలి. స్త్రీ విముక్తిని కాంక్షించే పురుషులు సైతం ఈ ప్రయత్నాన్ని బలపరచాలి. అంతే కాని చట్టాల వల్ల మాత్రమే ఈ

అవినీతి సమసి పోదు. చట్టాలకూ మానవ ప్రవృత్తికీ అవినాభావ సంబంధ ముండాలి. శిక్షలను పెంచమని, అమలు పర్చమని 'డిమాండు' చేయుటతోనే తృప్తిపడే దానికంటే అత్యాచారాల నెదుర్కొనుటకై సంస్కారమున్న సర్వజనులనూ, సర్వశక్తులనూ సమీకరించి, ఎలుగెత్తి అరచిన నాడు, కార్యోన్ముఖులైన నాడు ఈ దురాచారం సమసిపోతుంది.

(దూరదర్శిని, హైదరాబాదు, జనవరి 1981)

# వివాహ వయః పరిమితి

యువతీ యువకుల వివాహవయః పరిమితి గురించి రకరకాల అభిప్రాయాలున్నై. వీనిపై సభలు, సమావేశాలు, చర్చలు, సెమినార్లు, వాదోపవాదాలు జరుగుతూనే వున్నై. మతాల వారీగా వివాహ చట్టాలు వేరు వేరుగా వున్నై. అలాగే కులమతాల వారీగా వివాహ ఆచారాలు, సంప్రదాయాలు కూడా భిన్నంగా వుంటై. మేనమామకు పిల్లనిచ్చుట హిందువుల ఆచారమైతే అది ముస్లింలలో నిషేధం. అలాగే అన్నదమ్ముల పిల్లల వివాహాలు ముస్లింలలో సంప్రదాయమైతే అది హిందువులకు నిషేధం. 1929లో శారదా యాక్టు - (చైల్డు మ్యారేజి రిష్ట్రెయింట్ యాక్టు) అమల్లో కొచ్చింది అయినా "అష్టవర్షాద్భవేత్ కన్యా" అనేదే వేదమనే ఆచారం హిందువుల్లో వుంది. అక్కడకూడా బాల్య వివాహాలు, కన్యా శుల్కాలు ఇంకా జరుగుతూనే వున్నై. కాని ఒక కేసైనా బైటకొచ్చుట లేదు కదా? బాల్య వివాహ నిషేధం చట్ట రూపంలో వున్నంత మాత్రాన చాలదు. చట్టాలవల్ల ప్రయోజనముందా? అంటే కొంత వరకు మాత్రమే. వాటి నమలు పర్చేందుకు ప్రజాభిప్రాయం ముఖ్యం. అందుకే చట్టాలకన్నా, సైన్సు కన్నా, ఆచారాల ప్రాబల్యమే మెండుగా వుంటుంది. కనుకనే ముందుగా మానవ మనః ప్రవృత్తి మారాలని ఆధునికులు ఆందోళన చేస్తున్నారు. ముస్లింలలో శాసన పరంగా బాల్య వివాహం చెల్లుతుంది. ఆపిల్ల మెచ్యూరైై ఈ భర్త నాకొద్దనే హక్కు మాత్రం వుంది. కాని అలా జరిగేవి దాదాపు శూన్యమనవచ్చు. అందుకే శాసనాలు ఆచారాలకు చుక్కెదురుగా వుంటై.

లేదనేది నగ్నసత్యం. 1956 లో హిందూ మ్యారేజి యాక్టువల్ల వివాహ వయస్సు 18 - 21 దాకా పెరిగింది. స్పెషల్ మ్యారేజి యాక్టు వల్ల కుల మతాల మధ్య, దేశ దేశాల మధ్య వివాహాలకు గుర్తింపు వచ్చింది. ఇది చాలా పురోగమన మనొచ్చు. శాసనాలవల్ల ప్రయోజనముందా ? అని వితర్కిస్తే లాభంలేదు. వరకట్నాలు ఇస్తున్నారు, బాల్య వివాహాలు చేస్తున్నారు. ఆపగలమా ! అవి శాసనాన్ని నిందించి ప్రయోజనం లేదు. శాసనం వల్ల శిక్ష, జరిమానా పడుతుందని భయపడయినా ప్రజలల్లో కొంత మార్పు రావచ్చు. తర్వాత భయంతోనైనా జంకి అమలు పరుస్తారు కొందరు. కనుకనే చట్టాలనమలు పర్చేందుకు ప్రజాభిప్రాయం ముఖ్యం. చట్టాన్ని గౌరవించటానికి తగిన విద్యావివేకాలు, విషయ పరిజ్ఞానం ప్రజలకు వుందా అనేది శేష ప్రశ్న !

వివాహ వయస్సు పెంచడం వల్ల చాలా లాభాలునైన్న అనేది నగ్న సత్యం. శారీరకంగా, మానసికంగా, కుటుంబ పరంగా, కుటుంబ నియంత్రణకు, స్త్రీ హోదా విషయంగా, విద్యా ఉద్యోగాల విషయంగా ఇలా ఎన్నో విధాల ఉపయోగమనే విషయం మనకు తెలియనిదికాదు. సగ భాగమున్న స్త్రీల పరంగా ముమ్ముందుగా ఆలోచిద్దాం.

## శారీరకంగా

ఆలోచిస్తే, ఆమె బాగా పెరగ గలదు. జీవిత భాగస్వామిని అర్థం చేసుకోగలదు. ఆరోగ్యం బాగా వృద్ధి పొందుతుంది. మానసిక వికాసం కల్గుతుంది. విద్య నార్జించ గలదు. ఉద్యోగం నిర్వహించి తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోగలదు.

## మానసికంగా

మెదడు వికసిస్తుంది. ఆకళింపు చేసుకోగల శక్తి పెరుగుతుంది. తేలికగా విషయాన్ని అవగాహన చేసుకొని తద్వారా యుక్తా యుక్త విచక్షణా జ్ఞానాన్ని పొందుతుంది.

## కుటుంబ పరంగా

ఆలోచిస్తే కుమార్తె కూడా తల్లి దండ్రులకు ఆర్థిక సహాయం చేయగలదు. మగ పిల్లవాడైతే మమ్మల్ని ఆదుకునే వాడని అంతా ఆడ పిల్లలేనని బాధపడతారు కన్నవారు. ఆడపిల్లలకు విధిగా ఆలస్యంగా వివాహం చేస్తే వారు హెచ్చుకాలం తల్లిదండ్రుల్ని పోషించ గల్గుతారు. జన్మనిచ్చిన వారి యెడల తమ బాధ్యతనిలా నిర్వర్తించ గలుగుతారు.

## వివాహ వయస్సు పెరిగితే కుటుంబ నియంత్రణకు

తద్వారా దేశ ప్రగతికి ఉపకరిస్తుంది. స్త్రీ 14వ సంవత్సరము నుండి 45 సంవత్సరముల వరకు సంతానోత్పత్తి గ్రంథుల వల్ల 20 మంది నైనా కనొచ్చు. 25 ఏండ్లకు వివాహ మయితే సంతానోత్పత్తి కాలంతగ్గి జనాభా పెరుగుదల నరికట్టవచ్చు. యవ్వన దశంతా కనడం, పెంచడంతోనే కాలం గడవక, సమాజ సేవకు శక్తి కూడా కల్గుతుంది.

భార్యగా పరిశీలిద్దాం. వయస్సు పెరిగిన కొద్ది వివేకం, విజ్ఞానం పెరుగుతై. భార్యగా తన విధ్యుక్త బాధ్యతలను హక్కులను, గుర్తిస్తుంది. భార్యా భర్తల జీవితం సాఫీగా సాగుతుంది. ఒకరి కొకరు తోడు నీడగా ఉంటారు. ఒకరు మరొకరికి సహచరులౌతారు. కుటుంబంలో ఆమె బానిస కాదు. సమాన ప్రతిపత్తిగల సభ్యురాలిగా వుంటుంది. కనుక బరువు బాధ్యతలు మోస్తుంది. అణగి మణగి వుండే మనస్తత్వం పోయి సహకార భావంతో హెచ్చు తగ్గులు లేని విధంగా ప్రవర్తిస్తుంది. సంసారం మూడు పువ్వులూ ఆరు కాయలుగా వుంటుంది.

## తల్లిగా

వయస్సూ, చదువూ, విజ్ఞానంకల తల్లి తన పిల్లల్ని ఆరోగ్య ప్రదంగా, పెంచుతుంది. తెలియనిది ఏ ముసలమ్మనో అడుగుతుంది. ఆమె ఒక శతాబ్దం నాటి అశాస్త్రీయ పద్ధతులను చెప్తుంది. ఆలస్యంగా వివాహమైతే తల్లి ఈ విషయాలను తెలుసుకొనే అవకాశం హెచ్చుగా వుంటుంది.

పొంద గల్గుతుంది. విద్యా, విషయ జ్ఞానం పెరుగుతై. వ్యక్తిత్వం వికశిస్తుంది. వృత్తి విద్యలలో నిపుణత సంపాదిస్తుంది. తన కాళ్ళపై తాను నిల్వ గల్గుతుంది. కుటుంబ నియంత్రణ ఇచ్ఛా పూర్వకంగా పాటించి కుటుంబానికి అధిక సంతాన భారాన్ని తగ్గించి భార్యాభర్తలు సుఖంగా మన గల్గుతారు. చిన్ననాడే వివాహమాడి జీవితమంతా దుఃఖ భాజన మయ్యేకన్నా బాధ్యతలు తెల్సుకొని ప్రపంచ జ్ఞానం పొంది వివాహ మాడుట శ్రేయస్కరం. కనుక వివాహవయః పరిమితి స్త్రీకి 22 పురుషుడికి 24 లోపల ఏ పరిస్థితిలో తగ్గరాదు. అది కుటుంబానికి, సమాజానికి దేశానికి శుభకరం.

(ఆలిండియా రేడియో, హైదరాబాద్)

# స్త్రీలు: మత పరమైన శాసనాలు

భారత దేశంలో అనేక మతాలవారు ఉన్నారు. హిందువులు ముస్లింలు, క్రైస్తవులు, పార్సీలు అందులో ముఖ్యులు. వివాహము, విడాకులు, భరణము, దత్తత సంరక్ష కత్వము, వారసత్వము మొదలగు విషయాలు పౌరునియొక్క మతంపై ఆధారపడి ఉంటున్నై. ఇతర అభ్యుదయ దేశాలలో అలాకాదు; మతాలు వేరైనా అందరు పౌరులకు ఒకే ఒక శాసనం వర్తిస్తుంది. 1857 లో సిపాయి తిరుగుబాటు సంభవించిన తరువాత బ్రిటిష్ ప్రభుత్వ వైఖరిలో మార్పు వచ్చింది. విక్టోరియా రాణి తన ప్రకటన ద్వారా మతవిషయాలలో ప్రభుత్వం జోక్యం కలుగ జేసుకొనేదిలేదని ప్రకటించారు. అంతకు క్రితము అత్యధిక సంఖ్యాకులైన హిందువుల విషయంలో కొంతగా కొంత జోక్యము ఉండేది. సతీ సహగమనాన్ని నిషేధించిన చట్టము, 1856 లో ఆమోదింపబడిన విధవా వివాహ శాసనము ఇందుకు ఉదాహరణలు. తరువాత సంస్కరణోద్యమానికి బ్రిటిష్ ప్రభుత్వంవారి మద్దతు లభించలేదు: కాగా వారు దానిని వ్యతిరేకించలేదు. బాల్య వివాహ నిరోధ శాసనము (1929) కేంద్ర శాసన సభలో ఒక సభ్యుని కృషి ఫలితమే. ఒకే గోత్రము లేక ప్రవరకు లేక ఒకే కులములో వివిధ శాఖలకు చెంది నందున వివాహం చెల్లకపోదు అనే శాసనము (1946), అట్లే అదే సంవ

త్సరములో ఆమోదింపబడిన మన వర్తి శాసనము భిన్న మతాలకు, కులాలకు, వర్ణములకు చెంది నందువల్ల హిందూ వివాహాలు చెల్ల నేరవు అనే సూత్రాన్ని వమ్ము చేసిన 1909 చట్టము, ఇవన్నీ స్వాతంత్ర్యసముపార్జన సమయములో శాసన రూపం దాల్చినవి. 1947 లోని బొంబాయి విడాకుల చట్టము, 1946 లోని బొంబాయి బహు భార్యాత్వ నిషేధ చట్టము, 1949 లోని మద్రాసు బహు భార్యాత్వ నిషేధము, విడాకుల చట్టము 1935 భారత ప్రభుత్వ చట్టములో నిర్దేశింప బడిన రాష్ట్ర స్వపరి పాలన ఫలితాలు. ముస్లింలవంటి అల్పసంఖ్యాక వర్గాలు సంస్కరణను కోరినపుడు బ్రిటీష్ ప్రభుత్వము దానిని వ్యతిరేకించ లేదు. 1936 లోని పార్సీ వివాహ విడాకుల చట్టము ఈ వైఖరికి నిదర్శనము. ముస్లిం వివాహిత స్త్రీకి విడాకుల హక్కును ప్రసాదించే 1939 శాసనము ముస్లిం సంస్కరణ వాదుల ప్రయత్న ఫలితముగా ఎంచుకొనాలి. మతపరమైన వ్యవహార శాసనాల మార్పులను చారిత్రకంగా పరిశీలించి తగు నిర్ణయాలను చేయవలసి ఉంటుంది. 1956, 60, 1964, 1976, 1978 లలో మార్పు చేయబడిన హిందూ వివాహ శాసనము, 1956 లోని హిందూ వారసత్వ శాసనము, 1956 లోని హిందూ దత్తత మనవర్తి చట్టము, 1956 లోని హిందూ సంరక్ష కత్వక శాసనము, ఇవన్నీ హిందూ శాస్త్రమును మార్చుటకు జరిగిన ప్రయత్నాలు. అభ్యుదయ కరమైన ప్రజాభిప్రాయానికి అనుగుణంగా హిందువుల శాసనాలను మార్చుటకు ప్రభుత్వాలు వెనుకాడ లేదని మనము గ్రహించ వచ్చును. కాని ముస్లింలా సవరణ ఎప్పుడో 1939లో జరిగినది. క్రైస్తవ వివాహ శాసనము 1872 లో క్రోడీకరింప బడినది. క్రైస్తవ విడాకుల శాసనము 1869 నాటిది. పార్సీ వివాహాలు, విడాకులను గురించిన శాసనము 1936 లో రూపొందించ బడినది. అట్లు ఒక వైపున స్వప్రయోజనపరులు, రెండవ వైపున పాలక వర్గాలు, ఇద్దరు కలిసి అల్ప సంఖ్యాక వర్గాల వ్యవహార శాసనాలను (Civil Laws) మార్చే విషయంలో కుట్రచేసి జోక్యం కల్గించుకోటం లేదా అనే అనుమానం కలుగుతున్నది,

దేశం యావత్తకు పౌరులందరికి వర్తించే ఒకే ఒక వ్యవహార సంహితను (Common civilcode) రూపొందించటానికి ప్రభుత్వము కృషి చేయాలని భారత రాజ్యాంగ 44వ అధికరణములో స్పష్టీకరించ బడింది.

రిపబ్లిక్ రాజ్యస్థాపన జరిగిన 31 ఏండ్ల తరువాత కూడా ఈ సందర్భంగా ఏ ప్రయత్నము జరుగక పోవుట గమనార్హము. ఈ పరిస్థితికి దోహద కారణాలు అనేకము. అల్ప సంఖ్యాక వర్గాలలో తగినంత మంది పలుకుబడి గలిగిన సంఘ సంస్కర్తలు లేకపోవడం, అల్ప సంఖ్యాకుల మత భావాలకు విరుద్ధంగా సవరణలు తెచ్చి వారిని రెచ్చగొట్ట రాదనే పాలకుల వైఖరి, పాలక పార్టీలు, ప్రతిపక్ష పార్టీలు అందరు కూడా సంస్కరణలకు పూనుకుంటే అల్ప సంఖ్యాకుల ఓట్లు తమకు రావనే భయాందోళనలు ఇవన్నీ ఈ శోచనీయ పరిస్థితికి కారణ భూతాలు.

మతాలలోని సనాతన వర్గాలు తరుచుగా "మామత శాసనాలలో లోపాలు ఏమున్నై?" అనే ప్రశ్నను వేస్తున్నాయి. నిజానికి ఆమత శాసనాలలోని ఇంచు మించుగా ప్రతి అంశము లోపభూయిష్టమే. వాటిని మార్చవలసిన అగత్యము అనేక కారణాల వల్ల సంభవిస్తున్నది. ఏ ఒక్కడు ఫలానిమతముతో మాతృ గర్భములో నుండి వెలువడినాడని చెప్ప వీలు లేదు. వ్యక్తికి దేవునికి వున్న సంబంధాన్ని నిర్దేశించేదే మతమని నిర్వచనం చేసుకుంటే అప్పుడు అవ్యక్తి మేజరైనతరువాత తన మతమును నిర్ణయించుకో వచ్చును. అంతేకాక ఒక మతస్తునికి మరియొక మతస్తునికి తేడా చూపునట్లుగా మత శాసనాలు అమలు జరుగరాదు. ఎన్నడో 3000 సంవత్సరాల నాడు నీతిని నిర్దేశించటానికి ఉద్భవించిన "పవిత్ర" గ్రంధ ములలోని సూత్రాలను బట్టి గాక, ఐక్యరాజ్య సమితి రూపొందించిన విశ్వ మానవ హక్కుల ప్రకటన సూత్రాలకు అనుగుణముగా వ్యవహార శాసనాలు రూపొందించ బడాలి. ప్రపంచం మారుతూ వుంది. సాంకేతిక పరిజ్ఞానం పురోగమిస్తున్నది. విలువలు మారుతూ వున్నాయి. అయినా పురాతన చట్టాలకు అంటి పెట్టుకుందామనే వైఖరి అజ్ఞాన తిమిరానికి నిదర్శనము. మత పరమైన శాసనాలు స్త్రీల న్యాయమైన హక్కులను కాల రాస్తున్నవని మనందరికి తెలుసు. కనుకనే మతపరమైన శాసనాలు మారాలని స్త్రీలు ఆందోళన చేస్తున్నారు.

మత పరమైన శాసనాలలోని కొన్ని దుర్లక్షణాలను గమనిస్తే అవి స్త్రీలను ఎంతగా అణచి వేస్తున్నవో ఋజువు అవుతుంది. స్త్రీలకు జరిగిన అన్యాయము రెండు రకాలుగా ఉంటుంది. 1. స్త్రీ పురుషుల మధ్య వివక్ష చూపటం. రెండవది స్త్రీల యొక్క న్యాయమైన మానవ హక్కులను కాలరాయడం. వివాహము, విడాకులు, భరణం, దత్తత, సంరక్షకత్వము, వారసత్వము లాంటి అంశాలకు సంబంధించి కొన్ని ముఖ్య లక్షణాలను గమనించుట అవసరము.

## వివాహము :-

బాల్య వివాహము చెల్లదని హిందూ వివాహ శాసనము ప్రకటించ టంలేదు. బాల్య వివాహములోని మేజరైన వరుని గాని, వధువుని గాని, ఆ వివాహాన్ని ప్రోత్సహించిన పెద్దలను గాని శిక్షా పాత్రులుగా నిర్ణయిం చింది బాల్య వివాహ శాసనం. ముస్లమాన్‌లలో బాల్య వివాహము చెల్లుతుంది : ముస్లింలా దానిని నిషేధించదు. ఈ పరిస్థితి ఇంకా కొన సాగుటకు వీలులేదు. సరి అయిన శాసనము లేకుండా సదుద్దేశ్యములను ప్రకటించినంత మాత్రాన దేశం పురోగమించదు.

హిందూ వివాహము విధిగా రిజిష్టరు చేసుకో నక్కరలేదు. మత గురువులు వ్రాసే రిజిష్టరులలో ముసల్‌మాన్ క్రైస్తవ వివాహాలు విధిగా నమోదు చేయ బడతాయి. ఈ సందర్భంగా లౌకిక ఉద్యోగాలను నిర్వ హించేవారు వివాహాలను రిజిష్టరు చేయాలని శాసన పరంగా నిర్దేశించటం మంచిది.

హిందూ వివాహ చట్టములో ఒక వైపరీత్యం వున్నది. ఈ దేశంలో పుట్టిగాని లేక స్థిరనివాసము ఏర్పరచుకొని గాని ముస్లిం క్రైస్తవ పార్సీ మతములకు చెందని వ్యక్తి హిందువుగా పరిగణించ బడును. అంటే ఈ చట్టము హేతు వాదులకు అజ్ఞేయ వాదులకు, నాస్తికులకు కూడా వర్తిస్తుంది. కాగా హిందూ వివాహము ఆచారము నిర్దేశించిన తంతు ప్రకారము జరిగితేనే చెల్లుతుంది. హిందూ మతమును అనుసరించువారి

విషయంగా ఆచారమేదో కోర్టుద్వారా నిర్ణయింప బడినది. తతిమ్మావారు సంప్రదాయాన్ని ఎంతో కష్టముతో ఋజువు చేసుకోవలసి వున్నది. ఇది హేతువాదులు వగైరాల పట్ల వివక్ష అని చెప్పవచ్చును.

## బహూ భార్యాత్వము :-

ఒకే కాల మందు నలుగురు భార్యలను ముసల్మాన్ పురుషులు కలిగి వుండవచ్చును అని ముస్లింలా చెపుతుంది; కాగా ఒక షరతు పెట్టబడినది. నలుగురు భార్యలను న్యాయముగా చూడగలిగినప్పుడే అలాంటి వివాహము పురుషుడు చేసుకోవచ్చును. ఈ షరతువల్ల ప్రయోజనములేదు. ఏ ఒక్క పురుషుడు నలుగురు భార్యలను సమముగా ప్రేమించలేడు. ఇది మానవ నైజానికి వ్యతిరేకం. పెత్తనం సాగించే ముస్లిం భర్త చెప్పు చేతలలో అణగి మణగి వుండే ముస్లిం స్త్రీల దైన్యావస్థ వర్ణింపనలవి కానిది. ఈ ఇరవయ్యో శతాబ్దములో ఇలాంటి శాసనాన్ని ఇంకా మననీయడం మన సంస్కృతికి, నాగరికతకు తీరని మచ్చ.

## విడాకులు :-

విడాకులను గురించి మత-పరమైన శాసనాలు లోప భూయిష్టంగా ఉన్నాయి : పరిస్థితులకు అనుగుణంగా లేవు. తనంత తానుగా తలాక్ ఇచ్చి ముస్లమాన్ పురుషుడు తన భార్యకు విడాకులు ఇవ్వగలడు. కాని అలాంటి పరిహారాని కై ఆమె కోర్టులో దావా వేసుకొనవలసి వున్నది. క్రైస్తవులకు సంబంధించిన విడాకుల చట్టము మరీ ఘోరంగాను, వివక్షతోను కూడుకొని వున్నది. విడాకులు కావాలంటే తన భార్య వ్యభిచరించిందని క్రైస్తవ పురుషుడు ఋజువు చేస్తే సరిపోతుంది. కాని, క్రైస్తవ స్త్రీ పరిస్థితి దుర్భరంగా వున్నది. సన్నిహితులతో వ్యభిచరించాడని, లేక మరో భార్యను స్వీకరించి వ్యభిచరించాడని లేక మరొక స్త్రీని వివాహమాడి వ్యభిచరించాడని లేక వ్యభిచరిస్తూ తనను హింసించాడని, లేక వ్యభిచరించి తన యొక్క బాగోగులను రెండు సంవత్సరాలపై కాలము పట్టించుకోలేదని ఇలా పోటీలో ఏదో ఒక దానిని ఆమె ఋజువు చేస్తే తప్ప క్రైస్తవ స్త్రీకి

భర్త నుండి విడాకులు రావు. అంటే వ్యభిచారము ఒక్కటే చాలదు. మరియొక అంశము ఋజువు చేయవలసి వున్నది. ఇది స్త్రీ పట్లా ఘోర మైన వివక్షకాక మరేమిటి ?

వివాహితులలో ఎవరో ఒకరు ఈ దాంపత్య జీవితము ఇక కొన సాగించలేను అని నిర్ద్వంద్వముగా ప్రకటిస్తే కోర్టు విడాకులు ప్రసాదించడం సమంజసం. అలాంటి సౌకర్యము మత పరమైన శాసనాలలో ఆమాట కువస్తే 1954 లోని ప్రత్యేక వివాహ చట్టములో కూడా లేకుండుట శోచనీయం.

శాసనాలలో నిర్దేశింపబడిన విధానములు వైవిధ్యముతో కూడుకొని వున్నవి. పిటిషన్ ద్వారా హిందువు విడాకులు పొందగలిగితే ముస్లిం స్త్రీ అదే పరిహారం నిమిత్తం దావా వేయవలసి వున్నది. రాష్ట్ర హైకోర్టులోని ముగ్గురు జడ్జీలతో ఏర్పడిన ధర్మాసనం మాత్రమే క్రైస్తవ వివాహాన్ని రద్దు చేయగలదని శాశించడం విడ్డూరం కాదా ? దీని వల్ల అనవసర జాప్యం, కాలహరణం జరుగవా ? వివాహ సంబంధమైన దావాలలో పార్టీలను ప్రత్యర్థులుగా, పరిగణించడం, దోషులెవరో నిర్ధారించాలని ప్రయత్నించడం ఈనాటి న్యాయ నిర్ణయ విధానాలలో లోపాలు. జపాన్, సోవియట్, రష్యా, కమ్యూనిస్టు చైనా. లాంటి దేశాలలో కుటుంబ న్యాయ స్థానాల ద్వారా పార్టీల మధ్య రాజీ కుదర్చటానికి, సామరస్యం నెలకొల్పటానికి ప్రయత్నాలు జరుగుతై. మన దేశంలో ప్రత్యేక న్యాయ స్థానాలు లేవు. ఈ తగాదాల పరిష్కారం చేసే బాధ్యత మామూలు న్యాయ స్థానాలకు ఒప్పగించారు. దీని వల్ల పార్టీలు అనేక కష్టనష్టములకు గురిఅవుతున్నారు.

## భరణం :-

ముస్లింలా ప్రకారము "ఇద్దత్" అంటే షుమారు 3 మాసముల వరకే విడాకులు ఇవ్వబడిన స్త్రీ భర్త నుండి మనవర్తి పొంద గల్గుతున్నది. ఇందువల్ల దురహంకారియైన ముస్లిం పురుషుడు తనకు అట్టే బాధ లేకుండానే భార్యకు విడాకులు ఇవ్వడానికి ఎంతో అవకాశం ఉన్నది.

పురుషుడు చనిపోతే భార్యకు పరిస్థితులను బట్టి 1/8, 1/4వ వంతు వస్తుంది. మిగతా వాటాను కుమార్తెలు, కుమారులు పంచుకుంటారు. అయితే కుమారునికి కుమార్తె వాటాకన్నా రెండింతలు వస్తుంది. కొన్ని పరిస్థితులలో చనిపోయిన వాని తల్లి యెడల, కుమార్తె యెడల వివక్షను పార్సీ వారసత్వ చట్టములో కూడ మనం గమనించగలం.

ఇదంతా దేనిని ఋజువు చేస్తుంది? మత పరమైన శాసనాలు స్త్రీలకు అన్యాయం చేస్తున్నాయనీ, వారిపట్ల హింసాయుతంగా ప్రవర్తిన్నాయనీ నిస్సందేహంగా చెప్పవచ్చును. ఈ పరిస్థితి ఇలా ఎందుకుంది? అనేక కారణాలు చెప్పబడుతున్నాయి. చారిత్రక రాజకీయ, ఆర్థిక, మానవ పరిణామ శాస్త్ర సంబంధమైన కారణాలు పేర్కొనబడుతున్నాయి. అంతటితో ఆగక శారీరక మానసిక కారణాలను కూడా కొంతమంది ఉటంకిస్తున్నారు. ఎంత పురుష దురహంకార ప్రదర్శనో గమనించండి! చివరి రెండు కారణాలు తప్ప మిగతా కారణాలు కొంతవరకు సత్య దూరము కాక పోవచ్చు. ఈ సందర్భంగా ఒక సూచన ముందు కొస్తున్నది. శాస్త్ర కారులు ఇంచుమించుగా అందరూ పురుషులే అవడం దీనికి కారణమా? తమ హక్కులను గురించిన పరిజ్ఞానస్థాయి ఈ ప్రశ్నపై ఆధార పడుతుంది. తరతరాల నిద్రనుండి మేల్కొని చైతన్యవంతులై స్త్రీలు తమ న్యాయ మైన హక్కుల కొరకు పోరాడ నక్కరలేదా? మానవ వాదంతో మిళితమైన స్త్రీజాతి ఐక్యతను ఉద్బోధించే సిద్ధాంతాన్ని స్త్రీలు చేపట్టకపోతే వారికి విముక్తి లేదు. అప్పుడే, ఆ పరిస్థితులలోనే ఒకే ఒక వ్యవహార సంహితను- న్యాయమైన దానిని - మహిళలు సాధించుకోగలరు.

('తెలుగు విద్యార్థి' మాస పత్రిక, డిసెంబరు 1981)

ఆ హక్కు లేదు. స్త్రీ పురుషులలో ఈ తేడా లెందుకు! ఈ తేడాలు ఎవరు సృష్టించారు, ఎందుకు సృష్టించబడినయ్ అంటే, ఈ అంతరాలు ప్రకృతికి సంబంధమైనవేకాక పుట్టుకతో వచ్చినవే అనే వాదం ప్రబలంగా వుంది. మనో బలానికి లింగభేదం అడ్డురాదు. గ్రామీణ పడుచుల కంటె అగ్రవర్ణాల వారు బలహీనులే కదా! అయినా శారీరక బలం గలిగిన గిరిజన హరిజన 'శూద్ర' జాతుల్ని చిన్న చూపు చుస్తారు కదా! స్త్రీ పురుష సమానత్వాన్ని చట్టం ఘోషించింది. కాని సమాజం కాలదన్నింది. చట్టాల వల్ల ప్రయోజనం రాముడికి చంద్రుణ్ణి అద్దంలో చూపినట్లే జరుగుతోంది. ఆర్థిక అసమానతలకు కరణాలు భౌతిక మైనవి. సాంఘిక అసమానతలకు కారణాలు మానసికమైనవి. అంతరంగిక స్వేచ్ఛ లేకుండా కోర్కెలతో, చీకట్లలో గొలుసులు బిగించుకున్న వ్యక్తిని బైటి ప్రపంచం ఇంకా బానిసను చేస్తుంది. స్త్రీ బానిసత్వం కేవలం భౌతిక మైనది కాదు. మానసికమైనది. ఇది మార్చాలంటే ఒక రామ్మోహనరాయ్, ఒక కందుకూరి దిగి రావాలి. ఎంతో కాలం గడవాలి; మరెందరో మేధావుల సాయం వుండాలి.

స్త్రీ బానిసత్వం ప్రకృతి సిద్ధమనీ, భగవత్ నిర్ణయమనీ ధర్మ శాస్త్ర కారులు, పురుషులు స్త్రీలకు ఉగ్గుపాలతో నేర్పిన విద్య. ఈ బీజాలు మహా వృక్షాలై శాఖోప శాఖలుగా విస్తరించినై. ఈ నాడు చట్టం, సమాజం వారికి స్వేచ్ఛ సమానత్వా లిస్తామన్నా జైలు నుండి బైటకు రావడానికి భయపడే ఖైదీలలాగా భయపడుతున్నారు స్త్రీలు. పైకి స్త్రీ స్థానం వున్నతంగా కనబడుతుంది. కాని అసలు స్థానం పురుషుల పాదాల చెంతనే వుంటోంది. స్త్రీకి సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాల్లో వున్న అసమానతలకు మూలమైన, అసలు పునాదిరాయి స్త్రీ పురుష అసమానతే. ఆడపిల్ల పుడితే దుఃఖపడి, నీటిలో పడేసి చంపే జాతులింకా ఈ దేశంలో వున్నై. ఆడవాళ్ళను కొట్టటం, తిట్టటం, చంపటం ప్రపంచ దేశాలన్నింటా వుంది. చనిపోయిన భర్తను బ్రతికించుకున్న సావిత్రి కథ మన కాదర్శం. మరి చనిపోయిన భార్యను తెచ్చుకొన్న పత్నీవ్రతుల కథలు ఎందుకు లేవూ? వ్యభిచరించ టానికి భర్తను మోసుకెళ్ళిన సుమతి మనకాదర్శం. కానీ ఏ స్త్రీ అయినా పురుషుని నమ్మి మోసపోయినా ఆమె శీలాపహరణ జరిగిందని అంటారు. తప్పుచేసిన స్త్రీ చస్తే సమాజం హర్షిస్తుంది. కాని సంస్కరించుకొని

రావాలి; రెండవది మోసపోయిన స్త్రీని ఎవరూ దరి చేరనీయక పోవటం. కాలుజారిన స్త్రీకి నిరాదరణ వల్ల స్థానంలేని కారణంగా ఆమె ఆజన్మాంతం దౌర్భాగ్యపు జీవిగా బ్రతికే పరిస్థితి మారాలి. వ్యభిచారాన్ని పురుషుడు వినోదంగా, విలాసంగా, అనుభవించే దుర్నీతిని స్త్రీలు అరికట్టాలి.

పురుషుడిలో విరుద్ధ మనస్తత్వాలు గోచరిస్తున్నాయి. తన ఇల్లాలు తన దాసిగా ఉండాలని ఒక వైపు; ఆమె గొప్పదై ఆమెవల్ల తనకు పేరు ప్రతిష్టలు రావాలని మరోవైపు. మేధస్సు, వ్యక్తిత్వంకల స్త్రీని సొంతం చేసుకోవాలని వాంఛించటమే అవివేకం. స్త్రీ చైతన్యం, వివేకం దోచుకుని ఆమెను బానిసను చేసి తిరిగి ఆమెనుండి ఔన్నత్యాన్ని కోరటం ఆత్మ ద్రోహం అవుతుంది. ఆమె స్వేచ్ఛనైనా గౌరవించాలి; లేదా దాస్యాన్నయినా స్వీకరించాలి. పరిష్కారంగా పురుషులు ఆమెను తరతరాల దాస్యంలో బంధించారు.

చైతన్యం, అదుపు - పరస్పర విరుద్ధాలు. చైతన్యం లేని వ్యక్తి జడంతో సమానం. అంటే అదొక ఆటబొమ్మ; ప్రాణమున్న కీలుబొమ్మ. శవ సమానమైన వ్యక్తి సమాజానికి, కుటుంబానికి నష్టదాయకం. స్త్రీ పురుషుల మధ్య అనుబంధం సమాన ప్రాతిపదిక మీద జరగనప్పుడు కుటుంబమే పునాదిలేని సౌధమౌతుంది. మరి ఆడది ఆట బొమ్మగానే మిగలాలా ???

(ఆంధ్ర పత్రిక 3-1-81)

# సెక్సు - అపోహలు

సెక్సు పేరెత్తగానే కొంతమంది ఉలిక్కి పడతారు. మరి కొంత మంది కలవర పడతారు. ఇంకా కొందరు సిగ్గుతో మెలికలు తిరిగి పోతారు. కొద్దిమంది ఉబ్బి తబ్బిబ్బవుతారు. తతిమ్మావారు భయంతో వొణికి పోతారు. ఇదీ ఈ నాటి స్త్రీల స్థితి.

సెక్సు విషయంగా స్త్రీలు ఇలా భిన్న వైఖరులు ప్రదర్శించటానికి వారు మనుగడ సాగిస్తున్న సమాజం, చుట్టూవున్న పురుష ప్రపంచం కారణ భూతాలు. స్త్రీని జీవంలేని వస్తువులాగా చూడటం, ఒకవేళ మనిషిగా చూచినా స్వేచ్ఛ ఇవ్వకపోవటం, కాస్తో కూస్తో స్వేచ్ఛ ఇచ్చినా పురుషులతో పాటు సమాన ప్రతిపత్తి ఇవ్వక పోవటం ఇవన్నీ కలిసి స్త్రీని న్యూనత పరిచినై. సెక్సు అనుభవం తన కవసరమా కాదా అని తేల్చుకొవటం, అందులో ఆనందానుభూతిని పొందటానికి ఆశించటం, అందుకనువైన మార్గాలను అన్వేషించటం. ఈ పనులను స్త్రీ చేపడితే తోటి స్త్రీలు అవహేళన చేస్తారు; పురుషులు నిందిస్తారు. సెక్సు యెడ సమాజం యొక్క వైఖరిని అందులో స్త్రీల దృష్టిని పొరపాటుగా నిర్ణయించుకోవటం వల్ల ఇలా జరుగుతోంది.

సెక్సు విషయం మాట్లాడరాదు; వినరాదు; చర్చించరాదు. నిజానికి స్త్రీ జీవితంలో సెక్సుకు స్థానం లేదా ? యుక్త వయస్సు వచ్చినప్పటి నుండి ఆమెకు సెక్సును అనుక్షణం ఈ సమాజం గుర్తుచేయుట లేదా ? అమ్మాయి రజస్వల కాగానే ఎంత సంరంభం, ఎంత హడావుడి! ఇరుగు పొరుగు వారిని, బంధువర్గాన్ని పిలిచి, పంక్తి భోజనాలు సాగిస్తారు. సెక్సు జీవితాన్ని గుర్తుచేసే వేడుకలు జరుపుతారు. పెళ్ళితంతు సరేసరి. గర్భాదానపు మంత్రాలలో సెక్సు జీవిత చిత్రణ ఎబ్బెట్టుగా వుంటుంది. గర్భధారణ జరగగానే సూడిదలు, సీమంతాలు – ప్రసవం కాగానే భారసాల మహోత్సవాలు. ఇలా స్త్రీ జీవితంలో సెక్సును ఆమెకు గుర్తుచేసే సంఘటనలు, క్రతువులు ఎన్నో వుంటాయి. ఉ॥ రజస్వల అయిన నక్షత్రం

చెడ్డదయితే గుండపు శాంతులు చెయిస్తారు. తనేదో దోషం చేశాననే భావాన్ని ఇలాంటి క్రతువులద్వారా స్త్రీకి కల్పిస్తుంది ఈ సమాజం ఆమెకు పిన్ననాటనే.

సెక్సు ద్వారా ఆనందాన్ని పొందాలని స్త్రీ కోరుకోవటం తప్పనీ, సంతాన ప్రాప్తి కోసం మాత్రమే స్త్రీ సెక్సు జీవితాన్ని గడపదగుననీ కొందరు నీతి బోధ చేస్తున్నారు. అలాంటి వారిలో మహాత్మాగాంధీ ఒకరు. పితృరుణం తీర్చటానికి పురుష సంతానాన్నికని భర్తకు సమర్పించిన తర్వాత ఇల్లాలు బ్రహ్మచర్యం అవలంబించాలనే వారూ వున్నారు. వీరి దృష్టిలో స్త్రీ పురుష లైంగిక సంబంధం సంతానం కొరకు మాత్రమే ఉద్దేశింప బడింది. అది వినా వారికి సెక్సు జీవితం నింద్యం; గర్హణీయము కూడాకు. అయితే ఇలాంటి వైఖరిని మన పూర్వీకులు ప్రదర్శించినట్లు కన్పడదు. ఋషుల కాలంలో సెక్సును నీచంగా చూడలేదు. వారు సెక్సు జీవితానికి తగినంత ప్రాధాన్యత ఇచ్చారు. ఒక రకంగా ఆలోచిస్తే ఋషులు ఆనందోపాసకులు. జీవితాన్ని సుఖప్రదము, ఫల ప్రదము చేసుకోడానికి వారు కృషి చేశారు. సెక్సును శాస్త్ర విషయంగా గ్రహించి అధ్యయనం చేశారు. వాత్సాయనుని కామ శాస్త్రం దీనికి తార్కాణం. కాని, ఇటీవల వేయి సంవత్సరాల నుండి వచ్చింది ఈ నాటి వక్ర భాష్యం. సెక్సు జీవితాన్ని చేజేతులా పొదులుకున్న స్త్రీ పురుషులు ఇంద్రియ నిగ్రహం చెయ్యలేక ఎన్ని వెతల పాలపడుతున్నారో, ఎన్ని సంకట స్థితులలో చిక్కుకుంటున్నారో, ఎన్నిరకాల మానసిక క్లేశాన్ని అనుభవిస్తున్నారో వైద్యులకు, మానసిక శాస్త్రజ్ఞులకు తేట తెల్లమైన విషయమే. ఈ సిద్ధాంతాలతో మానవ ప్రకృతిని, మానవ నైజాన్ని చిదిమి వేస్తున్నారు. ఈ కుహనా పండితులు అజ్ఞానంతో, అయోమయంలో ఒక వర్గం ప్రజల్ని తమ తప్పుడు ఆలోచనల ద్వారా హింసిస్తుంటే-మరి కొందరు చిత్త శుద్ధిలేని వారై ద్వంద్వ నీతితో కృత్రిమ జీవితాన్ని గడుపుతున్నారు. ఇలా సమాజాన్ని వక్ర మార్గాన పట్టిస్తున్నారు.

సెక్సును మోక్ష సాధనంగా అభివర్ణించి ప్రచారంచేసే ప్రబుద్ధులూ లేకపోలేదు. మన దేశంలో ఆశ్రమాలు నెలకొలిపి కాముక క్రీడద్వారా

మోక్ష ప్రాప్తికి సోపానాలు నిర్మించిన రజనీష్‌లాంటి గురువులు కోకొల్లలు. తాంత్రిక పద్ధతుల్లోని పాంచరాత్ర విధానంలో సెక్సుకు విపరీతస్థానం కల్పించ బడింది. ప్రస్తుత సమాజంలో మోసం, కృత్రిమం, విశ్వాస రాహిత్యం, నిజాయితీలేమి గూడుకట్టుకొని వున్నాయని తలపోస్తూ ఈ సమాజం నుండి పారిపోదామని ప్రయత్నించే హిప్పీలు సెక్సును కేవలం సంతోష సాధన మార్గంగా వాడుతున్నారు. మత్తు పదార్థాలను సేవించడం, వావి వరుసలు లేకుండా లైంగిక స్వైర విహారం చేయడం వీరి నైజంగా మారింది. దాహంవేస్తే నీరు త్రాగినట్లు శారీరక ఉద్రిక్తతను తొలగించు కోటానికీ, కామ దాహం తీర్చుకోటానికి నీతి నియమాలు, సమాజం అడ్డురారాదని వాదించేవారూ వున్నారు. దీనినే **Drink of water theory** అని పిలుస్తారు. ఇలా వెఱ్ఱితలలు వేశారు విపరీత మనస్కులు.

స్త్రీ పురుషుల జీవితంలో సెక్సు పాత్రను సరిగా మదింపు చెయ్యాలంటే సామాజిక చరిత్ర అవగాహన అవసరం అవుతుంది. శారీరక శాస్త్ర జ్ఞానాన్ని సంతరించు కోవాల్సి ఉంటుంది. మానసిక శాస్త్ర సిద్ధాంతాలను అవగతం చేసుకోవటం అవశ్యమవుతుంది. ఇంత విషయ జ్ఞానం అవసరమైనప్పుడు అదేమీ పట్టించుకోకుండా మౌఢ్యంలో తల మున్కలు వేయడం విజ్ఞతకు లక్షణం కాదు. సెక్సు అనుభవం శారీరక సుఖాన్ని చేకూరుస్తుందనీ, మానసిక ఆనందాన్ని ఒన కూరుస్తుందనీ జీవితానుభవం వల్ల తెలిసు కుంటున్నాం. శారీరక సుఖం ఒక జీవితపు విలువ. అలాగే మానసికానందానుభూతి మరో జీవితపు విలువ. స్త్రీ పురుషులు తమ తమ స్థాయీ భేదాల్ని బట్టి వీటిలో ఒక దానివైపు మొగ్గు చూపించవచ్చు. మానవుని జీవితంలో సెక్సు ప్రధానపాత్ర వహిస్తుందనేది నగ్న సత్యం. కాగా, సెక్సు పరమైన మానసికానందాన్ని అవలకు నెట్టి మరో రకంగా మనస్సుకి ఆహ్లాదాన్ని ఆశించేవారూ వున్నారు. కాగా దరహంమీద చూస్తే మానవులు శరీర సుఖాన్ని, మా న సి క సంతోషాన్ని వాంఛిస్తున్నట్లు తేలుతుంది. ఆదిమ సమాజంలో స్త్రీ పురుషుల మధ్య సెక్సు సంపర్కం సాగేది. దరిమిలా సంఘ పరిణామంలో సెక్సు జీవితాన్ని క్రమబద్ధం

చేయటానికి, సంతానం యొక్క తల్లిదండ్రులను నిర్ధారణ చేయటానికి వివాహవ్యవస్థ ఉద్భవించింది. దాంతో సంతానానికి అత్యంత ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది. సంతానప్రాప్తి మాత్రమే వివాహ లక్ష్యంగానూ, సెక్సు జీవిత ఆదర్శంగానూ చిత్రించబడింది. సెక్సు సహాయంతో ఆనందాబ్ధిలో ఓలలాడ వలసిన భార్యాభర్తలు ఈ విచిత్ర నియమాలకు బలైనారు. ఇది శోచనీయం.

వివాహం యొక్క లక్ష్యాన్ని సరిగా, స్పష్టంగా నిర్దేశించాలి. స్త్రీ పురుషులిద్దరూ ఒకరిపై ఒకరు అభిమానాన్ని, ఆప్యాయతను, మోహాన్ని, ప్రేమను పెంచుకున్నప్పుడు మామూలుగా వివాహమాడతారు; కొంతమంది వివాహ ప్రక్రియ లేకుండా దాంపత్య జీవితం సాగిస్తుంటారు. ఏపద్ధతి అవలంబించినా ఆ సంబంధానికి ప్రధాన లక్షణం సన్నిహితత్వం. ఒకరి కొకరు మానసికంగా, సామాజికంగా చేరువైనప్పుడు వారిరువురూ సెక్సు అనుభవాన్ని పొందడం విడ్డూరంగా కన్పట్టదు. ఆలోచిచాల్సిందేమంటే, సెక్సు అనుభవం సన్నిహితత్వాన్ని అనుసరించి పోవలెనా లేక దానివల్ల సన్నిహితత్వం ఏర్పడుతుందా అనేది ప్రశ్న. నిజానికి రెండూ పరస్పరాశ్రయాలు: అవినాభావ సంబంధం కలవి. లైంగికానుభూతి సన్నిహితత్వానికి చరమదశగా పేర్కొనవచ్చు. అదిలేని సన్నిహితత్వం పరిపూర్ణత్వాన్ని పొందదు. అట్లే దాంపత్య జీవితం సన్నిహితత్వాన్ని ధృఢతరం చేస్తుంది.

సతీ పతులు విభిన్న మనస్తత్వాలు కలిగివున్నా, ఇద్దరిమధ్యా వున్న విశిష్ట సంబంధంవల్ల ఒకరి కొకరు చాలా దగ్గరివారౌతారు. అలాంటప్పుడు వారు దాంపత్య జీవితం గడపకుండా ప్రేయసీ - ప్రియురాలుగా తమను చిత్రించుకుంటూ కాలం గడుపుతూవుంటే వారి జీవితం నిస్సారమౌతుంది. ఉత్తరోత్తరా వారు మానసిక క్లేశానికి గురిఅవుతారు. సెక్సు అచ్చంగా శారీరక ప్రక్రియ అని తలపోయడం పొరపాటు. అది మనసుకు, శరీరానికి రెంటికీ సంబంధించిన విషయం. మనస్సులేని సెక్సు అనుభూతి పశుప్రాయం,

మోక్ష సాధనకోసం సెక్సును పరిహరించి బ్రహ్మచర్యాన్ని పాటించటం, సంతాన ప్రాప్తి కోసం మాత్రమే దాంపత్య జీవితాన్ని గడపపూనటం, మోక్షసాధనకు లైంగికానుభూతిని సోపాన మార్గంగా ఎన్నుకోవడం, మనస్సుతో సంబంధంలేని కామక్రీడను అభిలషించడం ఇవన్నీ పెడమార్గాలు. స్త్రీ పురుషుల సన్నిహితత్వానికి సెక్సు వుపకరిస్తుందని గ్రహించడం, కాముక క్రీడను ఒక స్థాయిలోని విలువగా గుర్తించడం సవ్యమైన ఆలోచనా విధానానికి ప్రతీకలు. ఈ విషయాలను స్పష్టంగా గ్రహించ గలిగిననాడు సెక్సును నిందించడంగాని, అతిగా స్తుతించడంగానీ జరగదు. సమతుల్యభావనతో, వాస్తవ దృష్టితో హేతుబద్ధంగా ఆలోచిస్తే సెక్సును గురించిన గందరగోళం మటుమాయ మౌతుంది. అలాంటి దశకు మానవజాతి - అందులో ముఖ్యంగా భారతీయులు త్వరితగతిన చేరుకుంటారని ఆశిద్దాం. సెక్సు విషయికమైన అపోహలను పోగొట్టుకొని, స్వంత ఆలోచనలో నిబ్బరంగా తమ జీవితాలలో దాని పాత్రను సరిగా అర్థం చేసుకొని మనుగడను స్త్రీలు సుఖవంతం చేసుకునే కాలం వస్తుందని అభిలషిద్దాం.

("ఆదివారం" ఫిబ్రవరి 82)

# ఏది అసభ్యత? ఏది అశ్లీలం?

ఇటీవల అశ్లీల చిత్రాలను బహిష్కరించాలని, అర్ధనగ్న పోష్టర్లను చింపివెయ్యాలని, అశ్లీల సాహిత్యాన్ని ధ్వంసం చేయాలని ఆందోళనలు జరుగుతున్నై. వ్యాపారస్తులు సబ్బులు, పేష్టులు, దుస్తులు మొదలు పెన్ను వరకు తమ వస్తువులపై ప్రచార సాధనంగా స్త్రీల బొమ్మలతో ప్రచురించే అసభ్య ప్రకటనలు పూర్తిగా నిషేధించాలని అలజడి ప్రారంభమయింది. సినిమాలలో సెక్సీ డాన్సులు, స్త్రీల అంగాంగ ప్రదర్శనలను ప్రతిబింబించే దృశ్యాలు తొలగించాలని, ముఖ్యంగా యువతీ యువకులను ప్రకోపింపచేసే 'రేప్' సీనులను బహిష్కరించాలని డిమాండ్లు పెరుగుతున్నై. ఇంకా మోడల్సు, ఎయిర్ హోస్టెస్‌లు, సేల్సు గరల్సు అవస్థల గూర్చిన విమర్శలు కోకొల్లలుగా వున్నై. అసలు జన్మకు కారణమైన మాతృ దేవతను ఇలా రోడ్లమీది కీడ్చి ఆమె శృంగార జీవితాన్నిలా రచ్చ

కెక్కించటం భారతనారీ సంస్కృతిని భంగపర్చటమేననే రభస ఎల్లెడలా గోచరిస్తోంది. ఇవి అనాగరిక లక్షణాలని, ఈ దుస్సాంప్రదాయాన్ని పూర్తిగా బహిష్కరించాలనే వాదనపై భిన్నాభిప్రాయాలున్నై.

కనుక శీర్షికను అర్థం చేసుకుంటేగాని సమస్య అవగాహన కాదు. బహుశః దీని భావం ఏమంటే మాతృమూర్తిగా చూడవలసిన స్త్రీని బజారుల్లో పెట్టున్నారని వారిభావం. బజారులో పెట్టబడేది వస్తువు; క్రయ విక్రయాలకు లోనయ్యే స్వభావం కలది. రెండవ అంశం స్త్రీని మాతృ దేవిగా చూడాలనేది.

మున్ముందుగా రెండవ అంశాన్ని పరిశీలించడం అవసరం. స్త్రీ జీవంకల ఒక వ్యక్తి. ఆమె తన కుటుంబంలో, తన చుట్టూ ఉన్న సమాజంలో, తన దేశంలో, ఈ యావత్ ప్రపంచంలో అనేక విధులను నిర్వర్తిస్తున్నది; అనేక పాత్రలలో కన్పిస్తున్నది. అలా అనేక బాధ్యతలను, విధులను కలిగి ఉంటున్నది. తన మగనికి సహచారిగా, తోడునీడగా, ప్రేయసిగా, సఖిగా, ఇల్లా ఎన్నోరకాలుగా అండదండలను అందిస్తున్నది. తన సంతానానికి మాతృమూర్తి; తన కుటుంబంలోని ఇతరులతో ఆమెకు ఇతర సంబంధాలు ఉన్నాయి. తన సోదరీ సోదరులకు అనుంగు సోదరి. తన తల్లి దండ్రులకు ఆమె కుమార్తె. చుట్టూ ఉన్న సమాజంలో ఆమె స్థానం ఆమె చేసే ఉద్యోగాన్ని బట్టి, ఆమె చేరిన సంఘాలను బట్టి, ఆమె అభిరుచులను బట్టి నిర్ణయమవుతుంది. వృత్తిరీత్యా ప్లీడరు కావచ్చు. లేక గుమస్తా కావచ్చు. అభిరుచిని బట్టి ఫొటోగ్రాఫరు కావచ్చు. చిత్రకారిణి కావచ్చు. అలాగే మహిళా సంఘ సభ్యురాలు కావచ్చు. సామాజిక విప్లవ సంస్థలో సభ్యురాలు కావచ్చు. తన దేశపు పౌరురాలిగా కూడా ఆమెను అభివర్ణించవచ్చు. ఇంకా కొంత విశాల దృష్టితో చూస్తే ఆమెను విశ్వ మానవ వ్యక్తిగా పరిగణించవచ్చు. ఇలా ఇన్ని వైవిధ్య స్వభావ స్వరూపాలుగల స్త్రీని మాతృమూర్తిగా మాత్రమే చూడాలని భావించడంలో అంతరార్థం లేకపోలేదు; స్త్రీ విధ్యుక్త ధర్మం మాతృత్వం అని భావించడమే అది. స్త్రీ మాతృత్వబాధ్యత నిర్వర్తించవచ్చు; నిర్వర్తించక పోవచ్చు. అది ఆమె ఇష్టా ఇష్టాలపై ఆధారపడుతుంది. సంతానాన్ని కనడం కనక

పోవడం ఆమె ఎంపికపై ఆధారపడుతుంది. సంతానోత్పత్తికి సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానాభివృద్ధి వల్ల ఆమెకు విధిగా మాతృమూర్తి కావలసిన శ్రమ తప్పిపోయింది. ఇది ఒక రకంగా ఆమెకు విముక్తి.

బజారులో వస్తువుగా ఏవ్యక్తినీ మనం గుర్తించ దలచం. అది మానవత్వానికి అపచారం; మానవ సమాజానికి ద్రోహం. తన వికాసానికి సోపానాలు నిర్మించుకోవలసిన వ్యక్తిని వస్తువుగా మార్చడం సహించరాని నేరం. కనుక అలాంటి స్థితిని ఎవరూ ఆశించరు. ఆశించరాదు. అంతేకాదు దానిని కొనసాగ నీయరాదు.

సినిమాలలో రేప్ సీనులు, నగ్న దృశ్యాలు, సాహిత్యంలో అశ్లీలం అనే వాటిని అసభ్యంగా పరిగణించాలని, వాటిని ప్రచురించడం ప్రచారంలోకి తేవడం లాంటి పనులు నేరాలుగా నిర్ణయించి శిక్షలు విధించాలని కొంత మంది ఆందోళన చేస్తున్నారు. ఇలాంటి వారిలో సంప్రదాయాలు ఒక వైపునుండి, విప్లవ వాదులలో తీవ్రవాదులు మరియొక వైపునుండి వాటిపై దాడి చేస్తున్నారు. ఇవి సమాజంలో స్త్రీని న్యూనత పరుస్తున్నాయని, సమాజం యొక్క నైతిక పతనానికి దారితీస్తున్నాయని అభిప్రాయ ప్రకటనలు జరుగుతున్నై.

ఇప్పుడు అసలు సమస్య చర్చా పరిధిలోనికి వచ్చింది. అసభ్యం అనే భావనను సునిశితంగా పరిశీలించాలి.

అసలు ఏది అసభ్యత? గీటురాళ్ళు ఏమిటి? అసభ్యతకు, సామాజిక ప్రయోజనానికి సంబంధం ఉన్నదా? ఏది అసభ్యతో నిర్ణయించేది ఎవరు? దానిని నేరంగా పరిగణించాలా? లేక సామాజికమైన చెడుగా మాత్రమే పరిగణించాలా? ఇలాంటి అసభ్యతను పోగొట్టటానికి మార్గాలేమిటి?

అసభ్యతను ఎక్కువగా సెక్సు పరంగానే చూస్తున్నారు. అసభ్యత నిర్వచనానికి భారత శిక్షాస్మృతిలోని 292వ సెక్షనును ఆధారంగా తీసుకోవాలా?లేక మరేమైనా గీటురాళ్ళు ఉన్నాయా? ఆ నిబంధననుబట్టి అసభ్యతకు ఈ దిగువ లక్షణాలుంటయి.

(1) నైతిక పతనానికి, నైతిక వక్రీకరణకు దోహదం చేసేది. లైంగిక పరిధిలో చూస్తే మానవునిలో సెక్సు భావనలను ప్రేరేపించి అతనిలోని పాశవిక ప్రేరణలను పెంపొందించేది.

(2) ఒక పుస్తకం, లేక చిత్రం తీసుకోండి. ఎవరైతే దానిని కొని, లేక సంపాదించి చదవడం, లేక చూడడం జరుగుతుందో అట్టి వారి యొక్క నైతిక ప్రవర్తనపై ప్రభావం చూపడం అనేది గీటురాయి. అంటే పరిణత మనస్కులే కానక్కరలేదు. సామాన్య మానవులంతా ఆ లెక్క క్రిందకు వస్తారు. బడికి వెళ్ళే 14 ఏళ్ళ బాలిక కావచ్చు; లేక యవ్వనంలో అడుగు పెడ్తున్న బాలుడు కావచ్చు. వారిపైన ఈ గ్రంథం, చిత్రంయొక్క ప్రభావమేమిటి? అనేది మీమాంస.

(3) ఆ చిత్రకారుడు, ఆ రచయిత యొక్క ఉద్దేశ్యముతో నిమిత్తం లేదు నేరారోపణకు. అలాగే ఆ పుస్తకం లేక చిత్తరువు ఇతరుల నైతిక పతనానికి దారితీస్తుందనే స్పృహ, జ్ఞానంకూడా ఆ గ్రంథకర్తకు, ఆ చిత్ర కారునికీ ఉన్నదా? అనేది అనవసర విషయం. ఆ నేరం, వస్తువు ఆ ప్రభావాన్ని కలిగించేదిగా ఉన్నదా? లేదా? అనేదే చర్చనీయాంశం.

(4) అసభ్యమంటే సమాజంలో ఆనాటి నైతిక భావాలకు విరుద్ధమైనది; వ్యతిరేకమైనది.

ఈ నిర్వచనం, లేక ఈ భాష్యం అనేకలోపాలతో నిండి నిబిడీకృతమయింది. దాని వివరణ ఇలా స్థూలంగా చెప్పుకోవచ్చు.

(1) సమాజం మారుతున్నది. నీతి దేశకాల పరిస్థితులనుబట్టి ఉంటుంది. ఒక సమాజంలోని నీతి, మరొక సమాజంలో అవినీతి. ద్రౌపదికి 5 గురు భర్తలు. ఒకనాడు సభ్య సమాజంయొక్క ఆమోదం పొందింది. మరి ఈనాడు అంగీకరించటం లేదుకదా! దేశాచారాలు వేరు వేరుగా ఉంటైకదా! భార్య చెల్లెలిని నిషేధిస్తూ వివాహమాడరు ఇంగ్లండులో. అక్క చనిపోతే చెల్లెలిని ఇచ్చి పెండ్లి చేస్తారు భారత దేశంలో. మేనరికం నిషిద్ధం ఉత్తర భారతదేశంలో; తెలుగునాట అది అభిలషణీ

ప్రశ్నార్థము. శృంగారం పేరుతో ఆమోదించినది మరో దృష్టితో అసభ్య మౌతున్నది. సౌందర్యాసక్తి ప్రతిమానవుడిలోనూ ఉన్నది. సత్యం-శివం-సుందరం మనధ్యేయాలు కాదా! కాగా సౌందర్యారాధన ఎక్కడ అంత మవుతున్నది? నైతిక పతనం ఎక్కడ ప్రారంభ మవుతున్నది? ఇది మళ్ళీ చర్చనీయాంశం. ఉదాహరణకు నగ్న స్త్రీ చిత్రం కన్నా అర్ధనగ్న స్త్రీ చిత్రం ప్రమాదకరంగా భావించవచ్చు. ఆ శారీరక ఒయ్యారంలో, ఆభంగిమలో మానవుని ఉద్రేకపరిచే లక్షణాలు ఉండవచ్చు. కొంతమందికి కొన్ని మాటలు వింటేనే వుద్రేకం వస్తుంది. బూతుమాట వింటే వుద్రేక పడిపోతారు నాగరీకులుగా చలామణి అయ్యేవారు. పాటకజనం రోజూ ఆ బూతు పదాన్ని వాడుతున్నారు. వారికి ఆ పదం వింటే వుద్రేకం రావటంలేదు. కనుక పదాలుకాని, చిత్రాలు కాని ఎవరిపై ప్రభావం చూపుతున్నాయి? అనేది మరోఅంశం. సామాన్య మానవునిపై అభిప్రాయం. అంటే సామాన్య మానవుని స్వరూప స్వభావాలు ఎట్టివి అనేది మరో తగాదా ప్రశ్న.

ఇంతకూ ఎవరు నిర్ణయించాలి ఏది అసభ్యమో ఏది కాదో? న్యాయ మూర్తి, లేక పౌరులతో కూడిన "జూరీ" యా, లేక విద్యావేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలు, మానసిక శాస్త్రజ్ఞులు, సంఘ సేవకులూ వీరా? నేరం అయితే జడ్జి లేక జూరీయో నిర్ణయిస్తారు. రుగ్మతగా భావిస్తే ఇతరత్రా పేర్కొన బడ్డవారు నిర్ధారణ చేయాలి.

అసభ్యతను నేరంగా పరిగణిస్తే అలాంటి నేరాలను అరికట్టగల శక్తి, ఆ చట్టాన్ని అమలు పరచగల సత్తా సమాజానికి ఉందా? ఆ చట్టాన్ని అమలు పరచలేకపోతే ఎక్కువ చెడు కల్గుతుందా? లేక అసలు చట్టమే లేకపోతే ఎక్కువ చెడు కల్గుతుందా? ఇపుడు దేశ పరిపాలన చేస్తున్న వారి శీలం, సత్తా, గుర్తించకుండా మనం వారికి ఆ అధికారం కట్టబెట్టటం మంచిదేనా ?

సమాజంలోని వుత్తమ పౌరులకు, నిపుణులకు అసభ్యతను పోగొట్టే, బాధ్యతను అప్పగించాలా లేక పోలీసు వారికీ లేక పరిపాలకులకు ఆ విధి నిర్వహణ కేటాయించాలా అనే విషయం అంత తేలికగా నిర్ణయించ దగదు.

విద్య, ప్రబోధం వాటివల్లనే దానిని రూపు మాపగలమా లేక కోర్టులు, పోలీసులు, పరిపాలకులు వారి సహాయం అపేక్షణీయమా? ఈ ప్రశ్నకు సమాధానం విధిగా ఇవ్వాలి.

మత విషయకమైన అసభ్యతను అంగీకరిస్తాం. 'శిష్టులు' అనబడే వారు సంస్కృతంలో బూతును అధ్యయనం చేయవచ్చు. ఉదా॥ అష్ట పదులు, స్తోత్రమంత్రాలు అశ్లీల రహితం అని అనడం భావ్యమేనా? ఆది దంపతులుగా చలామణి అయ్యే దైవ స్వరూపులుగా పుటంకించబడే శివపార్వతుల కాముక క్రీడలను కుమార సంభవంలో కాళిదాసు వర్ణిస్తే శృంగార రసాస్వాదన చేయవచ్చా? దైవ స్వరూపమైన స్త్రీ మూర్తిని స్తోత్రం చేస్తూ ఆమె అంగాంగ వర్ణన ఔచిత్యమా? ఇలా ఎన్నో ప్రశ్నలు; ఎన్నో శంకలు. పైగా అనేక మతాలు, విభిన్న సంస్కృతులు - పెక్కు భాషలు, సంభాషణారీతులు వున్న ఈ దేశంలో ఒకే అంశాన్ని గిటురాయిగా తీసుకోవడం సంభవమా? న్యాయమా? సమంజసమా? ఈ ప్రశ్నలకు సమాధానాలు రావాలి.

ఇక పోతే మోడల్సు, సేల్సుగరల్సు, ఎయిర్ హోస్టెస్‌లు. వీరు అందంగా అలకరించు కుంటారు. వారి అందం కొనుగోలు దార్లను, ప్రయాణీకుల్ని ఆకర్షిస్తుందని వారికి ఉద్యోగాలిస్తున్నారు. కొన్ని సందర్భాలలో వారికి కొన్ని ఇక్కట్లు కలుగుతున్నాయి. విమానంలోని ఎయిర్ హోస్టెస్ వివాహ మాడితే వుద్యోగంనుండి తొలగిస్తామని విమాన సంస్థ లంటే వాళ్లు సుప్రీంకోర్టుకు వెళ్ళారు. యజమాని మంచి వాడు కాకపోతే సేల్సుగరల్సుకు ఇబ్బందులు ఎదురవుతాయి. మోడల్సు రెండు రకాలవారు - దుస్తులను ప్రదర్శించేవారు, చిత్రకారులకు నమూనాగా వుండేవారు. రెండవ వర్గంవారిని కొంతమంది దుర్నీతి పరులైన చిత్రకారులు లైంగికంగా వాడుకునే అవకాశం లేకపోలేదు. కాగా వుద్యోగినుల పై పెత్తనం సాగించే దుర్నీతిపరులైన పురుషులు వున్నంతకాలం ఈ బాధలు తప్పవు. అంత మాత్రంచేత ఈ వృత్తులను స్త్రీలు చేపట్టరాదనడం పొర పాటేమో! సేల్సుగరల్సు, ఎయిర్ హోస్టెస్‌లు అంగాంగ ప్రదర్శన చేయ నవసరంలేదు; చేయరు కూడాను. అందంగా వుండడం దోషంకాదు;

ఆకర్షణీయంగా అలంకరించు కోవడం నేరంకాదు; అందాన్ని, ఆకర్షణను తృణీకరించవలసిన అవసరంలేదు. ప్రతి అందమైన మహిళను, ఆకర్షణీయమైన స్త్రీని మగవాడు తన దాంపత్య సుఖానికోసం కోరుకుంటాడని, అంతటితో ఊరుకోక ఆ తరుణులపై అత్యాచారానికి పూనుకుంటాడని భావించడం సబబుకాదు.

స్త్రీలు పై చెప్పిన ఉద్యోగాలను చేయపూనంటంలో తప్పేమీలేదు. కాగా, వ్యక్తిత్వాన్ని, ఆత్మ గౌరవాన్ని నిలబెట్టుకోవడం ఆవ్యక్తిపై ఆధారపడుతుంది. అంతే కాని వృత్తిపై ఆధారపడుతుందను కోవడం భ్రమ. కనుక, ఏది అశ్లీలం, ఏది శీలం, ఏది తప్పు, ఏది ఒప్పు అని తేల్చేదానికి గీటురాయి సహేతుకత. యువతీ యువకుల కామ ప్రవృత్తిని ప్రకోపింపచేయని, సమాజానికి, మూడో వ్యక్తికి అన్యాయం జరగని రీతిలో మాత్రమే మనం నడుచుకోవాలి. అది మన కర్తవ్యం.

(ప్రత్యేక వ్యాసం)

---

# పెరుగుతున్న ధరలు కరుగుతున్న బ్రతుకులు

ధరలు ఆకాశానికి లేస్తున్నాయి; బ్రతుకులు పాతాళానికి క్రుంగుతున్నై. జనాభాలో 69% బీదరికపు రేఖకు దిగువలోనున్న ఈదేశంలో, సగటు తలసరిఆదాయం 39 రూ. లున్న ఈ సమాజంలో రేపు అనేదొక పెనుభూతమై దినదిన గండంగా మారుతోంది. ముఖ్యంగా గృహిణులు బిడ్డలకు అవసరమైన ఆహారం, విద్య, వైద్యం ఇవ్వలేక కలవర పడుతున్నారు. 80% ఆహారానికే ఖర్చు అవుతోంది. విద్యకు ఖర్చు పెట్టలేని కారణాన విద్యాస్థాయి పెరగటం లేదు. దిన బత్యానికై తమ చిన్నల్ని సైతం గొడ్డు చాకిరీకి పంపి కన్నీటితో దుఃఖాన్ని దిగమ్రింగుతున్నారు. గర్భిణీ స్త్రీలకు సైతం పాలు, గ్రుడ్లు ఊహాతీతం అని చెప్పవచ్చు. రక్తమాంసాలు

(5) ముఖ్యమైన పరిశ్రమలు, వ్యాపారాలు చాలా భాగం పెట్టుబడిదారులచేతే నడప బడడం వల్ల వారి దృష్టిఅంతా లాభాల మీదే వుంటుంది. ప్రజా అవసరాలు, ప్రజా సమస్యలు వారు పట్టించుకోరు; దానివల్ల ధరలు పెరుగుతై.

(6) ముడి సరుకు ధర, కూలీల వేతనం పావలా పెరిగితేచాలు-ఆసాకుతో ఇష్టమొచ్చినట్లు ధరలు పెంచుతారు వ్యాపారులు.

(7) నిత్యావసర వస్తువులపై అశ్రద్ధచేసి వాటి వుత్పత్తి తగ్గినందు వల్ల వాటి ధరలు పెరిగినై.

(8) పన్నులు వేస్తున్నారు; విదేశాలనుంచి అప్పులు తెస్తున్నారు; మన ప్రజలనుండి పొదుపుద్వారా, అప్పుద్వారా డబ్బు తెస్తోంది ప్రభుత్వం. ఇంత చేసినా 1966 నాటి రూపాయి విలువ ఈనాడు 10 పైసల కన్నా తగ్గింది.

(8) సరుకు నిల్వచేసి అధిక లాభానికి అమ్మే వ్యాపారస్తుల వల్ల ధరలు పెరుగుతున్నయి.

(10) అధికారుల, పాలకుల లంచగొండితనంవల్ల ధరలు పెగుగుతై.

(11) చందాలుగా, విరాళాలుగా అధికార్లకు, పరిపాలకులకు వారి రాజకీయ పార్టీలకు అందజేయడం జరుగుతోంది. ఇది చాలక పెద్ద మొత్తాలే లంచాలుగా ముడుతున్నాయి. ఈ డబ్బంతా వ్యాపారస్తుడు ధరలను పెంచి రాబట్టు కుంటాడు.

(12) ప్రతి బడ్జెట్‌లోను దిగుమతి పన్ను, ఎక్సయిజు పన్ను, అమ్మకం పన్నులు పెంచటం వల్ల ధరలు పెరుగుతాయి. ముఖ్యమైనది లోటు బడ్జటు. 1530 కోట్ల రూపాలయుకు పెరిగింది. ఆలోటును నోట్ల ద్వారా ముద్రవేస్తారు. అందువల్ల రూపాయి విలువ తగ్గి ఇంకా ధరలు పెరుగుతై.

పన్నుల విధానం క్రమంగా లేదు. టాక్సుమీద సర్ చార్జి, దానిమీద సూపర్ టాక్సు, ఆర్డినెన్సు ద్వారా సప్లిమెంటు బడ్జటు వేస్తారు. మొదట్లో

అరబ్బులు పెట్రోలు లీటరుకు 10 పైసలు పెంచితే రూపాయి పన్ను వేసి 1-10 పెంచింది ప్రభుత్వం. అరబ్బువారు మూడుసార్లు పెంచినా 70 పైసల కన్నా పెరగలేదు అయినా లీటరు 5-60 అమ్మటం జరుగులోంది ఈనాడు.

నల్లధన రాక్షసి ప్రజల్ని పీల్చి పిప్పిచేస్తోంది. నల్లధనం వున్నవాళ్ళు ఎంతైనా పెట్టి కొంటారు. అందువల్ల ధరలు పెరుగుతై అసలు నల్లధవం ఎలా ఏర్పడుతుంది? అంటే పన్నులు చెల్లించకుండా దొంగ లెక్కలు వ్రాసి కూడాబెడతారు నల్లధనం ఈ రోజున 7000 కోట్ల రూపాయల్లో వుందని తేలింది. లంచాలు, పన్నుల ఎగవేతే దీనికి కారణం. లంచగొండి తనానికి, బ్లాకుమార్కెట్‌కి, పన్నుల ఎగవేతకు, అక్రమ నిల్వలకు అవినాభావ సంబంధముంది. వీటివల్లే ధరలు విపరీతంగా పెరుగుతున్నై. వ్యాపారస్తులకు, పారిశ్రామికులకే మొగ్గు చూపిస్తుంది. కాని, ధాన్యోత్పత్తి దారైన రైతు శ్రేయస్సు కోరదు. రైతుకు గిట్టుబాటుధర నిర్ణయించటంలేదు ప్రభుత్వం. అందువల్ల ధనిక రైసుమిల్లు యజమానులు ఆహారవస్తువులు నిల్వచేసి, కొరత సృష్టించి అధిక ధరలకు అమ్ముతున్నారు. ఇలా అనేక కారణాలవల్ల పెరిగిన ధరలను ఎలా అరికట్టాలి?

ధరలను అదుపులో పెడతామనే ప్రభుత్వ ప్రచారం. డంబాచార ప్రతిజ్ఞలను చేసే అధికారులను ప్రజలీనాడు నమ్మే పరిస్థితిలోలేరు. కనుక బందిపోటు దోపిడీలాంటి వ్యాపారస్తుల బారినుండి, దొంగ వ్యాపారుల బారినుండి విముక్తి సాధనకై ప్రజలే సిద్ధపడాలి. ఈ బృహత్ కార్యానికి జాతి యావత్తూ సమిష్టిగా కృషి చెయ్యాలి. దానికై మార్గాన్వేషణ; సూచనలు:

(1) నిత్యావసర వస్తువులపై సేల్సుటాక్సు, ఎక్సయిజు పన్ను ప్రభుత్వ వరంగా తగ్గించాలి.

(2) లోటుబడ్జెటు విధానానికి స్వస్తి చెప్పాలి. 10 వేల కోట్లు చలామణీలో వున్నై. అవికాక అదనంగా 7 వేలకోట్లు వేస్తున్నారు. అవి అచ్చు వేయుటం మానాలి.

(3) వ్యవసాయం, కుటీర పరిశ్రమలకు, చిన్న పరిశ్రమలకు ప్రాధాన్య మివ్వాలి. భారీ పరిశ్రమలకు తర్వాత అవకాశ మివ్వాలి.

(4) ముఖ్యావసర వస్తువుల ఉత్పత్తి, సరఫరా ప్రభుత్వం బాధ్యత తీసుకొని ధరలను నిర్ణయించాలి. ప్రైవేటు వ్యాపారస్తులమీద ఆధార పడక ప్రత్యామ్నాయ దుకాణాలు పెట్టి సరకులను బట్వాడా చేస్తూ అధిక ధరలకు అమ్మరాదని వ్యాపారస్తులను శాసించాలి.

(5) వృత్తి నైపుణ్యం వల్ల వచ్చే సంపాదనపై పన్నులు తగ్గించి, ఆస్తులపై వచ్చే ఆదాయంపై పన్నులు పెంచాలి.

(6) నల్లడబ్బు వెలికి తియ్యాలి.

(7) వస్తూత్పత్తిని పెంచే ప్రణాళికలు కావాలి.

(8) పూర్వపు ఆస్తులవల్ల వచ్చే ఆదాయంపై హెచ్చుపన్ను వెయ్యాలి.

(9) హుండీలద్వారా, దేవాదాయ ధర్మాదాయ సంస్థలు డబ్బు సంపాదించటం మానాలి.

(10) కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు లోటు బడ్జెటు ప్రణాళికేతర వ్యయం తగ్గించాలి.

(11) చవక దుకాణాలు విరివిగా స్థాపించి, సబ్సిడీలతో ప్రజలకు వస్తువులను సమర్థవంతంగా అందజేయ్యాలి. సరకులను అన్యాక్రాంతంచేసినా వస్తువులను తూకాలలోమోసం చేసినా, కల్తీ చేసి అమ్మిన వార్ని కఠినంగా శిక్షించాలి. సుశిక్షితులూ, నిజాయితీ పరులూఅయిన వార్ని నియమించాలి.

(12) **రాజకీయ పార్టీలవారు:-** పార్టీలవారు రసీదు లేకుండా చందాలు పుచ్చుకోరాదు. నల్లధనం చందా రూపకంగా వసూలు చెయ్యటం మానేస్తే బ్లాకు మార్కెట్ దారులను కాపాడవలసిన దుస్థితి పోతుంది. కౌంటర్ ఫాయిల్‌మీద దస్కతు పెట్టించుకోవాలి.

(13) సిబ్బందిలో లంచగొండి తనం పోవాలంటే పరిపాలకులలో అవినీతి, లంచగొండి తనం పోవాలి.

(14) **ప్రజల పరంగా:-** ఫెయిర్ ప్రయిస్ షాపులు, సబ్సిడీలతో ధరలు తగ్గుతాయనుకొనుట భ్రమ; ప్రజలు ప్రత్యామ్నాయంగా వాడ వాడకు కోఆపరేటివ్ సొసైటీలు పెట్టుకోవాలి. తద్వారా హోల్‌సేల్ ద్వారా రైతునుండి కొని పంపిణీ చెయ్యాలి. అప్పుడు ధరలూ తగ్గుతై. దోపిడీ వ్యాపారం దెబ్బ తింటుంది. రైతుకూ లాభంవుంటుంది.

(15) ఉత్పత్తి దారుకి, వినియోగదారుకి మధ్య దళారీలు వున్నారు. దానికి ప్రత్యామ్నాయంగా ప్రజలు సంఘాలుగా చేరి కొనుగోలు అమ్మకం సాగిస్తే ధరల్లో చాలా తేడా వుంటుంది. అందుకు అవసరమైన ప్రజల్లో సహకార స్వభావం పెంచుకోవాలి.

(16) ప్రజలుకూడా అవినీతి పరుడు తమ బంధువైతే పూరుకోవటం మానుకోవాలి. కులం, వంశం, ప్రాంతం పేరుతో అవినీతి పరుణ్ణి రక్షించరాదు.

(17) ప్రజల్లో నీతి, ఐకమత్యం కావాలి, పరిపాలకులను, అవినీతి పరుల్ని, అధికారులను అదుపులో పెట్టగల సత్తా రావాలి. వ్యాపారస్తుణ్ణి లొంగదియ్యటానికి ఉద్యమం-అంటే అక్రమంగా పెంచిన ధరలకు కొనబో మనిసమ్మె చెయ్యాలి. ప్రజల్లో సహకార భావం వుంటే ఏ పనీ కష్టతరం కాదు.

ప్రస్తుతమున్న సామాజిక వ్యవస్థలో ప్రభుత్వం, రాజకీయ పార్టీలు, ప్రజలు చెయాల్సిన పనులు నిర్ణయింప బడిన తర్వాత ధరలను అదుపులో పెట్టే కార్యక్రమం ఎవరితో సాగించాలనేది ముఖ్యాంశం: ప్రభుత్వాన్ని అధికార రాజకీయ పార్టీ శాసిస్తుంది. రాజకీయ పార్టీకి మద్దతు ఇవ్వడం ద్వారా సిద్ధాంతరీత్యా రాజకీయ పార్టీ స్వభావాన్ని, ప్రభావాన్ని ప్రజలు నిర్ణయిస్తారు. ప్రజల మద్దతు లేనిదే ఏ రాజకీయ పార్టీ మన జాలదు. కనుక ప్రజలు చేపట్టే కార్యక్రమాలకే అత్యంత ప్రాధాన్యత ఇవ్వాలి. ప్రజలకు సామాజిక స్థితి యొక్క అవగాహన, రాజకీయ విజ్ఞత అవసరం. ప్రజలు చైతన్య వంతులై సంఘటిత శక్తితో కార్యక్రమాలు, శక్తి వంతమైన చర్యలు తీసుకున్నప్పుడే నిజాయితీగల రాజకీయ పార్టీలు పరిశుద్ధ వర్తనంగల ప్రభుత్వాలు ఏర్పడతాయి. అప్పుడుగాని ఫలితం లభించదు.

(ఆంధ్రజ్యోతి దినన పత్రిక 1965)

# "ఇది నా సమస్య"

ప్ర. మేమిద్దరం గాఢంగా ప్రేమించుకున్నాం. అతను నన్ను విడిచి వుండలేని పరిస్థితిగా వుంది. నాకూ అతనంటే ఇష్టమే. అతనికి భార్యవుంది. ఆమె రోజూ నన్ను తిట్టిపోస్తుంది: "మా అయనే దొరికాడా! నా కొంప కూల్చటానికి" అని దుమ్మెత్తి పోస్తోంది. అతను నన్నే పెండ్లాడుతానని, ప్రాణాలతో వదలనని బెదిరిస్తున్నాడు, వేరే అతన్ని పెండ్లాడటానికి నేను భయపడుతున్నా. దారీ తెన్నూ తోచనినాకు మీ సలహా ఏమిటి?

జ. అమ్మా, మీరు ఆ అబ్బాయిని ప్రేమించానని అంటున్నారు. అతను కూడా మిమ్మల్ని ప్రేమించాడని వ్రాశారు. ఇక్కడ నేను మీకు ఒక మాట చెప్పాలి. ప్రేమించటం అంటే ఏమిటి? అనే దానికి మీరు మీ మనస్సులో తర్క వితర్కాలు చేసుకోవాలి. కామం, మోహం, ప్రేమ ఈ మూడూ వేరు వేరు. ప్రేమవున్నచోట కామం, మోహం వుండొచ్చుకాని మోహం మాత్రమే వున్న పరిస్థితులలో ప్రేమ విధిగా వుండాల్సిన అవసరం లేదు. అలాగే కామం మాత్రమే వున్నప్పుడు మోహానికి, ప్రేమకు అవసరం లేక పోవచ్చు. కామమంటే స్త్రీ పురుషులకుండే లైంగిక ఆకర్షణ అని చెప్పుకోవచ్చు. ఒక అబ్బాయి లేక అమ్మాయి ముఖం ఆకర్షణీయంగా వుందనో, చిరునవ్వు హాయిని చేకూరుస్తుందనో కట్టు బొట్టు చక్కగా వున్నయ్యనో ఇలా ఏదో ఒక కారణంగానే అవతలి మనిషిపై అభిమానం పెరిగితే దాన్ని మోహం అంటాం. ఈ మూడింటిలో ప్రేమ చాలా గొప్పది. అవతలి మనిషి గుణగణాలు, సంస్కారం ప్రేమ విషయంగా పరిగణిస్తాం. అవతలి మనిషిని అర్థం చేసుకోవడం, ఆ మనిషి చేసేపని తన కిష్టంలేక పోయినా పరులకు హాని కల్గించనప్పుడు సహించటం, సమానహోదాలో చూడటం, గౌరవించటం, అభిమానించటం, త్యాగం చెయ్యటం ఇవన్నీ ప్రేమఫలితాలు. కనుక తేలిందేమంటే ప్రేమ అంత తేలికైన విషయంకాదు. ఇద్దరు ప్రేమించుకున్నామని చెప్పుకుంటే చాలదు. నిజంగా ప్రేమ

లక్షణాలున్నయ్యా? లేవా? అని చూచుకోవాలి. ఇంతగా ఆలోచించి నేను అవతలి వ్యక్తిని ప్రేమిస్తున్నానా, లేదా? అనే విషయాన్ని స్పష్టంగా నిర్ణయించుకోవాలి. ఇంతకూ అవతలి మనిషి కూడా ప్రేమించాలిగా! ఆ అబ్బాయి తన భార్యనూ ప్రేమిస్తూ, మిమ్మల్ని ప్రేమిస్తున్నాడంటే తికమక వున్నదన్న మాట. ప్రేయసికి భార్య హోదా ఇవ్వలేనివాడు, ఇవ్వదలచనివాడు ప్రేమకు అనర్హుడు. అటువంటి వాణ్ణి దగ్గరకు చేరనీయుటం మంచిది కాదు. అతడి స్వభావం మారేది కాదని తెల్సుకుంటే అతని లాలనను, బుజ్జగింపును. బ్రతిమిలాడటాన్ని, బెదిరింపులను సైతం ఖాతరు చెయ్యనక్కర లేదు. తదితర దుర్మార్గులతో ఎలా సంచరిస్తామో అలాగే సంచరించాలి. నిజంగా అతనికి మీమీద ప్రేమ వుంటే భార్యను వదిలేసి, విడాకులు పొంది మిమ్మల్ని పెండ్లి చేసుకోవాలి. ఈ పరీక్షకు అతను నిలవకపోతే మీరు అతన్ని వదిలేసి దూరంగా వుండాలి. నిబ్బరంగా ఆత్మ స్థయిర్యంతో బ్రతకాలి. అదికాక ఒక భార్యవున్న వాణ్ణి మీరు ప్రేమిస్తే ఆ స్త్రీ జీవితం దుఃఖ బాజనం అవుతుంది. అందువల్ల మీరు అతన్ని దూరం చేసుకొని మరో యువకుణ్ణి పెళ్ళాడి సుఖపడమని నా సలహా. అమ్మా! అర్ధమయిందా మీకు.

ప్ర. పట్టణాల్లో వుండి నేను ఇంగ్లీషు మీడియంలో బి. ఎ. చదివాను. నాకు చిన్నప్పటినుండి ఇంగ్లీషు పాటలు, నాట్యాలమీద చాలా ఇష్టం. కుటుంబం మంచిదని కర్ణాటక సంగీత వృత్తిగల వారికిచ్చి పెండ్లి చేశాడు నా తండ్రి. వాళ్ళు మంచివాళ్ళే. రోజంతా వాయిద్యాలతో మా ఇంట్లో ప్రశాంతత లేదు. మా బంధువు లింటికెళ్ళివున్నా, నాకు నిద్ర మాత్రలే శరణ్యాలయినై. నాకు జీవితంపై విరక్తిగా వుంది. మీ సలహా ఏమిటి?

జ. అమ్మా! మీ బాధనాకూ అర్థమయిందమ్మా! మీ సమస్యకు నేనిచ్చే తీర్పు మీరు కొంచెం సహనంతో విని అర్థం చేసుకోవాలి తల్లీ; మానవులలో రూపాలు గుణాలు ఎలా తేడాలుంటయ్యో అలాగే

అభిరుచులలో కూడా వైవిధ్యం వుంటుందమ్మా! ఒకరికి సంగీతంపై అభిరుచి వుంటే, మరొకరికి సాహిత్యంపైన, వేరొకరికి చిత్రలేఖనం పైన, ఇంకొకరికి నవలలు, కథలు, పత్రికలు చదువుకోవటంపైన ఆసక్తివుంటై. మీకు ఇంగ్లీషు పాటాలు నాట్యాలపై వెలలేని అనుభూతి వుందంటున్నారుకదా! అలాగే మీ కుటుంబ సభ్యులకు కర్ణాటక సంగీతంపై ఇష్టం వుండొచ్చు. అసలు సంగీతానికి దేశకాల పాత్రలుండవు తల్లీ! శశుర్వేత్తి పశుర్వేత్తి గానరసంఫణిః అన్నట్లు దీనికి ఈ బాణీ ఆబాణీ అనేవి లేవు. ఒక రకమైన లయను ఆస్వాదించగల మీరు మరోరకమైన గాన రసానుభూతిని కొంచెం నిబ్బరంతో గ్రహించ గలగాలి. ఈనాడు కర్ణాటక సంగీతంలోని మాధుర్యాన్ని దేశ దేశాల పౌరులూ విని ఆనందిస్తున్నారు గదా! చూడండమ్మా మన ఎం.ఎస్. సుబ్బులక్ష్మిగారిని U. N. O. వారుకూడా ఆహ్వానించి సంగీత సభలు పెట్టారు. ఆమె సంగీతానికి విదేశస్తులుకూడా తన్మయులైనారనేది మనకు తెలుసు. సంగీతాభిరుచి తెలియని వాళ్లం కూడా శంకరా భరణం సినిమా 3, 4 సార్లు చూచాంగదా? ఎందుకు? కనుక మీరు ముందుగా కర్ణాటక సంగీతంలో కొంత అభిరుచి చూపిస్తే మీకిష్టమైన పాశ్చాత్య సంగీతంపై వాళ్ళకు అభిలాష కలుగుతుంది. అలా ఒకరిని మరొకరు అర్థం చేసుకోటానికి ప్రయత్నించాలమ్మా. చికాకులు పెంచుకుంటే పెరుగుతై. తగ్గించుకుంటే తగ్గుతై. కర్ణాటక సంగీతం వాళ్ళ కుటుంబవృత్తి అయినప్పుడు వాళ్ళు మాత్రం ఏం చెయ్యగలరు. ఇలాంటి ముఖ్య విషయాల గురించి వివాహానికి పూర్వమే ఆలోచించి నిర్ణయించుకోవాలి. మీరు నిద్రమాత్రలు వాడినా, ఇల్లు విడిచి బైటికెళ్ళి కొంతకాలం గడిపినా ఈ సమస్య తీరదు. ఒకరి సంగీతాన్ని ఒకరు ఆస్వాదించ గలగడమే మీ సమస్యకు పరిష్కార మార్గం. దానికి ముందుగా మీరే మారాలని నా సలహా.

ప్ర. మాది కలిగిన కుటుంబం. నేను 10వ తరగతి వరకు చదివాను. పెద్ద చదువు చదివి వుద్యోగం చెయ్యాలని, సమాజసేవ చెయ్యాలని

తపించిపోతున్నా. ఆడదానివి నీకు చదువేమిటి అని పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు. నన్నేంచెయ్య మంటారండీ?

జ. ఆస్తివున్నా ఆడపిల్లకు చదువుకునే హక్కు, భర్తను ఎన్నుకునే హక్కు, ఉద్యోగం చేసే హక్కు లేకపోగా ఆమె సంపాదన డబ్బుమీద కూడా ఆమెకు ఏ హక్కులూ అసలే లేవమ్మా! కన్నీరు కారుస్తూ, మెకానికల్‌గా ప్రాణిస్తున్న మిషనులాగా మన స్త్రీలు మారిపోక తప్పటం లేదమ్మా. ఇది నాకష్టం, ఇది నాబాధ అని చెప్పుకునే అవకాశం లేని మూగ గొంతుకల కథలు ఎన్నెన్నో మరెన్నో వున్నాయి తల్లీ. ఆడది ఏదోవిధంగా నాటికీ, నేటికీ, మరోనాటికీ కట్టు బానిసలా మిగిలి పోతుందమ్మా. ఆమె ఇష్టా యిష్టాలకసలు విలువలేదు. ఇది తర తరాల స్త్రీల కన్నీటిగాథ తల్లీ. ఆమె జీవితానికి అనేక ఆంక్షలూ అడ్డంకులూ నిర్దేశింప బడ్డాయమ్మా. ఈ నాడు స్త్రీవిద్య బహుకొద్దిగా పెరిగింది. కాని గ్రామీణ స్త్రీలలో విద్య చాలా అధ్వాన్నంగా వుంది. ఈ పరిస్థితి మారటానికి స్త్రీలలో మార్పు రావాలి. అంటే స్త్రీలే ముందుగా మారాలి. ప్రతి తల్లీ తన కుమారునితోపాటు కుమార్తెను కూడా సమానంగా చూడగలగాలి. విద్య, వివాహాలలో ఆడపిల్లకు పూర్తి స్వేచ్ఛనివ్వాలి తల్లిదండ్రులు. ఇక మీవాళ్ళది చదివించగల కుటుంబం, స్తోమతు వున్న కుటుంబం. కట్నానికి, పెళ్ళి ఖర్చులకు వెచ్చించే డబ్బుతో మిమ్మల్ని చదివించమని పోరు పెట్టండి. మనం మంచిపని చేసేటప్పుడు సమాజం, తల్లిదండ్రులు, భర్తగారూ అర్థం చేసుకుంటే సరేసరి. లేదా సామదాన బేధాలు ప్రయోగించైనా మన జీవితాన్ని సార్థకం చేసుకోవాలి. విద్య వినయాన్ని, విజ్ఞానాన్ని సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రసాదిస్తూ; భుక్తి మార్గాన్ని చూపిస్తుంది. మీరు విద్య నార్జించటానికి తల్లిదండ్రులు ఇష్టపడని పక్షంలో సత్యాగ్రహం ద్వారానైనా సాధించటంలో తప్పు లేదని నా సలహా.

ప్ర. నాకు చిన్నప్పటినుండి కథలు, నవలలూ వ్రాయాలనే గొప్ప కోరిక వుండేది. మెట్రిక్ కొన్నిసార్లు ఫెయిల్ అయ్యాను. క్లాసు పుస్తకాలు చదువుతూనే వుంటాను. కథలు వ్రాస్తుంటే, నీ బ్రతుక్కు రచనలు

కూడానా అని మా అమ్మ తిడుతూ వుంటుంది. జీవితంపై నిరాశ పడుతోందండీ. నాకేదైనా సలహా ఇస్తారా!

జ. శారీరక బాధైనా మానసిక బాధైనా మరొకరితో చెప్పుకుంటే కొంత తగ్గుతుంది. అలాగే సంతోషం ఇతర్లతో పంచుకుంటే రెట్టింపవుతుంది. మానసిక వ్యధ గురించి ఆత్మీయులతో చెప్పుకోవటం తప్పుకాదు. సంస్కారు లెవరూ హేళన చెయ్యరు. కనుక భయపడాల్సింది లేదు. ఇకపోతే విద్యార్థిగ్గానే వుండాలి. క్రొత్త విషయాలు తెలుసు కోవాలి. తను మానసికంగా ఎదగాలి. క్లాసు పుస్తకాలు మాత్రమే చదివితే జీవితం అర్థంకాదు. అనేక ఇతర పుస్తకాలు చదవాలి. మంచి కథ, కథానిక వ్రాయటం అంత తేలిక కాదు. సునిశితమైన దృష్టి, హృదయస్పందన, కథా శిల్పం, సాహిత్య పరిచయం, భాషాసంపద, అన్నింటికి మించి వేదన ఇలా ఎన్నో కావాలి రచయిత కావటానికి. దీనికి శిక్షణ, పరిశ్రమ, జీవితానుభవం కూడా అవసరం. ముందు అర్హత సంపాదించుకుని తర్వాత దేన్నయినా ఆశించాలి. ఈ లక్షణాలు అలవర్చుకుంటే మొదట్లో పరాజయం కల్గినా చివంకు జయుంలభిస్తుంది. మీరు అనవసరంగా నిరాశచెందవద్దు. విద్యార్థులు క్లాసు పుస్తకాలు చదవటంతోనే చాలదు. బాగా ఆకళింపు చేసుకొని వ్రాయగల్గటం చాలా అవసరమని నా సలహా. అప్పుడిక ఓటమి వుండబోదు.

ప్ర. నాకు 5 గురు మగపిల్లలు పుట్టారు. కట్నంతీసుకోకుండా వారి పెళ్లిళ్లు చేయాలని నాకోరిక. కట్నం వొద్దన్న నా పిల్లలకేదో లోప ముందని ప్రచారం సాగిస్తున్నారు మాగ్రామస్తులు. నేను వాళ్ళ మధ్య బ్రతకలేకుండా వున్నా. నాకేదన్నా ఉపాయం చెప్తారా?

జ. అమ్మా మీత్యాగానికి నిజంగా ధన్యవాదాలు. కట్నాలకు బేరమాడుతూ మనుషుల రక్తమాంసాలను పీడించే వ్యక్తుల మధ్య మీరు నిజంగా త్యాగధనులు తల్లీ!

వరకట్నం తీసుకోవడం, వద్దనటం ఒక నైతిక సమస్య. అలాంటప్పుడు ఎవరేమనుకున్నా మనం భయపడకూడదు. కట్నాలు తీసుకోకుండా

పెండ్లాడే యువకులనేలున్నారు. మీరు వారి జాబితాలో మీ బిడ్డల్ని కూడా చేర్చాలి. సమాజం మారుతోంది. కట్నం తీసుకోని వారిని హర్షించే రోజులొస్తున్నై. కాకపోతే మారుమూల గ్రామాల్లో, తెలియనివారు అది లోపంగా భావించవచ్చు. ఇరుగు పొరుగు వారిమాటలు మనం లెక్కచెయ్యరాదు. ఇంతకూ మీకు కూతుళ్ళు లేరుకనుక మీకు ఏబాధా వుండదు. ధైర్యంగా ముందడుగు వెయ్యవచ్చు. ఇది విలువల విప్లవమా అన్నట్లు ఈనాడు సామాజిక విలువలు మారుతున్నై. సమాజాన్ని గూర్చి అసలే భయపడ నక్కరలేదు. మనంచేసే పని నీతివంతమయినదా ? కాదా? అనే దానిని ప్రప్రథమంగా ఆలోచించి పురోగమించాలి.

ప్ర. నేను బి. ఎ. పాసై 3 సం॥రాలు అయిందండీ. నేను ఉద్యోగంలో చేరి నా కాళ్ళమీద నిలబడాలని తపిస్తున్నాను. మనోవ్యథకు గురై పిచ్చిపట్టేలా వుంది. ఇల్లువిడిచి మఠాలలో ఆశ్రయం పొందాలని వుందండీ: మీరు సలహా ఏమైనా ఇవ్వగలరా?

జ. అమ్మా మీ సమస్య గురించి చెప్పాలంటే, అర్హత వున్నా, ఈ నాడు మన సమాజంలో అందరికీ మొదట్లో పెద్ద వుద్యోగాలు దొరకవు. నిరుద్యోగం విలయ తాండవంచేస్తున్న ఈ కాలంలో ఊరికే కాలక్షేపం చేసేకన్నా, ఏదో ఒక చిన్న వుద్యోగంలో చేరి సాయంత్రం కాలేజీలో **M. A.** చదువుకొని మెల్ల మెల్లగా వృద్ధిలోకి రావాలి గాని, నిరాశతో మఠాలలో ఆశ్రయం పొందాలనుకోవటం పొరపాటు. ఆత్మస్థయిర్యం, పట్టుదల వుంటే మనం సాధించ లేనిది లేదని నా అభిప్రాయం.

ప్ర. నాకు నల్గురు మగబిడ్డలు. అష్టకష్టాలుపడి పెద్దవారిని చేశా. వాళ్ళు ప్రయోజకులైనారు. భార్యలతో సరదాగా సంతోషంగా వుంటారు. నన్ను మాత్రం నేనింకా చావలేదని తిడుతూ వుంటారు. చావనన్నా వద్దామంటే అది దూరమవుతోంది. మీరేం సలహా చెప్తారమ్మా. చదువుకోని నేను తప్పులతో వుత్తరం వ్రాశాను మన్నించండి.

జ. అమ్మా! ఈ సమస్య అన్ని దేశాలలో, అన్ని కాలాలలో వున్నదే- దీనికి పరిష్కార మార్గం అంత సులువైనదికాదు. ముఖ్యమైనదే

మంటే బిడ్డలు తమ భార్యలపైన, తమ కుటుంబాలమీద అభిమానం చూపడం ప్రకృతి ధర్మమేననే విషయాన్ని తల్లి దండ్రులు గ్రహించాలి. పిల్లల్ని పెంచి విద్యా బుద్ధులు నేర్పించడం ఏదో త్యాగంగా కాక మన విధ్యుక్త ధర్మంగా, విధిగా చెయ్యాల్సిన పనిగా తల్లి దండ్రులు తెల్సుకోవాలి. బిడ్డలు తమకు సేవచేస్తారు. చెయ్యాలి అని ఆశించడం పొరపాటు. కాకపోతే బుద్ధిమంతులు, గుణవంతులైన పిల్లలు తల్లులను గౌరవించి సేవచేస్తారు. కాలం మారుతున్నప్పుడు ఆచారాలు, అలవాట్లు అన్నీ మారతై. తల్లి తనకు ఓపిక వున్న రోజుల్లో తన భర్త బ్రతికున్నప్పుడు తనకు జరిగినట్లు జరగాలంటే జరగవు. కాగా వృద్ధాప్యదశకు చేరుకునేలోగా దానికి అనుగుణంగా మనస్సును తయారు చేసుకోవాలి, పదిమందికీ ఉపయోగపడే ఇతర వ్యాపకాలమీదికి మనం మనసును మళ్ళించుకోవాలి. అదిగాక అడ్డాలనాటి బిడ్డల్లాకాక ఎదిగిన పిల్లల్ని స్నేహితుల్లా చూడగలిగితే మనకు సగం సమస్యలు తీరగలవు. పాశ్చాత్యులు వృద్ధాప్యదశను గురించి యువ్వన దశలోనే ఆలోచించి ఎలాగడపాలో నిర్ణయించు కుంటారు. ధనం వగైరా నిల్వ చేసుకుంటారు. ప్రభుత్వంవల్ల కూడా కొంత సహాయం పొందగల్గు తున్నారు. మన ఆలోచనలు, మన సమాజం మన పరిస్థితులు చాలా వేరుగా వుంటై. కనుక అన్ని కుటుంబాలలో వార్ధక్యదశ హృదయ విదారకంగా పరిణమిస్తోంది. ప్రజలూ, ప్రభుత్వమూ కలిసి వృద్ధులకు నివాస గృహాలు, ఇతర సౌకర్యాల నిమిత్తం బహుముఖాల కృషి చెయ్యాలి. అదొక బృహత్తర పథకం కావాలి. ఇంతకూ మీరు పరిస్థితుల్ని ఆకళింపు చేసుకొని బిడ్డలకు అణకువగా మెలగుతూ కాలక్షేపం చెయ్యటంతప్ప మీకు గత్యంతరముండదని నా అభిప్రాయం. కాస్త ఓపికతో మీరు సహనం వహించండమ్మా.

ప్ర. తల్లి దండ్రులు మా బావతో వివాహం జరపాలని పట్టుదలతో వున్నారు. అతని అవసరానికి 4 వేలు ఇచ్చారు. ఇంకా ఇవ్వటానికి సిద్ధంగా వున్నారు. అతనంటే నా కిష్టమే. అతనికి నేనంటే ఇష్టం

# పిల్లల్లో వైజ్ఞానిక దృక్పథం

పిల్లల్లో వైజ్ఞానిక దృక్పథం ఎలా కల్గించాలి? అని చర్చించే ముందు అసలు విజ్ఞానం అంటే ఏమిటి? ఆ వైజ్ఞానిక ప్రభావం పిల్లల్లో ఎలా విస్తరింప జెయ్యాలి? పిల్లల మనస్తత్వం ఎలా వుంటుంది? వారడిగే ప్రశ్నలు, వారి ఆలోచనలు, వారి భావాలు ఏ పరిధిలో వుంటై? మన మూహించని ప్రశ్నలు వారడిగితే తల్లడిల్లిపోతామా? లేదా? కొన్ని సందర్భాలలో మన అజ్ఞానం బైటపడి చిన్నబోతాం కూడా. అంతేకాదు సిగ్గుపడక తప్పదేమో! ఆలోచిస్తే అసలు శాస్త్రీయ దృక్పథంగల తల్లిదండ్రు లెందరున్నారనేది మొదటి ప్రశ్న. తల్లుల నడవడి పిల్లలపై ప్రతిఫలిస్తుందా? ఉపాధ్యాయుల వివేకంవల్ల పిల్లలెలా ప్రభావితులౌతారు? అనే విషయాలు ముందుగా మనం గ్రహిస్తేనే పిల్లల్లో ఈ వైజ్ఞానిక విషయాలపై ఆసక్తి కల్గించగలం.

వైజ్ఞానిక దృక్పథమన్నా, శాస్త్రీయ దృక్పథమన్నా ఒకటే. విజ్ఞానం పనిచేసే తీరు తెన్నులను ఆకళింపు చేసుకోవడంలో ఒకరకమైన వైఖరిని వైజ్ఞానిక దృక్పథమని అంటాం. సైన్సు అనే ఇంగ్లీషు పదానికి పర్యాయ పదంగా విజ్ఞానం అనే పదాన్ని వాడుతున్నాం.

మన చుట్టూ ఉన్న ప్రకృతిని, సమాజాన్ని, సర్వప్రపంచాన్ని గురించి తెలుసుకోవాలనే ఆసక్తి మానవులందరికీ ఉంటుంది. వాస్తవాన్ని కనుగొనడానికి మానవుడు ఆసక్తి చూపిస్తాడు. ఒక సంఘటన జరిగినప్పుడు ఇది ఎలా జరిగింది? ఎందుకు జరిగింది అని ప్రశ్నించుకుంటాడు. అప్పటికి తనకున్న విషయ జ్ఞానాన్నిబట్టి బహుశ ఇందువల్ల జరిగి వుంటుందని ఊహించుకుంటాడు. ఈ వూహాధారం నిజమో, కాదో తెలుసుకోవాలని ప్రయత్నిస్తాడు. ప్రయోగం సాగిస్తాడు. ప్రయోగ ఫలితం తన ఊహాధారాన్ని వమ్ము చేస్తే ఆ ఊహను త్రోసిరాజంటాడు. మరో ఊహాధారంలో ప్రయోగం మరలా సాగిస్తాడు. తను చేసిన సూత్రీకరణ తర్కానికి, అనుభవానికి నిలవాలి. ఇది విజ్ఞానం పనిచేసే తీరు.

ఈ పద్ధతిని అన్ని సమస్యలను విడదీయటానికి వాడవచ్చును. తనకు తెలియని దానిని తెలియదని అంగీకరిస్తాడు వైజ్ఞానికుతు. అంతేగాని వివరించ జాలని, రుజువు పర్చజాలని వూహను వాస్తవమని నమ్మడు. అది సరియైన వైజ్ఞానిక పద్ధతి - ఉదాహరణకు పసుపు సున్నం కలిపితే ఎరుపవుతుంది, అనే సిద్ధాంతాన్ని ఏకాలంలో ఏసమయంలో ఎవరు చేసినా రుజువు కావాలి. అదే నిజమైన హేతుత్వం. ఎవరో చెప్పారు, వేదాల్లో వుందని నమ్మనిదే శాస్త్రీయ దృక్పథం. ప్రతిపిషయం తన అనుభవంలో రుజువు కావాలి. తర్కానికి నిలవాలి.

పిల్లల్లో వైజ్ఞానిక దృక్పథం కల్గించే మార్గాలు, పద్ధతులు విలక్షణంగా వుంటై. లేతమనస్సులలో మాయ మర్మాలెరుగని బిడ్డలు పరిసరాలనుబట్టి గ్రహిస్తారు. పరిస్థితులనుబట్టి అనుకరిస్తారు. ఆలోచిస్తారు. ప్రశ్నిస్తారు. ఆ ప్రశ్నలు చిత్రాతి చిత్రంగా వుంటై. నవ్వొస్తుంది. ఆశ్చర్యం కల్గుతుంది. అబ్బా! చెప్పలేమె అనిపిస్తుంది. విసుగొస్తుంది. వెంటబడి అడుగుతూనే వుంటారు. కొన్ని సమయాల్లో మనలో సైతం జిజ్ఞాస రేకెత్తుతుంది. అంటే మనకే తెలియదు. వాటికి సమాధానాలు చెప్పలేం. చెప్పలేక పరువు కోసం అబద్ధాలు, కల్పితాలు చెప్పేవారు లేకపోలేదు. కొన్ని రహస్యాలు వారికి చెప్పరాదని భావిస్తారు. "అమ్మా నేనెల పుట్టానమ్మా" అని అడుగుతుంది ఆరేళ్ళ బాలిక. అబ్బా! ఇది వింతకాలం, విపరీత బుద్ధులు. ఏంచెప్పాలబ్బా! తికమక పడే తల్లిని మళ్ళీ అదే ప్రశ్నించే బాలికపై వసపిట్టలా వాగుతూనే వుంటావని కసురుకుంటుంది తల్లి. నోరుమూసుకోమంటుంది. అది సరియైన పద్ధతికాదు. పిల్లల కుతూహలాన్ని చిదిమి పారెయ్యరాదు. వాస్తవమైన విషయాలు కప్పిపుచ్చరాదు. కల్పితాలు చెప్పరాదు. వారి మనోపరిధిని బట్టి, వారి వయస్సుకు తగ్గ రీతిలో విజ్ఞానాన్నందించాలి. చిన్నప్పటి నుండి దయ్యాలు, భూతాలు, పిశాచాలు లాంటి అవాస్తవిక విషయాలను కథల రూపంలో కూడా వారికి చెప్పరాదు. ఇవన్నీ ఆ చిన్నారి పాప మనస్సులో భయాందోళనలను సృష్టిస్తయి. అవి వారి భవిష్యత్ జీవితాన్ని వక్రమార్గాన్ని పట్టిస్తయి. పిల్లల నడవడి విషయమై కూడా మనం శ్రద్ధ వహించాలి. ఎప్పుడూ అబద్ధ మాడవద్దని పిల్లలకు చెప్పి తామే అబద్ధ మాడితే పెద్దలమీద పిల్లలకు గౌరవం నశిస్తుంది. ఉదారణ: ఒకసారి నేను

మా ప్రక్కింటావిడను జల్లెడ అడిగితే, అప్పుడు ఆమె మా ఇంట్లో లేదంది. తల్లి లేదంటుంటే విన్నది ఆ చిన్నారిపాప. మాయ మర్మాలెరుగని ఆ పిల్ల జల్లెడ తెచ్చి ఇచ్చినప్పుడు ఆ తల్లి పరిస్థితి ఒడ్డునపడ్డ చేపలా అయింది. ఇలాంటి సంఘటనలు కోకొల్లలుగా వుంటై. పిల్లలకు అబద్ధాలు, అశాస్త్రీయ పద్ధతులూ, పిల్ల చేతిలో పండుపెట్టి చాటుగా తోటి పిల్లలు చూడకుండా తినేయమనే తల్లులు లేకపోలేదు. పిల్లలు నీతిగా పెరగాలంటే, పెద్దలఎడ వారికి గౌరవము పొరాధన్న తల్లి దండ్రుల నడవడిలో చెప్పే దానికి, చేసేదానికి పొంతన వుండాలి. పిల్లలెదుట తల్లిదండ్రులు అస్త మానం పోట్లాడుకుంటూ వుంటే పిల్లల్లో పెద్దలపై విశ్వాసం సన్నగిల్లుతుంది.

పెరిగిన పిల్లల మనస్తత్వం మరోలా వుంటుంది. వారి ప్రశ్నలు గంభీరంగా వుంటై. మేఘాలు నల్లగా ఎందుకుంటై? సూర్యుడు తూర్పునే ఎందుకుదయిస్తాడు? నక్షత్రాలెందుకు పడిపోవు? సముద్రపునీరు ఉప్పగా ఎందుకుంటుంది? ఆకాశం నీలం, సూర్యుడు ఎరుపు, కొండలు నలుపు, నీళ్ళు తెలుపు ఎందుకుండాలి? పక్షులెగురుతై కదా? మరి మృగాలు, మనుష్యులు ఎందుకెగరరు? లాంటి ప్రశ్నలు ఎన్నైనా చెప్పేవాళ్ళుంటే అడుగుతూనే వుంటారు. కొన్ని ప్రశ్నలకు సమాధానాలు దొరుకుతై. కొన్నింటికి చెప్పలేరు పెద్దలు. అప్పుడు చికాకుపడి విసుక్కొనుటచే వారిలో జిజ్ఞాస నశిస్తుంది. మనం ఓర్పుతో, శాంతంతో తెలిసినవి చెప్పాలి. తెలియని విషయాలు విజ్ఞుల వద్ద తెలుసుకొని వాళ్ళతో చర్చించుట ద్వారా వాళ్ళలో ఆసక్తి పెరుగుతుంది. వారిలోని సహజ ప్రవృత్తులకు మనం దోహదంచేస్తే ఆ యా రంగాల్లో వారి విజ్ఞానం వికసిస్తుంది.

స్కూళ్ళల్లో పిల్లలు ఉపాధ్యాయుల్ని సైతం చిక్కు ప్రశ్నలేస్తారు. "రామరాజ్యంలో విధవలులేరు" అని పాఠం చెప్పిన తెలుగు మాష్టర్ని "వాళ్ళ తల్లులు ముగ్గురూ విధవలే కదండీ" అంటాడొక కొంటె విద్యార్థి. ఉగ్రుడవుతాడు మాష్టారు. పుక్కిటి పురాణాలు చెప్పే గురువుతో "సముద్రా నికి ఉడతలు ఆనకట్టకట్టడం, కోతులు దాటటం జరుగుతుందాండీ" అని ప్రశ్నించిన కుర్రాడిని నువ్వు నోరుమూసుకొని వింటావా? బైటకిపోతావా? అంటూ బెత్తం ఝుళిపిస్తాడు ఉపాధ్యాయుడు. ఇది అశాస్త్రీయ పద్ధతి.

వారికి నచ్చచెప్పేటట్లుగా తెలియజేయాలి. అంతేకాని అచ్చంగా నమ్మకం మీద ఆధారపడే సమాధానాలు చెప్పి విద్యార్థిని నమ్ముతావా లేదా? అని శాసించరాదు. విద్యార్థులలో జిజ్ఞాసను, సత్యాన్వేషణాసక్తిని పెంపొందించాలికాని నశింపు చేయరాదు.

శాస్త్రీయ దృక్పథాన్ని పిల్లల్లో కల్గించేందుకు ముందుగా తల్లి దండ్రులు, ఉపాధ్యాయులు, సమాజం శాస్త్రీయ పద్ధతిని గ్రహించి ఉండాలి. మూఢ విశ్వాసాలు నమ్మకాలు ఉన్న తల్లుల పెంపకం వల్ల పిల్లల భవిష్యత్తుకు ప్రమాదం. తాత చావటమంటే ఏమిటమ్మా? అన్న బాలుడితో ఇంకోలోకంలోకి వెళ్ళాడంటుంది. దేవునికి మ్రొక్కితే పరీక్ష పాసవుతావనీ, ఆరోగ్యం కల్గుతుందనీ, సిరి సంపదలుంటయ్యనీ బోధిస్తుంది. చిన్నప్పుడే వాళ్ళకు అవాస్తవిక విషయాలు చెప్పి వారి మనస్సులలో అలాంటి బీజాలు నాటుటచే జీవితమంతా అలాగే అజ్ఞానాంధకారంలో వుంటారు. అన్నిదేశాలు మన దేశంకన్నా తక్కువ అని చెప్తే, ఇతర దేశాలను ద్వేషిస్తాడు. అంటరాని వాడనే పదం వాడుతుంటే, అదే కుల మతాభిమానాలకు దారి తీస్తుంది. పిల్లలు గ్రహణం అంటే ఏమిటని ప్రశ్నిస్తే రాహు కేతువులనే రాక్షసులు సూర్యుణ్ణి మ్రింగి తర్వాత విడుస్తారు. అంతేగాక గ్రహణ స్నానం చెయ్యాలని, ఆ సమయంలో ఏమి తినరాదని, ఇంట్లో దర్భలుంచాలని, మంత్రాలు జపించాలని చెప్తారు. అలాకాక సూర్యుడి చుట్టూ భూమి తిరుగుతుందని, చంద్రుడు భూమిచుట్టూ తిరుగుతాడని ఆ సందర్భంలో భూమికి, సూర్యుడికి మధ్య చంద్రుడొచ్చినప్పుడు సూర్యుడు కనబడడు, అదే సూర్యగ్రహణమని చెప్పాలి.

విద్యావంతులు సైతం శిక్ష క్రింద పిల్లలను కొట్టుట, తిట్టుట, గెంటుట చేస్తూ వుంటారు. వారికి క్రూరమైన శిక్షలు వేసి దండిస్తుంటే అది మానసిక వైపరీత్యాలకు దారి తీస్తుంది. ప్రతి పని చెయ్యవద్దు అని చెప్పే బదులు వారికి అవసరాన్ని సహేతుకంగా వివరిస్తే వారిలో ఆలోచించే శక్తి పెరుగుతుంది విజ్ఞాన విషయాలు ఉదాహరణలతో వివరించి చెప్పాలి. అలా వివరిస్తే వారిలో ఆలోచించేశక్తి పెరుగుతుంది. పిల్లల పెంపకం ఎంతో జాగ్రత్తతో జరుగవలసిన పని. వారిలో హేతుత్వాన్ని పెంచాలన్నా వివేకవంతులుగా రూపొందించాలన్నా ముందు మనందరం

వైజ్ఞానిక దృక్పథాన్ని సంతరించుకొని అలాంటి వైఖరి వారికి కలిగేటట్లు చేయాలి. అది ముఖ్యకర్తవ్యం. భావిపౌరులు, దేశాభ్యుదయానికి జీవగఱ్ఱలు పిల్లలే కనుక వారిలో శాస్త్రీయ దృక్పథం కొరవడితే సమాజ ప్రగతికే అది గొడ్డలి పెట్టుగా పరిణమించే ప్రమాదముంది.

మరోసారి నొక్కి చెప్తున్నాను. పిల్లల పెంపకం ఎంతో జాగ్రత్తతో జరుగ వలసినపని. వారిలో హేతుత్వాన్ని పెంచాలన్నా, వారిని వివేక వంతులుగా రూపొందించాలన్నా ముందుగా మనందరం వైజ్ఞానిక దృక్పథాన్ని సంతరించుకొని అలాంటి వైఖరి వారికి కలిగేటట్లు చేయాలి. అది మన ముఖ్య కర్తవ్యం.

(ఆలిండియా రేడియో, హైదరాబాద్.)

---

# నిర్బంధ కుటుంబ నియంత్రణ అవసరమా?

మన దేశ జనాభా పెరిగిపోతున్నది. గత 15 సంవత్సరాలుగా కుటుంబనియంత్రణ కార్యక్రమాలు సాగిపోతున్నా, జనాభా పెరుగుదల రేటు హెచ్చుతూనే వున్నది. 1975 సంవత్సరాంతమునకు దేశ జన సంఖ్య 60 కోట్లు అవుతుందని అంచనా. పరిస్థితులు విషమిస్తున్నా కేంద్రప్రభుత్వం నిర్బంధంగా కుటుంబ నియంత్రణ అమలు జరపడానికి యింకా సుముఖత చూపటంలేదు. కాని రాష్ట్ర ప్రభుత్వాలు నిర్బంధ పద్ధతి కొంతవరకైనా ప్రవేశ పెట్టడానికి ముందుకు వస్తున్నాయి. అందులో పంజాబు రాష్ట్ర ప్రభుత్వం ముందంజ వేసింది. మహారాష్ట్ర ప్రభుత్వం కార్యాచరణతో కూడిన ఆసక్తి చూపుతున్నది.

వివిధ ప్రభుత్వాలు చేస్తున్న శాసనాలు, ఇంతవరకు చేపట్టిన కార్యక్రమాల వైఫల్యము లేక విజయము, ఇకముందు చేయవలసిన పనులు వీటిని గురించి ఆలోచించే ముందు అసలు సిద్ధాంతపరంగా నిర్బంధము ఉచితమా, కాదా? అని తేల్చుకోవలసి యున్నది. మనది ప్రజాస్వామిక దేశము కనుక మనము నిర్బంధ విధానాన్ని అనుసరించ

రాదనే వాదన కొంతకాలంగా సాగింది. ఆ వాదనలో కొంత బలం లేక పోలేదు. కాగా ప్రమాదం ముంచుకొస్తున్న తరుణంలో దేశ వనరులు జనాభా పెరుగుదలకు తగినట్లుగా చాలకపోవడంతో అటు ప్రభుత్వాలకు, యిటు శోచనీయమైన ఆర్థిక దుస్థితిలోవున్న కుటుంబాలకు, అత్యధిక సంతానాన్ని ఏటేటా కంటూ ఆరోగ్యం కోల్పోతున్న స్త్రీలోకానికి, తమ కన్నబిడ్డలకు, విద్యా వైద్య సౌకర్యాలు కల్పించుకోలేని తల్లిదండ్రులకు ఇది చాల గడ్డు సమస్యగా తయారయింది.

ఈ సమస్యా పరిష్కారం అత్యవసర పరిస్థితిగా పరిగణించ వలసి వచ్చింది. పరిస్థితులనుబట్టి సిద్ధాంతాలను పునః పరిశీలన చేసుకోవలసి వుంటుంది. అన్వయం చేసుకోవలసి వుంటుంది. పైగా నిర్బంధంగా కుటుంబ నియంత్రణ జరిపించటం, ఒకరకంగా ఆలోచిస్తే రాజ్యాంగ పరంగాకూడ తప్పుకాదు. రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాల ప్రకారం ప్రజల ఆరోగ్యాన్ని రక్షించ వలసిన భారం ప్రభుత్వంపై మోపబడింది. ప్రజలకు పోషకాహారము లభించేలా చేయాలని, జీవన ప్రమాణం పెంచాలని, ప్రజారోగ్యాన్ని అభివృద్ధి పరచాలని రాజ్యాంగం యొక్క 47 వ అధికరణం స్పష్టపరుస్తున్నది. సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయాలు విలసిల్లే సాంఘిక వ్యవస్థ నిర్మాణానికి దోహదం చేయుడం రాజ్యం యొక్క విధిగా రాజ్యాంగపు 38 వ సూత్రంలో పేర్కొన బడింది. ఇపుడున్న పెరుగుదల రేటుతో, అంటే సంవత్సరానికి 1 కోటి పదిలక్షల పై చిలుకు జనం మీద పడుతుంటే ఏ ప్రభుత్వం మాత్రం "వెన్వెంటనే" ప్రజలకు సాయపడగల్గుతుంది? పైన ఉదహరింపబడిన అవకాశాలను, సౌకర్యాలను ఒనగూర్చ గల్గుతుంది? సాధ్యంకాదని స్పష్టంగా తేలిపోయింది. ముస్లింలు కుటుంబ నియంత్రణను అమలు పరచటంలేదు. కనుక హిందువులు మాత్రమే అమలుపరిస్తే వారి సంఖ్య తగ్గిపోయి దేశ జనాభాలో వారు మైనారిటీ వర్గంగా రూపొందే ప్రమాద మున్నదని కొంతమంది ఛాందస హైందవులూ, తమ మతానికి కుటుంబ నియంత్రణ వ్యతిరేకమని ముస్లింలూ, యిలా యిరువురు పెద్ద జనాభాగల మతాలవారూ వైముఖ్యం చూపుతూ వచ్చారు యీ ప్రమాద నివారణకు. ఇకపోతే కార్మికులను కుటుంబ నియంత్రణను అవలబించమంటే యీనాటి పెట్టుబడిదారీ వ్యవస్థకు యెక్కడ

పరోక్షంగా మద్దతు యిచ్చిన వారమవుతామో అనే భయంతో, సంకోచంతో కమ్యూనిస్టులు యీ కార్యక్రమ విస్తరణకు సుముఖత చూపలేదు. కాగా వారి దృష్టి యిటీవల రాజకీయ పరిణామాల ఫలితంగా మారినట్లు కన్పడుతున్నది. తిరువనంతపురంలో ఫిబ్రవరి 11 వ తేదీన భారత కమ్యూనిస్టుపార్టీకి చెందిన ఇద్దరు ప్రముఖ పార్లమెంటు సభ్యులు సర్వశ్రీ భూపేష్‌గుప్త, ఇంద్రజిత్‌గుప్త భారీయెత్తున ప్రచారం మాత్రమే చేపట్టవలెననీ నిర్బంధ చర్యలను, శిక్షలను, జరిమానాలను విధించే శాసనాలను ప్రవేశ పెట్టవద్దనీ కేంద్ర ప్రభుత్వాన్ని అభ్యర్థించారు. కాగా, కుటుంబాలను పరిమితం చేసుకునేవారికి కొన్ని సౌకర్యాలను కల్పించవచ్చని సూచించారు. ఇది కొంతగా కొంత ముదావహమైన మార్పే. కాని అలవాటు ప్రకారం కాలానికి వెనుక నడిచే కమ్యూనిస్టు పార్టీవారు నిర్బంధ కుటుంబ నియంత్రణ కార్యక్రమానికి అభ్యంతరం తెలపడంలో ఆశ్చర్యం యిసుమంతయినా లేదు. 



మతవాదుల అభ్యంతరాలను ఇంతకాలము పరిగణనలోనికి తీసుకొని దేశాన్ని యింత అధోగతికి తీసుకొని రావడం జరిగింది. దురభిమానాలకు, అనుమానాలకు యిక తావులేదు. ఉనికికే ప్రమాదం సంభవిస్తున్న యీ తరుణంలో నైతిక సూత్రాలకు కూడా చెందని మత సూత్రాలను పాటించవలసిన అవసరంలేదు. ఇలాంటి నిర్బంధ చర్యలకు రాజ్యాంగంలో కూడ అవకాశమున్నది. రాజ్యాంగం యొక్క 25వ అధికరణము యీ అంశాన్ని విశద పరుస్తున్నది. మత స్వాతంత్ర్యము, భావ స్వాతంత్ర్యము మౌలిక హక్కులుగా గుర్తింపబడిన మాట వాస్తవమే. అయినా అవి నిర్నిబంధమైన హక్కులుకావు. ప్రజా భద్రత, నైతిక సూత్రాలు, ఆరోగ్యము అనే విషయాలకు లోబడి మాత్రమే పౌరుడు ఆ హక్కులను కోరగలడు, అనుభవించ గలడు. అంతేగాక ఆ సూత్రంలోని రెండవ భాగంలో చెప్పబడినట్లు సాంఘిక సంక్షేమము కొరకు, మతముతో ముడిపడి వున్న లౌకిక వ్యవహారమును నిర్దేశించుటకు, లేక నిర్ధారించుటకు, అదుపు చేయుటకు రాజ్యమునకు అధికారము కలదని నొక్కి వక్కాణింప బడినది. పిల్లలను కనడం లౌకిక వ్యవహారముకాక మరొకటి కాదుకదా! కనుక

చర్యలు తీసుకుంటున్నాయి ఆయాదేశ ప్రభుత్వాలు. ఇతర దేశాలలోని భారతీయులు చాలవరకు గెంటి వేయబడ్డారు. ఇలాంటి స్థితిలో తటవటా యింపు అనవసరం.

మహారాష్ట్ర శాసనసభలో ఫిబ్రవరినెల 8వ తేదీన ప్రసంగిస్తూ నిర్భంధ కుటుంబ నియంత్రణ అమలు జరుపులాగు 'బిల్లు'ను వచ్చే సమావేశంలో ప్రవేశ పెడతానని, పరిమిత కుటుంబాన్ని అతిక్రమించే వారికి జరిమానాలు శిక్షలుకూడా వుంటాయని మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎస్. బి. చవాన్ ప్రకటించారు. శ్రీ సత్యసాయిబాబా భక్తుడై కూడా యింత గట్టిగా ఆలోచించడం సంతోష దాయకమే.

పంజాబు ఆరోగ్యశాఖా మంత్రి జనాభా పెరుగుదల అరికట్టటానికి ప్రప్రథమంగా ప్రభుత్వోద్యోగుల విషయంగా యీ దిగువ పేర్కొనబడిన చర్యలను తీసుకుంటామని యీ సంవత్సరం ఫిబ్రవరి నెలలో ప్రకటించారు.

1. ఇపుడున్న కుటుంబ పరిమితిని మించి అధికంగా సంతానాభి వృద్ధిని చేసుకొనేవారికి, కార్లు-స్కూటర్లు కొనుగోలు చేయటానికి అప్పులు ఇవ్వరు. అలాగే గోధుమలు వగైరా అత్యవసర వస్తువులు చవుకగా, వీలుగా సరఫరా చేయరు.

2. ప్రస్తుతము స్త్రీ ఉద్యోగికి జీతముతో 3 నెలల ప్రసూతి సెలవు మంజూరు అయ్యే నిబంధన ఉన్నది. ఇక ముందు మొదటి ఇద్దరు పిల్లలకు తడవకు 5 నెలల ప్రసూతి సెలవు యిస్తారు. మూడో పిల్లనుండి జీతముపై సెలవు యివ్వరు.

3. ఇక క్రొత్తగా ప్రభుత్వోద్యోగములో చేరేవారు ఇరువురికన్న మించి సంతానాన్ని కనబోమని హామీ ఇవ్వాలి.

4. బదిలీలు అయినప్పుడు ఇద్దరు పిల్లలకు మాత్రమే ప్రభుత్వ ఖర్చుపై ఉచిత రవాణా సౌకర్యము వుంటుంది.

5. ఇద్దరుపిల్లలు కలవారికి మాత్రమే గృహ వసతి కల్పించ బడుతుంది.

6. ఇప్పటికీ గృహ వసతి తక్కువ రేటుతో యివ్వబడిన వుద్యోగులకు యిద్దరికి మించి సంతానము వుంటే వారు సంవత్సరములోగా కుటుంబ నియంత్రణ ఆపరేషను చేయించుకోకపోతే వారివద్ద మార్కెట్టు రేటుకు అద్దె వసూలు చేస్తారు.

7. వైద్య సౌకర్యం ఇద్దరు పిల్లల వరకే ఉచితము.

ప్రభుత్వోద్యోగులకు మాత్రమేకాక ప్రజలలో ఇతర వర్గాలకు కూడ యిలాంటి నిర్బంధాలు ఏర్పరుస్తామని మంత్రి సూచించారు.

అమలు జరుపడానికి అవసరమైన ప్రభుత్వ యంత్రాంగం లేదు కనుకను, అమలు జరుపడంలో కొంతగా అవినీతి చోటు చేసుకొనుటకు అవకాశము ఉన్నందునను పూర్తి నిర్బంధం వీలు కాకపోవచ్చు. కాని తగినంత జాగ్రత్తతో నిర్బంధ చర్యలకు గడంగుట అత్యవసరము. అట్టి చర్యలను ప్రజాస్వామిక వాదులు హర్షించి సమర్థించవలసి వుంటుంది.

('వికాసం' మాసపత్రిక ఏప్రిల్ 76)

# నారి సంస్కృతి

మానవుడు కోరేది ఆనందం. ఇది బంధవిముక్తివల్ల వస్తుంది. బంధం పోగొట్టుకోవటానికి స్వేచ్ఛ కావాలి, స్వేచ్ఛగా జీవించటానికి స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం కావాలి. ఇది ఏక జాతిపరం కాదు. విశ్వజనీనం, ఇదొక విశిష్ట దృక్పథం, విలక్షణ జీవిత విధానం. సామాజిక స్వాతంత్ర్యం ఎంత ముఖ్యమో వ్యక్తి స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు అంత ముఖ్యమని ఘంటా పథంగా నిర్దేశింప బడాలి. ఇవి స్త్రీలకు అందుబాటులో వున్నవా? పాశ్చాత్య స్త్రీలలో కూడా లేవు. కనుకనే అంతర్జాతీయ మహిళా సంవత్సరాన్ని సంకల్పించారు ఐక్యరాజ్య సమితి వారు. స్త్రీ పురుషుల మధ్య సమత్వం కోసం స్వాతంత్రంకోసం సాగుతున్న పోరాటంలో నవశకానికిది నాంది పల్కాలి.

వెయ్యేండ్లనాటి చట్టాలు, ఆచారాలు ఈ నాటి సాంఘిక పరిస్థితులకు అనుగుణమా? కాదా? అనేది ఆలోచించాలి. నేటి మానవుడు విశ్వమానవుడైనాడు. విజ్ఞాన ప్రపంచంలోకి రోజుకొక క్రొత్త మార్గం చూపబడుతోంది. సాంఘిక వ్యవస్థ రోజు రోజుకూ మారుతోంది కానీ పాతకాలపు మూఢాచారాలు, అలవాట్లు మారకపోగా అజ్ఞానం, అవిద్యలతోపాటు అవీ కూడా పెరుగుతున్నాయి. సమాజంకూడా కాలంతోపాటు పునర్వికాసం చెందక తప్పదు. ఈ ఆధునిక సంఘంలో స్త్రీకి ఏ స్థానం యివ్వాలన్నదే గడ్డు సమస్య. ఈ సమస్య సక్రమంగా, న్యాయంగా పరిష్కరింపబడిన నాడే సమాజం పురోగమించ గలదు.

స్వరాజ్యం వచ్చి 27 సం॥లు దాటింది. ఇప్పటికీ స్త్రీకి సాంఘిక, ఆర్థిక రాజకీయ వ్యవహారాల్లో సమాన ప్రతిపత్తి వున్నదా? పంచాయతీ నుండి పార్లమెంటు దాకా ఎన్నికల్లో పాల్గొన వచ్చని శాసనం వుంది. కాని ఆచరణలో అది ఎందుకు వ్యర్థమైనది? యం. ఎల్. ఎ; యం. పి. లుగా ముఖ్యమంత్రులుగా, జడ్జీలు, రాయబారులు, కలెక్టర్లు, గవర్నర్లుగా స్త్రీలకెన్ని స్థానాలున్నాయో మనందరికి తెలుసు. న్యాయంగా చెప్పాలంటే స్త్రీలను వెనుకబడ్డ తరగతులవారి, నిమ్న జాతులవారి జాబితాలో చేర్చినా స్పష్టత వుండేది. అలాకాక రాజ్యాంగంలో, శాసనాలలో మాత్రం సమానత్వం చూపెంచి స్త్రీలకు కొద్ది సీట్లు రిజర్వుచేశారు. ఆచరణలో మాత్రం అసమానత్వ భావంవుంది. రాజకీయ, ఆర్థిక, సాంఘిక రంగాలలో పురుషాధిపత్యం విలయతాండవం చేస్తోంది. అంతదాకాయెందుకు? స్త్రీకి ఓటు హక్కు వుంది కానీ సేచ్ఛగా వినియోగించుకొనే హక్కు మాత్రం లేదు. బానిసలుగా చూడబడే స్త్రీలు వివిధ వర్గాలలో వున్నారనేది నగ్న సత్యం. భర్త ఆజ్ఞను తిరస్కరించి ఓటు వేసే భార్య లెందరున్నారో ఆలోచించాలి! కొన్ని సందర్భాలలో విడాకులదాకా రావచ్చు. యజమానిని ఎదిరించి ఓటువేస్తే కూలి పనికి గతిలేదు. ఉద్యోగినిఅయితే అధికారికి లోబడి ప్రవర్తించాలి. ఇదే స్త్రీలకున్న ఓటు స్వేచ్ఛ, రాజకీయ సమానత్వాలకు నిదర్శనం.

3 కోట్ల ముస్లిం స్త్రీలు మురికి కూపాల్లో, ఘోషాతో మగ్గి పోతున్నారు. మానవుడు విజ్ఞాన వీధుల్లో విహరిస్తూ చంద్రుణ్ణి చుట్టి వచ్చినా, లేబరేటరీలో 'జీను'ను సృష్టించినా స్త్రీని తన సొత్తుగా భావించటం చాలా ఘోరం, నైచ్యం అనక తప్పదు. స్త్రీ బైటికొస్తేనే, పరపురుషుణ్ణి చూస్తేనే ఆమెకు శీలాపహరణమా! మరి పురుషుని శీలాన్ని గురించి స్త్రీలు తగు కట్టుదిట్టాలు చెయ్యరేలా? ఇది స్త్రీల ఆత్మాభిమానానికే గొడ్డలిపెట్టు. ఘోషాచే స్త్రీలకు కండ్ల జబ్బులు, టి. బి. లాంటి జబ్బులొచ్చే అవకాశం వుందని గ్రహించి పురుషులు మేల్కొనాలి. స్త్రీల బానిసత్వమనే పంజరాన్ని దైవం, కులం, మతం, సంప్రదాయాలనే ఇనుప కడ్డీలతో బిగించారు. మనువు బిగించిన నులిన శృంఖలాల విముక్తికై స్త్రీలే ప్రయత్నించాలి. ఇలా సాంఘిక, ఆర్థిక, రాజకీయ సాంస్కృతిక రంగాల్లో తమకున్న 'సెకండ్ రేట్ సిటిజన్‌షిప్' నశించాలనీ, ఏ పరిధిలోనూ అసమానత్వ ముండరాదనీ ఎలుగెత్తి చాటాలి.

స్త్రీల ఆలోచనా రీతిలో సమూలమైన మార్పు రానిదే పురుషులతో సమాన ప్రతిపత్తి పొందలేరు. స్వతంత్ర జీవనం ఉన్ననాడు ఆమె పరిస్థితిలో మార్పు వస్తుంది. ఆత్మ విశ్వాసం వస్తుంది. అప్పుడే ఆత్మగౌరవాన్ని నిల్పుకోగల్గుతుంది. తమ బానిస సంకెళ్ళు త్రెంచుకొని స్త్రీలు ఈ దుర్వ్యవస్థ మీద తిరగబడాలి. బ్రిటన్ లాంటి అభివృద్ధి పొందిన దేశంలో కూడ స్త్రీలకు ఆక్స్‌ఫర్డు యూనివర్సిటీలో ప్రొఫెసర్లుగా యిచ్చేవారుకాదు. ఆఖరుకి సీట్లుకూడా వారికి లేవు యిటీవల వరకు. వారు మూడు దశాబ్దాలు అడుగడుగునా పోరాడి స్త్రీలకు సమాన హక్కులు, ఓటు హక్కు సంపాదించిన విషయం మనకు క్రొత్త కాదు. అమెరికన్ స్త్రీలు అనేక కష్టాల నెదుర్కొని వుద్యమాలు నడిపి హక్కులు పొందారు. 1917 రష్యన్ విప్లవానికి పూర్వం స్త్రీ పరిస్థితి చాలా అధ్వాన్నంగా వుండేది. ఆ స్త్రీలు అశేష త్యాగాలుచేసి సర్వశక్తులు ధారపోసి సమానత్వం పొందారు. మానసిక దాస్యంనుండి విముక్తి కావాల్సింది ముమ్మందుగా స్త్రీలే.

స్త్రీకి సంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చినా మానవత్వానికి ప్రధానమైన సహజ కర్తవ్యాలను విస్మరిస్తుందను కొనుట శుద్ధతప్పు. ఆ అపోహవల్లనే పురుష పుంగవులు భయపడుతున్నారు. సంసార సారధ్యంలోను, మాతృత్వ

బాధ్యతలో, దాంపత్య జీవితంలో గాని; స్త్రీలు కర్తవ్యతా విమూఢులుకారు. పరిపూర్ణత్వంగల స్త్రీ స్వయం శిక్షణద్వారా తన జీవితాన్ని సరిదిద్దుకొనగలదు. అప్పుడు తనకు తానే అధినేత. తన్ను శాశించుకోగల శక్తి సామర్ధ్యాలు కల్గిన స్త్రీ యితరులను అలాగే చూడగలదని విశ్వసించాలి.

హిందూ కుటుంబంలో స్త్రీ ఆధారపడి జీవించే ప్రాణి. 'భారతనారి ఆదర్శము' ఆ స్థితిని మార్చటం లేదు. అది ఒక అభూత కల్పన. శాసనాలు ఆచారాలు అసమానత్వంలోను అన్యాయంతోను నిండి నిబిడీ కృతమైనై. మహిళలు సమాజంలో సమాన అవకాశాలు పొందాలంటే పరాధీన స్థితినుండి బైటపడాలి. తమన్యాయమైన స్థానాన్ని దయాదాక్షిణ్యాలుగాకాక హక్కుగా పొందగల్గితేనే మహిళా సంవత్సరోత్సవము సార్థక మవుతుంది. స్త్రీ పురుష భేదం (లింగ భేదం తప్ప) ఏ పరిధిలోను వుండరాదు. దీనికి పురుషులు సర్వవిధాల తోడ్పడి మహిళను మానవ వ్యక్తిగా ఆమోదిస్తేనే 1975 అంతర్జాతీయ మహిళా సంవత్సరం సత్‌సంవత్సర మగును.

('అనామిక' మాస పత్రిక 1975)

---

# స్త్రీలలో హేతువాద దృక్పథం

విజ్ఞానానికి శత్రువు విశ్వాసం. భావవాదానికి భౌతిక వాదానికి బద్ధవైరం. ఒకటి ఉత్తర ధృవం, రెండవది దక్షిణ ధృవం. ఈ రెంటికీ ఎడతెగని పోరాటం. విశ్వాసానికి మందిమార్బలం హెచ్చు. కాని విజ్ఞానం కూడా ఘన విజయాలతో నడుస్తూనే ఉంది. రెంటి దృక్పథాలు పరస్పర భిన్నాలు. సృష్టి జరిగిందనీ, అది వినాశ మవుతుందనీ భౌతిక వాదులు నమ్మరు. కనుక వారి భావనలో దేవుడెగిరి పోతాడు. ఏక కణప్రాణి నుండి బహుకణ ప్రాణి వరకూ, తర్వాత చైతన్యంకల మనిషిగా పరిణామం చెందటానికి కొన్ని కోట్ల సంవత్సరాలు పట్టినట్లు డార్విన్ పరిణామవాద

సిద్ధాంతం తెలియజెప్తున్నది. అలాకాదు. చరాచర ప్రపంచాన్నంతా దేవుడే సృష్టించాడనే మత వాదం ఇంకా ప్రబలంగానే బ్రతుకుతూ ఉంది. భౌతిక ప్రపంచానికి అతీతంగా దేవుడుగాని, ఆత్మగాని, చైతన్యంగాని లేదంటారు భౌతిక వాదులు ప్రకృతి కతీతమైన మహత్తర శక్తి ఉందనీ, అదే దేవుడనీ, అతడు స్వయంభువనీ, రూప నామ రహితుడైన ఆ మహాశక్తి సర్వాంతర్యామియై, నిర్గుణుడై ఈ జగత్తును నడిపిస్తాడంటుంది మతం. ఇలా విరుద్ధంగా ఉన్న ఈ రెండు సిద్ధాంతాలు ఇంతవరకూ నశించలేదు. దేనికదే పెరుగుతోంది. కాని దైవం, ఆత్మ, పరలోకాదులు ఉన్నట్లుగా రుజువు దొరకలేదు. జీవపరిణామ సిద్ధాంతం రుజువుకు నిల్చింది.

శాస్త్రంధ్యేయం జ్ఞానసముపార్జన. సత్యం జ్ఞానవిషయం. జ్ఞానం రోజురోజుకూ పెరిగినకొద్దీ మనం తెలిసికున్న సత్యం మారవచ్చు. ఇవాళ మనకు తెలియనివి అనేకం ఉన్నాయి. కాని ఎప్పటికీ అవి తెలియనివి కావు. నిన్న తెలియని విషయాలు ఈ రోజు తెలిసికున్నట్లే ఈనాడు తెలియని విషయాలను ముమ్ముందు తెలిసికోగలం. కనుక శాస్త్రజ్ఞుడు **(Scientist)** తనకు అంతా తెలుసునని బుకాయించడు. కాగా తెలిసికోగలననే ఆత్మ విశ్వాసంతో ఉంటాడు. ఎన్నటికీ మన ఊహాపోహలకు అందని విషయాలున్నాయనీ, అవి దైవ సంబంధమనీ మతస్తుడు చెప్తాడు. కనుక వారి దైవం అవాఙ్మానస గోచరం.

ఆదిమ మానవుడు గాలికి, ధూళికి, అగ్నికి, మేఘాలకు, కొండలకు భయపడి పూజలుచేసి, ఏదో అతీత శక్తి ఉందని నమ్మి ఆ శక్తినే దేవుడిగా సృష్టించుకొని తనకు తానే సంకెళ్ళు తగిలించు కున్నాడు. అజ్ఞాత శక్తుల పట్ల భయమే మతావిర్భావానికి మూలకారణం. ఆ మతదృష్టి కలిగిన రోజుల్లోనే 'ఈ అగ్ని ఇలా ఎందుకు మండుతోంది?' 'ఈ గాలి ఎందుకిలా వీస్తోంది?' అనే జిజ్ఞాస మానవునిలో కల్గింది. ఆ జిజ్ఞాసే హేతువాదానికి పునాది. ఉపనిషత్తులన్నీ హేతువాద పరంపరలోవే. విత్తుముందా, చెట్టు ముందా? కర్మ ముందా, జన్మ ముందా? పాపపుణ్యాలు చేసే వాడెవడు, చేయించే వాడెవడు? లాంటి తర్క వితర్కాల కధనాలే ఉపనిషత్తులుగా రూపొందాయి. దీనికిది కారణం, దానికిది కారణం, ఇంకో దానికి మరోటి కారణం అంటూ పోయినవారి తర్కం చివరికి ఆగిపోయింది. ఆ ఆగి

1820 వరకు సిటీ స్టేట్సు వుండేవి. వెన్నిస్ రోమ్ ముఖ్య పట్టణం. ఫ్లారెన్సు విద్యకు, సంస్కృతికి గొప్ప. మిలాన్ ఆర్థిక వ్యాపారానికి కేంద్రం. బలమైన కమ్యూనిస్టు పార్టీ ఇచ్చట వుంది. వెన్నిస్ ఆకర్షణీయమైనది. ప్రపంచంలో మరెచ్చటా చూడలేనిది. సముద్రం పాయల మీద నగరమంతా కట్టారు. రోడ్లు లేవు. వాకిళ్ళముందు కాలువలుంటై. వాటిపై వంతెనలుంటై. అవి దాటాలి, లేదా పడవలపై కాలువదాటి బైటికి రావాలి. వంతెనలు 400 పైగా వున్నై.

ఫ్రాన్సులో శిల్పాలన్నీ నెపోలియన్‌తోనే దేశ చరిత్ర ప్రారంభమా అన్నట్లు నెపోలియన్ నిర్మించిన శిల్పాలు రకరకాలుగా వుంటై. దేశమంతా సుందరమైన ఆర్చిలు, రోడ్లు, లైట్లు, ఇరువైపులా చెట్లు, తోటలు, అనేక శిల్పాలున్నై. ఎఫిల్ టవర్ చూచుటకై జనం తండోప తండాలుగా వస్తారు. లాన్ త్రొక్కితే, ఫొటోలుతీస్తే ఫైను వేస్తారు. స్త్రీ పురుషులు చాలా అందంగా, ఆరోగ్యంగా వుంటారు.

ఐరోపా సంస్కృతి నుండి మధ్య ప్రాచ్య సంస్కృతిలో అడుగుపెట్టాం. ఇది పర్షియన్‌గల్ఫ ప్రాంతరాజ్యం. అబుదబి, దుబాయి, షార్జా, అజ్‌యాన్ దేశాలు చూచాం. ఇచ్చట 2 లక్షల జనాభాలో 60% మళయాళీలు, 12% అరబ్బులు, మిగతావారు విదేశస్తులు. ఇచ్చట నూనె తప్ప ఏమీ ఫలించని ఎడారి ప్రదేశాలున్నై. మత పిచ్చి వీరికధింగా వుంది. మసీదులు మిక్కుటం. ఖురాన్ పఠనం అమోఘం. టి.వి లో మత ప్రచారమే అధికం. స్త్రీలు మాత్రం మసీదులకు రారాదు. బైటికే సామాన్యంగా రారు. నిండా ముసుగేకాక ముక్కుపై తోలుపట్టా కట్టుకుని రావాలి. స్త్రీలకసలే హక్కులు, అధికారాలు, సమానత్వం లేనట్లు తోచింది. వారు కోరే పరిస్థితిలో లేరు. అచ్చటి 'లా' బ్రేక్ చేస్తే శక్షలు చాలా కఠినంగా వుంటై. త్రాగుడు పూర్తిగా నిషేధం (లైసెన్సు లేనివారికి).

నిరక్షరాశ్యతా నిర్మూలన, వయోజన విద్య ప్రబోధములతో కూడిన స్త్రీ విద్యా వ్యాప్తి మన దేశంలో జరగక పోతే మన దేశానికి భవిష్యత్తు లేదనే విషయం నా విదేశీయాత్ర వలన నాలో స్థిరపడింది.

("వికాసం" 1982)

# గాంధీయిజం - హ్యూమనిజం

"కోట్లాది జనం గాంధీని పూజించి, శ్రద్ధాంజలి ఘటించి మహా పురుషుడుగా గౌరవించారు. కాని బోధలు తిరస్కరించి, వ్యక్తిత్వాన్ని కించపరిచారు. మనిషిని నమ్మారు సిద్ధాంతాన్ని వమ్ముచేశారు" అన్నాడ లూయీ ఫిషర్. ఎందుకు అనుసరించలేక పోతున్నాం? ఆయన బోధలు పురాణ గ్రంథాల్లా ఆచరణ యోగ్యాలు కావా? స వి మ ర్శ నా దృష్టితో పరిశీలించాలి.

గాంధీయిజంలో నిష్కామ్యం, నిరాడంబరత, విశ్వమానవత, అస్తేయం అపరకీయం, స్వయం కృషిలాంటి కొన్ని మాత్రం సార్వకాలిక సందేశ లున్నై. లక్ష్యాలు - సాధనాలు, అంటే మార్గము - ధ్యేయము రెండు పవిత్రంగా ఉండాలని భావం. ఈ నీతిని రాజకీయాల్లో జొప్పిం ప్రయత్నించాడు. సామాన్య జీవితం - ఉదాత్త భావాలు కలిగుండ లంటాడు గాంధీ. నాకు బ్రిటిష్ వారిపై ద్వేషంలేదు. వారి విధానాలపై మాత్రమే నన్నాడు. ఇది మానవతా దృక్పథం. త్రికరణ శుద్ధితో మ మాచరించిననాడే ప్రభుత్వాన్ని, ప్రజలను అడిగే హక్కున్నదన్న గాం వాదనలో నగ్నసత్యముంది. సిద్ధాంతాచరణలో వెనకడుగులేని కార శూరుడు. కర్మయోగి. మానాన్ని పోగొట్టుకున్న కాందిశీక స్త్రీలను వివా మాడమని యువకులకు బోధించిన దయాశీలి. స్త్రీ జనోద్ధరణ, స్త్రీ పురు సమానత్వంలో రాజీ కోరని వ్యక్తి.

వివాదాస్పదమైన అంశాలలో సత్యాహింసలున్నై. 'పరమేశ్వరు సత్యం మిగిలినది మిథ్య' అన్నాడు స్వీయ చరిత్రల్లో. ఇది ఆధ్యాత్మి వాద చిహ్నం. జీవిత విధానంలో, రాజకీయాలలో కూడ పురుష ప్రయ త్నంపై విశ్వాసమున్నది కదా! తాను అహింసావాది నన్నాడు. పాకిస్తాన్ వ్యతిరేకంగా కాశ్మీర్‌పై భారత విమానాలు ఎగురుట చూచి "అచ్ఛా" అ తానే అన్నాడు. ప్రేమ, దయ, క్షమ, ఓర్పులతో కూడిన సత్యాగ్రహము నిరాహారదీక్ష, ఆత్మబలి ద్వారానైన ఎదుటి వ్యక్తి ప్రవృత్తి మారాలనే గాంధీ సత్యాగ్రహ నిర్వచనము. ఒక్క లూథర్‌కింగ్ మాత్రం అహింస

వాదిగా నిలిచి గాంధీవలెనే హత్యచేయబడ్డాడు. నవకాలీ పాదయాత్ర, ఖిలాఫత్ ఉద్యమ నాయకత్వం హిందూ ముస్లిం ఐక్యతని నిరూపిస్తె. కాని గాంధీకి భగవద్గీత ప్రామాణ్యం, వర్ణాశ్రమ ధర్మాలున్న రా మ రా జ్య ం ఆదర్శం. గాంధీని హిందూ సంస్కృతి రక్షకుడని, హిందూ మతాభిమానియని ముస్లిములు వేర్పాటును కోరారు. మతవాద ప్రతీకయైన గాడ్సే చేతుల్లో హత్యగావించ బడ్డాడు. ఐక్యత పటాపంచలైంది. వర్ణాశ్రమ ధర్మరక్షణొక వైపు, హరిజనోద్ధరణ మరొకవైపు. పెట్టుబడిదారీ విధానానికి వ్య తి రే క ం – పెట్టుబడిదారులకు సన్నిహితత్వం. గాంధీకి సెక్యులరిస్టు భావాలున్నా స్వమతాభిమానామే మిన్న లౌకిక రాజ్యవాది మాత్రమేకానీ లౌకికవాదికాడు. స్వదేశి, రాట్నము, మద్యపాన నిషేధాలు అచిరకాలంలోనే మాయమైనై. అక్టోబరు 2న గాంధీజయంతి, 3న బ్రాందీషాపులప్రారంభం. గాంధీకి పారిశ్రామికాభివృద్ధి గిట్టదు. రాట్నంతో, కుటీర పరిశ్రమల్తో కోట్లాది జనాన్ని పోషించగలమా? పాశ్చాత్య సంస్కృతి, నాగరికత లంటే గాంధీకి నిరసన. ఆధునిక విజ్ఞాన గ్ర హ ణ మే ఈనాటి సమాజానికి శరణ్యమని తేలింది. దీనికి ప్రాక్ పశ్చిమ అవధులు లేవు. హృదయ పరివర్తన ద్వారా ధర్మకతృత్వ సిద్ధాంతాన్ని ప్రవచించాడు. అది ఈనాటికీ నె ర వే ర లే దు. ప్రజలలో తగిన మనఃపరివర్తన స్థాయి ఉంటేనే నిలుస్తుందని తేలింది. తాను భంగీ కాలనీలో నివశించినా, హరిజనులచే దేవాలయ ప్రవేశం జరిపించినా అస్పృశ్యత పెరిగిందే కాని–కుల, మత, జాతి వివక్షత సమసి పోలేదు. కారణం ఏమిటి ? ప్రశ్న ప్రశ్నగానే వుంది. మహాత్ముడు ఇంద్రియ నిగ్రహంద్వారా ఆత్మశుద్ధి పొందాలని, బ్రహ్మచర్యం ఆత్మ సంయమనానికి మార్గమన్నారు. మానవాళికి దుస్సాధ్యమయిన బ్రహ్మచర్యాన్ని ప్రజలు స్వీకరించగలరా! ఇది ఆచరణలో శూన్యమయింది. తన విశ్వాసాలను, నమ్మకాలను 'అంతరాత్మ' ప్రబోధంగా సర్వులూ ఆచరించాలనటంలో వ్యక్తి స్వేచ్ఛకు తా వు ం డ ద ని మేధావులంటున్నారు. మానవుడే సమాజానికి మూలం సర్వానికి కొలమానం. కనుక వ్యక్తిత్వానికి ప్రాధాన్యమిస్తారు ఆధునికులు.

గాంధీయిజం, హ్యూమనిజం రెండూ మానవతావాదాలే. సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతికాల్లో రెండూ నీతినే కోరినై. కాని మార్గాలు విరుద్ధాలు. సృష్టికి మూలం నీతి – నీతికి మూలం ధర్మమని రెంటికీ తేడా

లేదంటుంది గాంధీయిజం. వారి నీతి మత ప్రాతిపదిక గల నీతి. ప్రజాస్వామికం పరిపాలనలోనే గాక మానవ సంబంధాలలో ముఖ్యపాత్ర వహించాలనేదే నైతిక మానవవాదం. అది ఇతరుల హక్కులతో తన హుందాతనాన్ని సమన్వయ పరచుకుంటూ సృజనాత్మక జీవన నడవడివల్ల వ్యక్తి సంపూర్ణ వికాసానికి దోహదం కోరుతుంది. "భగవంతుని కృపచే బైటపడ్డానని" స్వీయకథలో గాంధీ అన్నారంటే దైవభక్తి, విశ్వాసం గాంధీయిజంలో వున్నై. హేతువాద ప్రబోధమే హ్యూమనిజానికి పునాది. మానవ జీవితంలో ఆధునికత, శాస్త్రీయ దృక్పథం, తాత్వికచింతన ముఖ్య మన్నాడు యం. యన్. రాయ్. భౌతిక పరిస్థితులను మెరుగు పరచే నిమిత్తం వ్యక్తి స్వేచ్ఛను వమ్ముచేయరాదని, మౌలిక పరిశోధనపైనే అభ్యుదయం ఆధారపడుతుందని, దానికి మానసిక స్వేచ్ఛ మూలమని మానవవాద సిద్ధాంతం. వ్యక్తి వికాసం, శ్రేయస్సే సంఘ శ్రేయస్సుకు కొలమానమని, విజ్ఞానశాస్త్రాన్ని మానవ జీవితంతో జోడించి వ్యక్తిని పూర్ణవికాస జీవిగా చేయగల సిద్ధాంతమే నవ్య మానవ వాదం. భావ వాదం గాంధీదయితే, భౌతికవాదం రాయ్‌ది. నవ్య మానవవాద తత్వవేత్త రాయ్ ప్రవచించిన హ్యూమనిజాన్ని, జాతిపిత, యుగకర్త గాంధీ నిర్వచించిన సిద్ధాంతాన్ని సునిశిత దృష్టితో అవలోకన చేయుడం ఈనాటి సమాజాని కెంతేని అవసరం.

('వికాసం' మాసపత్రిక నవంబరు 75)

---

# నేటి సినిమాల్లో స్త్రీ పాత్ర

స్త్రీ పాత్రలేని సినిమా ఏ దేశంలో, ఏ కాలంతో, ఏనాడూ లేనేలేదు. కాని ఆ పాత్ర చిత్రణలో మాత్రం నైచ్యం, లొంగుబాటు తనం, అణగారిన తత్వం, విధేయత చాలా జుగుప్సాకరంగా చిత్రిస్తున్నారు నిర్మాతలు. ఈనాటి వరకు తెలుగు చిత్రకళారంగంనుండి స్త్రీకి హోదా, స్థాయి, స్థానము, వ్యక్తిత్వం, సమానత్వం వున్న చిత్రమే విడుదల కాలేదన్నది నగ్నసత్యం. చూపుమేరలో రాగలవన్న ఆశా లేదు. నేటి తెలుగు చిత్రాల తీరు తెన్నుల గూర్చి ఆలోచిస్తుంటే - బాధా, నిరాశా, నిస్పృహ, అసహ్యం పుట్టు కొస్తున్నాయి. చిత్రం చివర్లో ఆమెను చరణదాసిగా చిత్రిస్తారు. స్త్రీ గడప దాటితే చెడిపోతుందని నమ్మిస్తారు. 'రేప్' చేయబడ్డ స్త్రీకి చేసినవాడితో వివాహమే చరమాంకం అవుతోంది. అలాచేస్తే సమాజం హర్షిస్తుందని, ఆమె సంస్కరించుకొని బ్రతికితే భ్రష్టురాలవు తుందని చిత్రీకరిస్తున్నారు. లేదా ఆ పాత్ర చావనైనా చావాలి. మగడెన్ని హింసలు పెట్టినా, మరెన్ని దారుణాలకు పాల్పడ్డా భార్య లొంగిపోవాలి. పురుషాధిపత్యం, పురుష దురహంకారం ఆమె మహా సహనంతో, సంతోషంతో భరించాలి. విడాకులు పుచ్చుకున్న స్త్రీని పొగరుబోతుగా, గర్విష్ఠిగా చూపిస్తారు నిర్మాతలు. చదువుకున్న స్త్రీని అహంకారిగా, ఉద్యోగం చేసే గృహిణి భర్తకు లొంగి పడి వుండకపోగా భర్తను తిరస్కరిస్తుందనిపిస్తాడు దర్శకుడు. సంఘ సేవా అనురక్తురాలైన స్త్రీని షో కేసులో బొమ్మలా మేకప్ చేసి నిలబెడ తారు. మహిళా సంఘాల కార్యకర్త కుటుంబ బాధ్యతలు, పిల్లలపై అజమాయిషీ విస్మరిస్తుందని ఆమె పాత్రకు నిర్వచనం చేస్తారు. విద్యకంటే స్త్రీకి వివాహమే ముఖ్యమని నిరూపిస్తారు. ఏ పిల్లయినా కన్యగా జీవిస్తే అదేదో మహాపరాధంగా చూపిస్తూ, ఆమెకు రంకులు కట్టి ఆనందిస్తారు. స్త్రీ అబల అనీ, 'తీగె' అంటూ దానికెప్పుడూ ఏదో ఒక ఆధారం అంటే - ఏదో మగదిక్కు రక్షణే శరణ్యం అనేది అన్ని చిత్రాల్లో దృగ్గోచర మవుతుంది. అణగారిన స్త్రీ జీవిత సమస్య అంటే, భర్త దౌర్జన్యమే - దానికి గుణపాఠం. 'తిరుగుబాటే' అనే ప్రయోజన కరమైన పరిష్కార మార్గాన్ని సూచిస్తూ, కళాత్మక విలువలతో కూడిన చిత్రమే కనపడదు - ఇలా అత్యుత్తమైన ప్రచార సాధనం స్త్రీ జాతిపట్ల దుర్వినియోగం అవుతోంది.

ప్రేక్షకుల అభిరుచులను బట్టి చిత్రాలు తీస్తామని దర్శకులు; స్త్రీల తిరుగుబాటును చిత్రిస్తూ ఫిలిం తీస్తే ఆర్థికంగా దెబ్బతింటామని నిర్మాతలు వాదిస్తారు. నిర్మాతల కోరిక ప్రకారమే కథ, మాటలు, సంభాషణలు వ్రాయక తప్పుతుందా అంటున్నారు రచయితలు - మాదేముందండీ? ఎలా నటించమంటే అలా నటించడమే మా కర్తవ్యమని నటీ నటులు చెప్తున్నారు. ఏదో ఒక సినిమా కాలక్షేపానికి, వినోదానికి చూస్తాం; కాస్త విశ్రాంతి కావాలి గదా! సంసారం, ఉద్యోగం తెచ్చే సమస్యల నుండి విముక్తికి సినిమా చూడక తప్పదు గదా! అంటున్నారు ప్రేక్షకులు. ఇలా ఒకరిపై ఒకరు నెపం వేస్తూ తప్పించు కుంటున్నారు.

ఈనాడు చిత్రకళా రంగం ఒక భారీ పరిశ్రమలా తయారయింది. పెట్టుబడి పెరిగిన కొద్దీ కళాత్మక విలువలు తగ్గి వ్యాపార విలువలకే ప్రాధాన్యత లభిస్తున్నది. సాంకేతిక రంగంలో అభివృద్ధి పెరిగింది; మానవ విలువల స్థాయి దిగజారిపోయింది. అసలు ప్రభుత్వ సబ్సిడీ కోసమే కొన్ని చిత్రాలు తీస్తున్నారు. నల్లడబ్బును మారకం చేసేందుకు సాధనాలయినాయి మరికొన్ని చిత్రాలు. ఈ పరిస్థితిలో స్త్రీల అభ్యుదయం ఎవరికి కావాలి? నిర్మాతల దృష్టి నీచాభిరుచులను రేకెత్తించే 'సెక్సు' నేర ప్రధానమైన ఇతివృత్తాల మీదికి పరిగెత్తింది. కారణం? డబ్బు ! డబ్బు !! డబ్బు !!! అందుకే చిత్రాల సంఖ్య పెరుగుతోంది కాని క్వాలిటీ మాత్రం తగ్గుతోంది. మంచి - చెడూ నడతలకు సందేశాన్ని ఇవ్వగల ఈ ప్రచార సాధనం ద్వారా అనాగరిక, అసభ్య, అవినీతి కరమైన తాత్కాలికోద్రేకాలను రెచ్చగొట్టే హక్కు నిర్మాతలకు ఎవరిచ్చారు? వారికి సామాజిక బాధ్యత లేదా! అన్నప్పుడు - ప్రమాణాలు దిగజారటానికి ప్రేక్షకులే కారణ మంటున్నారు వారు.

1931 లో సినిమాలు కళ కోసం, సాంఘిక ప్రయోజనం కోసం, సామాజిక స్పృహతో తీసేవారు. సముద్రాల, బలిజేపల్లి, దేవులపల్లి, తాపి ధర్మారావు లాంటి వారు విప్లవ భావాలతో, సాహిత్యపు విలువలుగల రచనలు చేసేవారు. ప్రయోజనాత్మకమైన ప్రబోధాత్మకమైన ఇతివృత్తాలనే చిత్రించేవారు దర్శకులు — 1938 లో మాలపిల్ల, రైతు బిడ్డ (గూడవల్లి రామబ్రహ్మం) గృహలక్ష్మి, సుమంగళి, వందేమాతరం (బి. ఎన్. రెడ్డి)

మళ్ళీ పెళ్ళి (వై. వి. రావు) వరవిక్రయం (సి. పుల్లయ్య) 1951 లో మల్లీశ్వరి (అత్యుత్తమ కళాఖండం), 54 లో బంగారుపాప, (మానవ మనస్తత్వం చిత్రీకరించిన చిత్రం.) 45 లో 'బీదలపాట్లు, గుమాస్తా, 55 లో రోజులు మారాయి (చాణక్య) 1974 లో భూమికోసం (తిలక్) 80 లో మా భూమి (గౌతమ్‌ఘోష్) లాంటివి మచ్చుతునకలు. చక్రపాణి, నాగిరెడ్డి లాంటి వారిలో ఉత్తమాభిరుచులు, ప్రబోధాత్మక తృష్ణ తప్ప వ్యాపార దృష్టిలేదు. అయినా వారికెవరికీ నష్టాలు రాలేదు; పేరు, గౌరవం చిరస్థాయిగా నిలిచాయి.

ఇక స్త్రీల పాత్రలు పరిశీలించి చూద్దాం. అసలు చిత్రం పేరులోనే స్త్రీ స్వరూప స్వభావాలు ధ్వనింప జేస్తారు - దాసి, ఆడబ్రతుకు, నాలాగా ఎందరో, నాదీ ఆడజన్మే, మాంగల్యబలం, చరణదాసి, నీడలేని ఆడది, అవసరానికో ఆడది, మనసు - మాంగల్యం లాంటి పేర్లుగల చిత్రాలెన్నో వున్నాయి. ఇలాంటి వాటికి చాలా అవార్డులొచ్చాయి కూడా. కారణం- అసలు సినిమా రివ్యూలు వ్రాసేది పురుషులే కదా! చూచేవారిలో 89% సనాతన, సంప్రదాయ పరులేకదా! వారికి స్త్రీ అగచాట్లు, అసమానత్వం బాగా నచ్చుతాయి. అసలు ఉత్తమ చిత్రాలు వేరు, 'సాంఘిక ప్రయోజనం వేరు. సామాజికంగా నిష్ప్రయోజనమైన చిత్రానికి కూడా సంగీతం, కథ, కళ, చిత్రీకరణ, సాంకేతిక నిపుణతలు వుంటే ఉత్తమ చిత్రంగా అవార్డు రావచ్చు.

స్త్రీల అర్థనగ్న సన్నివేశాలు పెరిగినై. ఈనాడు జ్యోతిలక్ష్మి, జయమాలిని నృత్యం లేని చిత్రం లేదని చెప్పటం సాహసం కాదు. సభ్యత, సంస్కారంలేని అశ్లీల దృశ్యాలనే శృంగార దృశ్యాలని, హాస్యరసమని ముభ్య పెడుతున్నారు. ఆ నృత్యాలతోపాటు ద్వంద్వార్థస్ఫోరకాలైన సంభాషణలు, పాటలు, ''లే లే లేవనంటావా? నన్ను లేపమంటావా?'' "చలి చలిగావుంది - కసి కసిగా వుంది'' లాంటి అసభ్యకరమైన పాటలు కోకొల్లలుగా వస్తున్నాయి. శృంగార మిళితమైన 'డ్యూయెట్లు' 'పలుకరాదటే చిలుకా' లాంటివి ఎంత ఆహ్లాదాన్ని, హాయిని కలిగిస్తాయో! ఇక స్త్రీపాత్ర చిత్రణ ఘోరాతి ఘోరంగా చిత్రిస్తున్నారు. అత్యుత్తమ కళాత్మక సంగీత ప్రధాన చిత్రం 'శంకరాభరణం'లో రేప్ చేయబడ్డ

తులసి పాత్రకు మరణమే శరణ్యమయింది. శంకరశాస్త్రి స్థానం తులసి కుమారునికి దక్కింది. కాని మహాన ర్తకి, సంగీత లక్ష్మి అయిన తులసికి ఇవ్వలేదు దర్శకుడు కె. విశ్వనాద్‌గారు. ఇక సప్తపది, కళాత్మక సందేశ కథా చిత్రం. ఆమె అన్యకులస్తుని ప్రేమించింది. కాని బావతో పెండ్లి చేశాడు తాత. తాళికట్టినవాణ్ణి భార్యగా స్వీకరించమంది. కాళ్ళా వేళ్ళాపడి బ్రతిమాలింది భర్తను. అతని కామె అపర కాళికాశక్తిలా గోచరించి ఆమెను ముట్టలేక పోతాడు. మళ్ళీ పట్టుకెళ్ళి ఆమె ప్రియుడితో కలిపి ఏడడుగులు వేయించాడు తాత. ఇందులో స్త్రీ వ్యక్తిత్వం లేని ఆటబొమ్మ; తిరగబడి అడగలేని మూగజాతి. 1979 లో యు. విశ్వేశ్వరరావు 'నగ్నసత్యం' చిత్రానికి కేంద్ర ప్రభుత్వ బహుమతి వచ్చిన వాస్తవిక సమస్యాత్మక చిత్రం. మీ చిత్రంలో పోలీసుస్టేషన్‌లో స్త్రీ చెరచబడ్డది కదా! స్త్రీలచేత స్టేషన్ ముందు తిరుగుబాటు చేయిస్తే చిత్రం ఇంకా హైలైట్ అయ్యేది కదా! అన్నప్పుడు స్త్రీలంతా రోడ్లమీద కొచ్చి సభలు పెట్టి తిరగబడ్డ నాడు అలాగే ముగిస్తానండీ! అన్నారాయన.

అంటే సమాజానికి దర్పణం పడుతున్నారు దర్శకులు. కాని సమాజానికి మార్గ దర్శకత్వం వహించడం లేదు దర్శకులు అనేది ముఖ్యం. ఇల్లు విడిచి వెళ్ళిన స్త్రీ చెడిపోతుందంటూ స్త్రీ స్థానం నాలుగు గోడల మధ్యే నని శాశించే చిత్రం 'లక్ష్మణ రేఖ'. చదువొక పైపు, సంస్కారంమరోపైపు చూపుతూ స్త్రీకి చదువు ముఖ్యం కాదంటూ నిరూపించే చిత్రం 'స్వర్గం నరకం'. ఒక స్త్రీ మీద పంతం పట్టి, మత్తుమందు చల్లి ఆమెకు సూత్రం కట్టి భర్త అవుతాడు. సూత్రం ఎలా కట్టినా వాడే మగడు అన్నది 'షరా మామూలే' గదా! అనేది 'జీవన తరంగాలు'లో చూపించారు. 'రేప్' చేసినవాణ్ణి పట్టి బంధించి తెచ్చి వాడికి భార్య కావాలనేది 'ఓ సీత కథ'లో చూపించారు. నీవు కట్టిన తాళి నీవే తెంపెయ్యి అంటుంది భానుమతి 'అంతా మనమంచికే' చిత్రంలో. కాని తానే తెంపే చొరవా, ధైర్యం స్త్రీకి రావాలనేగదా మనధ్యేయం! అదేగదా తిరుగుబాటు మనస్తత్వం. విలన్ దొంగ సాక్ష్యాధారాలతో భార్య శీలాన్ని శంకించటం, మళ్ళీ ఆమె అతని పాదాల చెంత చేరటమే 'ముత్యాలముగ్గు' కథ. ఏ పాపం, తప్పు చేయని మహాప్రేమా స్పదురాలైన 'కృష్ణవేణి'ని ఎవడో చేసిన ఘాతుకానికి

ఆమెను బలిచేస్తాడు భర్త. గోరింటాకు చూడండి - భర్త త్రాగుబోతు, స్త్రీ లోలుడు. భార్యను, పిల్లల్ని నరకయాతన పెడతాడు. కూతుర్ని చంపాడు. తల్లిని తరిమేశాడు. అయినా, తనకు అండగా నిలిచిన కొడుకుని కాదని తిరిగి భర్త పాదాలచెంతకే చేరి అతనికి సేవ చేస్తుంది. నేను సర్వాధికారాలువున్న నీమగణ్ణి. భార్యను కొట్టేందుకు 'లైసెన్సు' మాకు దేవుడు ఇచ్చాడే; నేను చుక్కానినే అంటూ తంతాడు 'మొగుడు కావాలి' చిత్రంలో. ఇక 'మాంగల్యానికి మరోముడి'. అదేదో తిరుగుబాటు అనిపించింది. తీరా చూస్తే మొదటి రాత్రినుండి త్రాగుడు, జూదం, వ్యభిచారం చేస్తూ భార్యను తిట్టి, కొట్టి చిత్రహింసలు పెడితే బైటికెళ్ళింది. తీరా మనసు మార్చుకొని తిరిగొచ్చి ఆ భర్తనే పరమ దైవంగా చూస్తుంది - ఇలా చెప్తుంటే ఎన్నో మరెన్నో.

ఇవిచాలక అర్థనగ్న దృశ్యాలు, సెక్సీ డాన్సులు, 'రేప్' సీనులు లేని చిత్రమే అరుదు. స్త్రీని సెక్సు సింబల్‌గా పరిగణిస్తున్నారు, దర్శకులు. ఎంతగా ఆమె భర్తకు లొంగివుంటే అంత సహనశీలిగా చూస్తారు. ఎన్నో కష్టనష్టాల పాలైన స్త్రీ కంటినీరే నిర్మాతకు కనకాభిషేకం అవుతోంది నాటినుండి నేటివరకు.

సినిమా రంగంలో స్త్రీలను ఇలా నీచంగా చిత్రించటానికి కారణాలనేకం - సనాతన సంప్రదాయ తత్వం, స్త్రీల యెడ నీచభావం; స్త్రీల తిరుగు బాటును ప్రబోధించే చిత్రాలకు పెట్టే పెట్టుబడి నష్ట మవుతుందనే భయం; స్వార్థబుద్ధి, ప్రేక్షకులలో ఉత్తమ కళాభిరుచి లేకపోవటం ప్రభుత్వం ఉదాసీనత వహించటం ఈ దుస్థితికి కారణభూతాలు.

ఈ పరిస్థితి మారాలంటే ఏంచేయాలి? ప్రభుత్వం స్త్రీల హోదాను పెంచే చిత్రాలకే సబ్సిడీ ఇవ్వాలి. ప్రేక్షకులలో ఉత్తమ కళాభిరుచిని పెంచటానికి సంస్కారులు, కళాకారులు, కృషి చేయాలి. స్త్రీలు చైతన్యవంతులై సంఘాలు నిర్మించుకొని దుష్ట చిత్రాలను బహిష్కరించమని ప్రచారం చెయ్యాలి. ప్రజాభిప్రాయాన్ని కూడగట్టాలి. దుష్ట చిత్రాలుతీసే నిర్మాతలను, దర్శకులను, నటించే కళాకారులను నిరసించమని సభల ద్వారా, కరపత్రాలద్వారా ప్రచారం చెయ్యాలి. వాస్తవిక సంఘటనల

ఆధారంతో, సామాజిక సమస్యలపై నొక్కి పెట్టి కొత్త తరహాలో కళాత్మక మైన, ఆలోచనా ప్రేరకమైన చిత్రాలే చిత్రించిన నాడు ప్రజలు వాటి విలువను ఆస్వాదించగలరు. ప్రేక్షకులు ఉత్తమ కళాభిరుచిని కల్పించుకొని అశ్లీల, అవాంఛనీయ. చిత్రాలను, అవినీతి కరంగా స్త్రీని అణగద్రొక్కే చిత్రాలను బహిష్కరించాలి. ఈ బృహత్ సాధనకు సాంకేతిక నిపుణులు, ప్రేక్షకులు పత్రికలవారు, ప్రభుత్వం, సెన్సారు బోర్డు సమాన బాధ్యత వహించాలి. సినీ పత్రికలు, జర్నలిస్టులు నిష్పాక్షికంగా విమర్శించాలి. ముఖ్యంగా స్త్రీలు తమపై జరుగుతున్న దారుణాన్ని తెలిసికొంటే చాలదు. దానికోసం సంఘటిత స్త్రీశక్తి చైతన్యవంతంగా, తిరుగుబాటు మన స్తత్వంతో పోరాడాలి. తోటి స్త్రీలలో జాగృతి, చైతన్యం కలిగించాలి. ఇలాంటి కృషి ద్వారానే స్త్రీకి వ్యక్తిత్వం, సమానత్వం, స్వేచ్ఛలను ప్రతిపాదించే చిత్రాలు రాగలవు. అందుకై సన్నద్ధులూ నడుంకట్టి కార్యరంగంలోకి దూకాలి.

(చిత్రభూమి, వారపత్రిక, మార్చి 1982)

---

# నవ్యమానవ వాదం : నేటి ఆవశ్యకత

ఈ వ్యవస్థ మారాలని, ఈ సమాజం పునర్నిర్మాణం కావాలని కోరే వారిముందు మూడు మార్గాలున్నాయి. వాటిని గాంధీ, మార్క్స్, ఎం. ఎన్. రాయ్ ఉద్దేశించారు. గాంధీ పేరు వాడుకుంటూ మన దేశంలో స్వతంత్రరాజ్య ప్రతిష్టాపన జరిగింది; రష్యాలో మార్క్స్ సూత్రాలకు అనుగుణమైనదని ప్రకటిస్తూ అరవై నాల్గు ఏళ్ళనాడు సోషలిస్టు రాజ్యాన్ని స్థాపించారు. 1948 లో ఎం. ఎన్. రాయ్‌చే ప్రవచింప బడిన నవ్యమానవ వాద సిద్ధాంతం ఏ దేశంలోనూ ఆచరణలోకి రాలేదు. భారత రాజ్యాంగంలోని లోపాలను, సోషలిస్టు పద్ధతి రాజ్య విధానంలోని లోపాలను, బలహీనతల్ని గుర్తించిన తర్వాత ఈ పరిస్థితులను మార్చేందుకు ఒక నూతన తాత్విక దృక్పథం అవసర మవుతుంది. ఈ సందర్భంలోనే ఎం. ఎన్. రాయ్ సిద్ధాంతం ఆవశ్యకత పరిశీలనార్హం అవుతుంది.

ప్రజల చేతుల్లోకి రావాలని ఆకాంక్షిస్తూ, నూతన స్వతంత్ర భారతదేశ రాజ్యాంగం, ఆర్థిక ప్రణాళికలు ఎలా వుండాలో నిర్దేశించి, అధికారాన్ని భారత ప్రజలు స్వీకరించాలని విశేష ప్రచారం సాగించింది అతడే. స్వరాజ్యం రానే వచ్చింది. అతని హెచ్చరికలను ఖాతరు చేయనందున ఆ అధికారం ప్రజానీకానికి దక్కకుండా సమాజంలోని ఉన్నత వర్గాలకు దక్కింది. రాజకీయ జ్యోతిష్కుడు కాడు అతడు. పరిస్థితులను పరిశీలించి, విశ్లేషించి, రాబొయ్యే పరిణామాలను ముమ్మందుగా ఊహించగల సత్తా అతనిది. అది సులభసాధ్యంకాదు. కాగా విషయజ్ఞాన సేకరణ, చారిత్రక దృష్టి, బుద్ధి కుశలత, నిజాయితీ ఎంతేని అవసరం. ఆ గుణాలు అతనిలో చోటు చేసుకున్నాయి విశేషంగా.

రాయ్ ప్రతిపాదించిన నవ్యమానవవాద విశిష్టత ఏమిటో గమనించి తర్వాత అది ఈ నాటికి ఎంతవరకు ఉపకరిస్తుందో, అవసరమో గ్రహించడం సముచిత మవుతుంది.

దేశంలో వర్గ పోరాటం సాధ్యమంటుంది మార్క్సిజం. వర్గాల ఉనికిని, వర్గాల పోరాటాన్ని ఎం. ఎన్. రాయ్ గుర్తిస్తాడు; కాని వర్గ పోరాటాన్ని ఉధృతం చేయటం వల్లనే విప్లవం వస్తుందని రాయ్ అంగీకరించడు. సాయుధ తిరుగుబాటుద్వారా సామాజిక మార్పు వచ్చే రోజులు పోయాయని అంటాడు. పీడిత ప్రజల కోసం పనిచేసే రాజకీయ పార్టీ ప్రజల పైననే ఆధిపత్యం వహించే ప్రమాదం ఉందని హెచ్చరించాడు. సామాజిక పునర్నిర్మాణ ప్రయత్నంలోను, రాజ్యాధికారాన్ని చలాయించే విషయంలోనూ ప్రజలకు భాగస్వామ్యం కావాలంటాడు. ప్రజలచేత ప్రజల పాలన కావాలని పట్టుపట్టాడు. ప్రజల కోసం పరిపాలన సాగించటం సాగనిస్తే ప్రజల ప్రతినిధులమని చెప్పుకునే వారు 'లిబరల్' ప్రజాస్వామ్యంలో లాగా ప్రజలకు పెత్తందార్లు అవుతారని అతని భయం. ప్రజా ప్రతినిధులను అదుపులో వుంచగల ప్రజాసంఘాల నిర్మాణాన్ని అభిలషిస్తాడు. తలకొక ఓటిచ్చి తరువాత 5, 6 సంవత్సరాల వరకు వోటరుని నిర్వీర్యుని చేసే లాంఛనాయుత ప్రజాస్వామ్యాన్ని కాదని, ప్రజల పేరుతో ఏకపక్ష నియంతృత్వాన్ని సాగించే కమ్యూనిజాన్ని కాదని రాయ్ నిర్మాణాత్మక ప్రజాస్వామ్యాన్ని **(Organised democracy)** ని

మంచి చెడ్డల విశ్లేషణను చేసుకొని మంచిని ఎన్నుకోవటమే కదా నీతి. ఆపనిని అంతర్ప్రవృత్తి (Conscience) చేస్తుంది. పరిస్థితులను తెలుసుకోవడమే అంతర్ప్రవృత్తి ధర్మం. కనుక సరిఅయిన విషయజ్ఞానం ఉన్నవాడు - మానవుడు సహజంగా హేతువాది కనుక - నీతిగా ప్రవర్తించగల అవకాశం హెచ్చు. ఇలా బుద్ధి ప్రాతి పదికగాగల నీతికి అగ్రస్థానం ఇచ్చిన ప్రత్యేకత రాయ్‌ది.

ఆర్థిక పునాది, వుపరితలం విషయంలో మార్క్సును సవరించాడు రాయ్. వుపరితలానికి అంటే రాజకీయ, సామాజిక, తాత్విక, నైతిక, సాంస్కృతిక రంగాలకు స్వతంత్ర ప్రతిప్రత్తి వున్నా మౌలికమైనవి ఆర్థిక పరిస్థితులు అంటాడు మార్క్స్. వుపరితలం అనే భావం తప్పని, ఆర్థికంతో అవి సమమైన బలం కలవనీ అంటాడు రాయ్. ఆర్థికత ప్రాముఖ్యతను కాదనడు కాని భావాల బలిమిని గ్రహించమంటాడు రాయ్. బహుశః ఇలా ఆలోచించే కాబోలు భావాలలో మార్పు కోసమై మావో సాంస్కృతిక విప్లవాన్ని కొనసాగించాడు 1966లో; చైనాలో విప్లవం వచ్చిన 17 ఏండ్లకు.

కమ్యూనిస్టు ప్రపంచంలోని సంక్షోభాన్ని - పోలండు, కంబోడియా, ఆఫ్ఘనిస్తానులలో విదేశీ జోక్యాన్ని, హంగెరిలో 1950లో, చెకోస్లావోకియాలో 1968 లో విప్లవాలను అణచి వేయుటం, రష్యా చైనా సరిహద్దు తగాదాలు ఇలా మరెన్నో - పరిశీలించిన తరువాత ఎవరికైనా కమ్యూనిస్టు సిద్ధాంతంలో నమ్మకం సడలితే వారు వుదారవాద (Libaralism) సిద్ధాంతాన్ని చేపట్టనవసరం లేదు. మానవుని నైజగుణాన్ని - అంటే అతనిలోని హేతుత్వాన్ని (Ratioinality) గమనించిన సిద్ధాంతాన్ని రాయ్ ప్రచారం చేశాడు. ఈనాటికి అది వుపకరిస్తుందా లేదా అనేది ప్రజానీకం తేల్చుకోవాలి. ఇలా రాయ్ ప్రవచించిన నవ్యమానవ వాదానికి సమగ్రమైన తాత్విక రాజకీయ, నైతిక, సామాజిక, ఆర్థిక విలువలు వున్నాయి. అన్నింటికీ మానవుడే కేంద్రంగా వుంటాడు. వ్యక్తి స్వేచ్ఛ మూలంగా వుంటుంది హర్యామనిజంలో.

ఏ ఇతర తత్వశాస్త్రానికి లేని ప్రత్యేకవిశిష్టత నవ్యమానవ వాదం ద్వారా ప్రజలకందించిన ఘనుడు ఎం. ఎన్. రాయ్. ఇది నాటికీ, నేటికీ, ఏనాటికైన అవశ్యం అనుసరణీయం.

(ఆంధ్రపత్రిక ఏప్రియల్ 82)

## వికాససాహిత్యం:

| | | |
|---|---|---|
| 1. | మహామనీషి : ఎం. ఎన్. రాయ్ - కొల్లా సుబ్బారావు | 8-00 |
| 2. | ఎం. ఎన్. రాయ్ జీవితము, సిద్ధాంతము — కోగంటి రాధాకృష్ణమూర్తి | 25-00 |
| 3. | ఫాసిజం - ఎం. ఎన్. రాయ్ — అనువాదం రావిపూడి వెంకటాద్రి | 7-00 |
| 4. | నవ్యమానవవాదం : ఎం. ఎన్. రాయ్ - అనువాదం : ఎం. వి. రామమూర్తి, కి. శే. ఆవుల గోపాలకృష్ణమూర్తి | 6-00 |
| 5. | హేతువాదం అంటే....? ఎం. వి. రామమూర్తి | 4-00 |
| 6. | మానవ నాగరికత : ఎం. ఎన్. రాయ్ — అనువాదం డా॥ బి. ఎస్. ఎల్. హనుమంతరావు | 8-00 |
| 7. | ఎమర్జెన్సీలో జైలు అనుభవాలు : ఎం. వి. రామమూర్తి | 3-00 |
| 8. | మనం దేనికి బానిసలం ? మల్లాది సుబ్బమ్మ | 3-50 |
| 9. | తల్లే పిల్లను చంపితే ? ,, | 3-50 |
| 10. | విముక్తి ఉద్యమాలు : మహనీయులు ,, | 3-50 |
| 11. | ఆధునిక స్త్రీ | 12-00 |
| 12. | గాంధీ మార్గం : కోగంటి రాధాకృష్ణమూర్తి | 12-00 |
| 13. | నాస్తికత్వం : నాస్తితత్వం - రావిపూడి వెంకటాద్రి | 12-00 |
| 14. | సెక్యులరిజం — పి. సత్యనారాయణ | 3-00 |
| 15. | నాలో నేను — ఆవుల గోపాలకృష్ణమూర్తి | 8-00 |
| 16. | గోపూజ — మూకందిలాల్ — అనువాదం : రావిపూడి వెంకటాద్రి | 1-50 |
| 17. | వెలిగిన జ్యోతి — మల్లాది సుబ్బమ్మ | 12-00 |
| 18. | ఓ మహిళా : ముందుకు సాగిపో — మల్లాది సుబ్బమ్మ | 7-00 |
| 19. | మారుతున్న సమాజం : మహిళలు | 5-00 |
| 20. | శాస్త్రీయ దృక్పథం : ఎన్. ఇన్నయ్య | 4-00 |
| 21. | **Birth and death of political Parties** — **N. Innaiah** | **50-00** |



రు 20లు పైగా కిమ్మతుగల పుస్తకాలు కొంటే పోస్టేజి ఉచితం, తక్కువైతే పోస్టేజి అదనం - వి.పి పద్ధతి లేదు.

**ప్రతులకు:-** వికాసం, 9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ
మెహిదీపట్నం, హైదరాబాద్-500 028
ఫోన్ నెం. 31423



జననం : 6-8-1924

బి. ఏ. దాకా చదువు.

కుటుంబ నియంత్రణలో శిక్షణ

36 వ ఏట పునర్విద్యా ప్రారంభం

స్త్రీల కుటీర పరిశ్రమల సహకార సంఘం కార్యదర్శి 1958-64

స్త్రీ హితైషిణీ మండలి కార్యదర్శి, బాపట్ల 59-63

గుంటూరు జిల్లా కుటుంబ నియంత్రణ గౌరవ ప్రచారకులు 64-67

శారదా మహిళా విజ్ఞాన సమితి ప్రెశిడెంటు 67-71

బాలికా హయ్యర్ ఎలిమెంటరీ స్కూలు (బాపట్ల) మేనేజరు 64-66

మహిళా విద్యాలయం (బాపట్ల) సెక్రటరి 1969

జిల్లా ప్రొహిబిషన్ ఎడ్వయిజరీ కమిటీ మెంబరు (ఒంగోలు) 1971

ప్రత్యేకాంధ్రోద్యమ కార్యకర్తగా జైలు శిక్ష 1972

ఆం.ప్ర. రాడికల్ హ్యూమనిస్టు సంఘ ప్రధాన కార్యదర్శి 77-79

అభ్యుదయ మహిళా సమాఖ్య ప్రెశిడెంటు (హైదరాబాదు) 79-81

యూరోప్ పర్యటన 1978

ప్రస్తుతం : 'వికాసం' మాసపత్రిక మేనేజింగు ఎడిటరు, పబ్లిషరు.

మహిళాభ్యుదయ సంస్థ అధ్యక్షులు

ఆం. ప్ర. అభ్యుదయ వివాహ వేదిక డైరెక్టరు

మహిళాభ్యుదయ గ్రంథాలయం ప్రెశిడెంటు

ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ ఉపాధ్యక్షులు

అఖిల భారత జనతంత్ర సమాజ్ కేంద్ర సమితి సభ్యులు

భారత రాడికల్ హ్యూమనిస్టు జాతీయ సమితి సభ్యులు

ఆంధ్రప్రదేశ్ తెలుగు రచయితల సంఘం సహాయ కార్యదర్శి